ఓం శ్రీ గణేశాయ నమః

# ముండకోపనిషత్

## ప్రార్థన

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**

**స్థిరైరఙ్గైస్తుష్టువాగ్ంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ..**

**స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః**

**స్వస్తి నస్తార్ క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ..**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

### మంత్రార్థం

ఓం. ఓ దేవతలారా మంగళకరమైన విషయాలనే చెవులద్వారా విందుముగాక! యజ్ఞ కార్యాలలో నిమగ్నమై కన్నులతో మంగళకరమైన వాటినే చూచెదముగాక! సుస్థిరమైన అంగాలతో దేవతలను స్తుతిస్తూ దేవతల మేలుకొరకై జీవితాన్ని గడిపెదముగాక!

ప్రాచీనుడైన ఇంద్రుడు మాకు మంగళకరుడగుగాక! సర్వాన్ని ఎరిగిన పూష (సూర్యుడు) మాకు మంగళకరుడగుగాక!



అరిష్టాలను తొలగించే గరుడుడు మాకు మంగళకరుడగుగాక! బృహస్పతి మాకు మంగళమును చేకూర్చుగాక!

ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక తాపములు (మా యందు) ఉపశమించు గాక!

# ప్రథమ ముండకము

# ప్రథమ ఖండము

## శంకరుల ఉపోద్ఘాత భాష్యం

'బ్రహ్మా దేవానాం' ఇత్యాద్యాథర్వణోపనిషత్ . అస్యాశ్చ విద్యాసంప్రదాయకర్తృపారంపర్యలక్షణం సంబంధమాదావేవాహ స్వయమేవ స్తుత్యర్థం — ఏవం హి మహద్భిః పరమపురుషార్థసాధనత్వేన గురుణాయాసేన లబ్ధా విద్యేతి . శ్రోతృబుద్ధిప్రరోచనాయ విద్యాం మహీకరోతి, స్తుత్యా ప్రరోచితాయాం హి విద్యాయాం సాదరాః ప్రవర్తేరన్నితి . ప్రయోజనేన తు విద్యాయాః సాధ్యసాధనలక్షణం సంబంధముత్తరత్ర వక్ష్యతి 'భిద్యతే హృదయగ్రంథిః' (ము. ఉ. 2 . 2 . 9) ఇత్యాదినా . అత్ర చాపరశబ్దవాచ్యాయా ఋగ్వేదాదిలక్షణాయా విధిప్రతిషేధమాత్రపరాయా విద్యాయాః సంసారకారణావిద్యాదిదోషనివర్తకత్వం నాస్తీతి స్వయమేవోక్త్వా పరాపరేతి విద్యాభేదకరణపూర్వకం 'అవిద్యాయామంతరే వర్తమానాః' (ము. ఉ. 1 . 2 . 8) ఇత్యాదినా, తథా పరప్రాప్తిసాధనం సర్వసాధనసాధ్య విషయవైరాగ్యపూర్వకం గురుప్రసాదలభ్యాం బ్రహ్మవిద్యామాహ 'పరీక్ష్య లోకాన్' (ము. ఉ. 1 . 2 . 12) ఇత్యాదినా . ప్రయోజనం చాసకృద్బ్రవీతి 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' (ము. ఉ. 3 . 2 . 9) ఇతి 'పరామృతాః పరిముచ్యంతి సర్వే' (ము. ఉ. 3 . 2 . 6) ఇతి చ . జ్ఞానమాత్రే యద్యపి సర్వాశ్రమిణామధికారః, తథాపి సంన్యాసనిష్ఠైవ బ్రహ్మవిద్యా మోక్షసాధనం న కర్మసహితేతి 'భైక్షచర్యాం చరంతః' (ము. ఉ. 1 . 2 . 11) 'సంన్యాసయోగాత్' (ము. ఉ. 3 . 2 . 6) ఇతి



చ బ్రువందర్శయతి . విద్యాకర్మవిరోధాచ్చ . న హి బ్రహ్మాత్మైకత్వదర్శనేన సహ కర్మ స్వప్నేఽపి సంపాదయితుం శక్యం ; విద్యాయాః కాలవిశేషాభావాదనియతనిమిత్తత్వాచ్చ కాలసంకోచానుపపత్తేః . యత్తు గృహస్థేషు బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృత్వాది లింగం న తత్స్థితం న్యాయం బాధితుముత్సహతే ; న హి విధిశతేనాపి తమఃప్రకాశయోరేకత్ర సద్భావః శక్యతే కర్తుం , కిముత లింగైః కేవలైరితి . ఏవముక్తసంబంధప్రయోజనాయా ఉపనిషదోఽల్పగ్రంథం వివరణమారభ్యతే . య ఇమాం బ్రహ్మవిద్యాముపయంత్యాత్మభావేన శ్రద్ధాభక్తిపురఃసరాః సంతః, తేషాం గర్భజన్మజరారోగాద్యనర్థపూగం నిశాతయతి పరం వా బ్రహ్మ గమయత్యవిద్యాదిసంసారకారణం వా అత్యంతమవసాదయతి వినాశయతీత్యుపనిషత్ ; ఉపనిపూర్వస్య సదేరేవమర్థస్మరణాత్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

'బ్రహ్మా దేవానామ్' అంటూ ప్రారంభమయ్యే (ఇప్పుడు వ్యాఖ్యానించ బోతున్న) ఉపనిషత్తు అథర్వణ వేదానికి చెందినది. దీనికి గల (ఈ ఉపనిషత్తునకు గల) విద్యను అందించడంలోగల పరంపరానుగత లక్షణాన్ని, దీనికి (ఈ ఉపనిషత్తునకు బ్రహ్మవిద్యతో గల) సంబంధాన్ని కీర్తించే ఉద్దేశ్యంతో ఈ ఉపనిషత్తు ప్రారంభంలోనే తానే స్వయంగా ఇలా చెప్తోంది. మహనీయులైన వారు కూడా ఎంతో శ్రమతో పొందే పరమ పురుషార్థమైన మోక్షాన్ని సాధించిపెట్టే విద్య ఇది అని (బ్రహ్మ)విద్య యొక్క గొప్పదనాన్ని శ్లాఘిస్తున్నారు. వినేవారి బుద్ధిని ప్రేరేపించడం కోసం విద్య యొక్క గొప్పదనం కీర్తించబడుతోంది.

ఎందుకంటే, కీర్తించడం ద్వారా ప్రేరేపించబడినవారికి విద్యయందు కుతూహలం ఏర్పడి వారు విద్యయందు ఆసక్తిగా ప్రవర్తిల్లుతారు (ఆసక్తితో విద్యని అభ్యసిస్తారు). సాధనానికి-లక్ష్యానికి మధ్యగల సంబంధంలాగానే ఈ విద్యకు మరియు అది అందిచే ప్రయోజనానికి గల సంబంధాన్ని 'హృదయంలోని చిక్కుముడి విడివడుతుంది' ['భిద్యతే హృదయగ్రంథిః' (ము.ఉ. 2-2-9)] అన్న పాఠ్యభాగంలో ఉత్తరత్రా చెప్పబోతోంది. ఇక్కడ కూడా ఉపనిషత్తు తనకుతానుగా అపరవిద్య మరియు పరావిద్య అని విద్యలోని తేడాను వేరుచేసి చెబుతోంది. 'అవిద్యలోనే ప్రవర్తించేవారు' ['అవిద్యాయామంతరే వర్తమానాః' (ము.ఉ. 1-2-8)] అని ప్రారంభం కాబోయే పాఠంలో ఋగ్వేదాది లక్షణాలున్నదీ, విధులు-నిషేధాలు మాత్రమే చెప్పబడినదీ, సంసారానికి కారణమైన అవిద్యాదోషాన్ని నివారించలేనట్టిదీ, ఈ అపరవిద్య అని ప్రకటించబోతోంది. 'లోకాలను పరిశీలించి' ['పరీక్ష్య లోకాన్' (ము.ఉ. 1-2-12)] అంటూ మొదలయ్యే పాఠంలో అన్నింటికన్నా ఉన్నతమైన పరాన్ని సాధించిపెట్టేదీ, గురువు అనుగ్రహం చేత లభించేదీ, సమస్త సాధనాలూ లక్ష్యాలపట్ల వైరాగ్యాన్ని కలిగించేదీ అయినట్టి బ్రహ్మవిద్యను బోధిస్తోంది. మరియు (ఈ బ్రహ్మవిద్యవల్ల కలిగే) ప్రయోజనాన్ని, 'బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమే అవుతాడు' ['బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' (ము.ఉ. 3-2-9)] అనీ మరియు 'పరమమైన అమృతత్వంతో ఐక్యమై అన్నింటితో విడివడుతాడు' ['పరామృతాః పరిముచ్యంతి సర్వే' (ము.ఉ. 3-2-6)] అంటూ (ఉపనిషత్తు)



అనేకమార్లు చెప్తోంది. అన్ని ఆశ్రమాల వారికి జ్ఞానం పొందే అధికారం ఉన్నప్పటికీ, సన్యాసమందలి నిష్ఠగల వానికి కేవలం బ్రహ్మవిద్య మాత్రమే మోక్షసాధనం అవుతుంది కాని, కర్మ సహకారిత్వం వల్ల కాదని చెపుతూ 'భిక్షతో గడిపేవాడు' 'భైక్షచర్యాం చరంతః' (ము.ఉ. 1-2-11); 'సంన్యాసయోగం ద్వారా' ['సంన్యాసయోగాత్' (ము.ఉ. 3-2-6)] అని ఉదహరించి చూపిస్తోంది. (ఇలా ఎందుకంటే) విద్యకు కర్మ విరుద్ధమైనందువల్ల. నిశ్చయంగా, ఆత్మ-బ్రహ్మల ఏకత్వాన్ని కర్మ సహాయంతో దర్శించడమనేది కలలో కూడా సాధ్యంకాదు. ఎటువంటి కాల విశేషంతోనూ మరియు ఇతర కారణాలతో కూడా (బ్రహ్మ)విద్యకు సంబంధం లేనందుచేత కాలం చేత (బ్రహ్మ)విద్య ప్రభావితమయ్యే ప్రసక్తే లేదు.

అయితే, కొందరు గృహస్థులు బ్రహ్మవిద్యను సంప్రదాయ పద్ధతిలో గ్రహిస్తున్నారని సూచించబడుతున్నంత (కనపడుతున్నంత) మాత్రంచేత యుక్తితో నిర్ణయించబడిన (కర్మను జ్ఞానంతో సహకారిత్వం లేదనే) సిద్ధాంతానికి వచ్చే ఇబ్బంది ఏమీ లేదు. వంద ఆదేశాలున్నప్పటికీ చీకటి-వెలుగులు కలిసి ఉంటాయని చెప్పడం సాధ్యంకాదు. ఇక కేవలం సూచనలున్నంత మాత్రం చేత ఏమౌతుంది? (రాబోయే 1-1-3వ మంత్రంలో గృహస్థుడైన శౌనకుడు అంగీరసుడిని సమీపించి బ్రహ్మవిద్య చెప్పమని కోరుతాడు. అంటే కర్మలను అనుష్ఠానం చేసే గృహస్థులు బ్రహ్మవిద్యను గ్రహించడమనేది జరుగుతోంది కాబట్టి కర్మకు జ్ఞానంతో సంబంధం ఉండి ఉండవచ్చని

సూచించబడుతోంది కదా అని అనుమానాన్ని వ్యక్తం చేసేటట్లైతే, వెలుగు-చీకట్లు ఉపమానాన్ని చెప్పి సమాధాన పరుస్తున్నారు. కేవలం సూచనలే కాదు ఎన్ని విధివాక్యాలున్నప్పటికినీ వెలుగు చీకటులు కలసి ఉంటాయని చెప్పలేం కదా. అలాగే, ఎన్ని సూచనలు కనబడుతున్నప్పటికీ, కర్మ-జ్ఞానాల సాహచర్యం కుదరదని యుక్తితో నిర్ధారణ చేసిన సిద్ధాంతానికి వచ్చే నష్టమేమీ ఉండదని చెప్తున్నారు)

ఈవిధంగా సంబంధ ప్రయోజనాలను చెప్పి, ఇక ఉపనిషత్తు పాఠానికి క్లుప్తమైన వివరణ ప్రారంభించబడుతోంది. ఎవరైతే ఈ బ్రహ్మవిద్యను ఆసక్తిగా శ్రద్ధాభక్తులతో కూడినవారై ('ఉపయంతి') సమీపిస్తారో, వారియొక్క గర్భమందు జన్మించడం, కృశించడం, రోగము మొదలుగా గల అనర్థాలను ('నిశాతయతి') తొలగిస్తుంది లేదా పరబ్రహ్మ వద్దకు చేరుస్తుంది కాబట్టి దీనిని 'ఉపనిషత్తు' అంటారు. లేదా, సంసారానికి కారణమైన అవిద్య మొదలైనవాటిని పూర్తిగా (అవసాదయతి) నిర్మూలించేది లేదా నశింపచేసేది కాబట్టి కూడా ఉపనిషత్తు అని అంటారు. 'ఉప' మరియు 'ని' అనే ఉపసర్గలతో కూడిన 'సద్' అనే ధాతువునకు ఇదియే అర్థం.



**ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా .**
**స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠామథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ .. 1.1.1..**

ఓం. విశ్వాన్ని సృష్టించిన వాడు, భువనాన్ని పాలించే వాడు అయిన బ్రహ్మదేవుడు దేవతలందరిలోకి ముందుగా సంభవించాడు. అతడు తన జ్యేష్ఠ కుమారుడైన అథర్వునికి, సమస్తవిద్యలకు ఆధారమైనట్టి, బ్రహ్మవిద్యను బోధించాడు.

## శంకరుల భాష్యం

బ్రహ్మా పరిబృఢో మహాన్ ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యైః సర్వానన్యానతిశేత ఇతి ; దేవానాం ద్యోతనవతామింద్రాదీనాం ప్రథమః గుణైః ప్రధానః సన్ , ప్రథమః అగ్రే వా సంబభూవ అభివ్యక్తః సమ్యక్ స్వాతంత్ర్యేణేత్యభిప్రాయః . న తథా యథా ధర్మాధర్మవశాత్సంసారిణోఽన్యే జాయంతే, 'యోఽసావతీంద్రియోఽగ్రాహ్యః' (మను. 1 . 7) ఇత్యాదిస్మృతేః . విశ్వస్య సర్వస్య జగతః కర్తా ఉత్పాదయితా, భువనస్య ఉత్పన్నస్య గోప్తా పాలయితేతి విశేషణం బ్రహ్మణో విద్యాస్తుతయే . సః ఏవం ప్రఖ్యాతమహత్త్వో బ్రహ్మా బ్రహ్మవిద్యాం బ్రహ్మణః పరమాత్మనో విద్యాం బ్రహ్మవిద్యాం , 'యేనాక్షరం పురుషం వేద సత్యం' (ము. ఉ. 1 . 2 . 13) ఇతి విశేషణాత్ . పరమాత్మవిషయా హి సా . బ్రహ్మణా వాగ్రజేనోక్తేతి బ్రహ్మవిద్యా .

తాం బ్రహ్మవిద్యాం , సర్వవిద్యాప్రతిష్ఠాం సర్వవిద్యాభివ్యక్తిహేతుత్వాత్సర్వ విద్యాశ్రయామిత్యర్థః ; సర్వవిద్యావేద్యం వా వస్త్వనయైవ జ్ఞాయత ఇతి, 'యేనాశ్రుతం శ్రుతం భవతి అమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం' (ఛా. ఉ. 6 . 1 . 3) ఇతి శ్రుతేః . సర్వవిద్యాప్రతిష్ఠామితి చ స్తౌతి విద్యాం . అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ జ్యేష్ఠశ్చాసౌ పుత్రశ్చ, అనేకేషు బ్రహ్మణః సృష్టిప్రకారేష్వన్యతమస్య సృష్టిప్రకారస్య ప్రముఖే పూర్వం అథర్వా సృష్ట ఇతి జ్యేష్ఠః ; తస్మై జ్యేష్ఠపుత్రాయ ప్రాహ ప్రోక్తవాన్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**బ్రహ్మ** అనగా సర్వాన్ని వ్యాపించినది, గొప్పదైనది. అంటే ధర్మంలోనూ, జ్ఞానంలోనూ, వైరాగ్యంలోనూ, ఐశ్వర్యంలోనూ సమస్తమైన ఇతరాన్నీ మించిపోయినట్టిది (దానిని మించినది మరేదీ లేనిది) అని అర్థం. **దేవానామ్** ఇంద్రుడు మొదలుగాగల ప్రకాశమే స్వరూపంగాగల వారందరిలోకి **ప్రథమః (సస్)** గుణాలలో ముందుండే వాడు లేదా వరుసలో మొదటి వాడైనందున లేదా **ప్రథమః** మొదటగా **సంబభూవ** తగినట్లుగా స్వతంత్రించి అంటే పాపపుణ్యాల కారణంగా ఇతర సంసారులు జన్మించినట్లుగా కాకుండా, తనంతతానుగా అభివ్యక్తమైనాడని అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ 'అతడు ఇంద్రియాలకు అతీతుడు గ్రహించ బడడు' ['యోఽసావతీంద్రియోఽగ్రాహ్యః' (మను. 1-7)] వంటి స్మృతి వాక్యాలున్నాయి. (సూక్ష్మంగా, వ్యక్తంకాకుండా, శాశ్వతంగా, సమస్త



ప్రాణులలో నిండియున్నటువంటి, ఆలోచనకు అందనటువంటి ఆ ఏకత్వమే, ఇతరముల ప్రమేయం లేకుండా స్వతంత్రంగా ఉత్పన్నమైనది అని గ్రహించాలి). **విశ్వస్య** సమస్త జగత్తును **కర్తా** ఉత్పన్నం చేసినవాడు, సృజించిన వాడు, **భువనస్య** అలా ఉత్పన్నమైనదాన్ని **గోప్తా** పాలించే వాడు అని. విద్యయొక్క మహాత్మ్యాన్ని (ఈ విధంగా) కీర్తించడమే, బ్రహ్మను ఇలా వర్ణించడంలోగల ఉద్దేశ్యం. **సః** ఈ విధంగా ప్రఖ్యాతమైన మహాత్మ్యం గల బ్రహ్మదేవుడు, **బ్రహ్మవిద్యామ్** బ్రహ్మము అంటే పరమాత్మను గురించిన విద్యయే బ్రహ్మవిద్యను, అంటే 'దేనిచే (ఏ విద్యచే) యదార్థమైన అవ్యయమైన పురుషుడు తెలియబడతాడో' ['యేనాక్షరం పురుషం వేద సత్యం' (ము.ఉ. 1-2-13)] అటువంటి విశిష్టత గలిగిన పరమాత్మను గురించి నిర్ధారించి చెప్పే బ్రహ్మవిద్యను (అని అర్థం చేసుకోవాలి). లేదా అగ్రజుడైన (దేవతలందరికన్నా ప్రథముడైన) బ్రహ్మచే చెప్పబడింది కాబట్టి బ్రహ్మవిద్య (అని కూడా అర్థం చేసుకోవచ్చు). అట్టి బ్రహ్మవిద్య, **సర్వవిద్యాప్రతిష్ఠామ్** సమస్త విద్యలను తెలుసుకోవడానికి కారణమైనది కాబట్టి సమస్త విద్యలకు ఆధారమైనట్టిది అని అర్థం. లేదా, సమస్త విద్యలచేత తెలియబడేది కేవలం దీనిచేత (కేవలం బ్రహ్మ యొక్క యదార్థ స్వరూపాన్ని తెలియడం చేత) తెలియబడుతుంది (అని కూడా అర్థం చేసుకోవచ్చు). 'దేనిచే గోచరం కానిది గోచరమౌతుందో, ఆలోచనకు అందనిది ఆలోచింపబడుతుందో, తెలియుట అనే ప్రక్రియకు అందనిది తెలియబడుతుందో' ['యేనాశ్రుతం శ్రుతం భవతి అమతం

మతమవిజ్ఞాతం విజ్ఞాతం' (ఛా.ఉ. 6-1-3)] అని శ్రుతి ప్రకటించింది. విద్యయొక్క ఘనతను కీర్తించడానికే 'సర్వవిద్యాప్రతిష్ఠామ్' అని చెప్తున్నారు. **అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ** జ్యేష్ఠపుత్రుడైన అథర్వునకు **ప్రాహ** బోధించాడు. అనేకములైన సృష్టిక్రమాలలోని ఒకానొక సృష్టిక్రమంలో పూర్వం బ్రహ్మయొక్క పుత్రులలో ప్రముఖుడైన వాడు అథర్వుడు కాబట్టి జ్యేష్ఠుడు అని అర్థం. అటువంటి జ్యేష్ఠపుత్రుని కొరకు బోధించాడు.

**అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాథర్వా తాం పురోవాచాఙ్గిరే బ్రహ్మవిద్యామ్ .**

**స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ భారద్వాజోఽఙ్గిరసే పరావరామ్ .. 1.1.2 ..**

దేనినైతే బ్రహ్మదేవుడు అథర్వునికి బోధించాడో ఆ బ్రహ్మవిద్యను పూర్వం అథర్వుడు తిరిగి అంగిరునకు చెప్పాడు. అతడు (ఆ అంగిరుడు) భరద్వాజ వంశానికి చెందిన సత్యవహునికి బోధించాడు. ఆ భారద్వాజుడు (అంటే భారద్వాజ వంశానికి చెందిన సత్యవహుడు) అంగిరసునికి (అలా) పరంపరగా



(ముందుతరం నుండి తరువాతి తరానికి) బోధించాడు.

## శంకరుల భాష్యం

యాం ఏతాం అథర్వణే ప్రవదేత ప్రావదద్బ్రహ్మవిద్యాం బ్రహ్మ, తామేవ బ్రహ్మణః ప్రాప్తాం అథర్వాం పురా పూర్వం ; ఉవాచ ఉక్తవాన్ అంగిరే అంగిర్నామ్నే బ్రహ్మవిద్యాం . స చాంగిః భారద్వాజాయ భరద్వాజగోత్రాయ సత్యవహాయ సత్యవహనామ్నే ప్రాహ ప్రోక్తవాన్ . భారద్వాజః అంగిరసే స్వశిష్యాయ పుత్రాయ వా పరావరాం పరస్మాత్పరస్మాదవరేణావరేణ ప్రాప్తేతి పరావరా పరావరసర్వవిద్యావిషయవ్యాప్తేర్వా, తాం పరావరామంగిరసే ప్రాహేత్యనుషంగః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యామ్ బ్రహ్మవిద్యామ్** ఏ బ్రహ్మవిద్యనైతే **బ్రహ్మ** బ్రహ్మదేవుడు **అథర్వణే** అథర్వునికి **ప్రవదేత** బోధించాడో, **తామ్** బ్రహ్మనుండి తనకు ప్రాప్తించిన దానినే అథర్వుడు **పురా** పూర్వము **అంగిరే** అంగిరుడు అనే వానికి **ఉవాచ** చెప్పాడు. మరియు **సః** ఆ అంగిరుడు **భారద్వాజాయ** భరద్వాజ గోత్రానికి చెందిన **సత్యవహాయ** సత్యవహుడనే పేరుగల వానికి **ప్రాహ చెప్పాడు. భారద్వాజః అంగిరసే** భరద్వాజ గోత్రానికి చెందిన ఆతడు (ఆ సత్యవహుడు) తన శిష్యుడు లేదా పుత్రుడైన అంగిరసుడనే వానికి **పరావరాం** పరంపరగా, అంటే

జ్ఞానోత్తములైనవారినుండి జిజ్ఞాసువులకు లభ్యమయ్యేది పరావరా (గురు-శిష్య పరంపరగా పొందబడేది). లేదా ఉన్నతమైన జ్ఞానంనుండి న్యూనతమైన జ్ఞానముల వరకూ సమస్త జ్ఞానాలనూ వ్యాపించియున్న బ్రహ్మవిద్యను అని అయినా భావించవచ్చు. అట్టి పరంపరగా జ్ఞానోత్తములనుండి జిజ్ఞాసువులకు లభించిన జ్ఞానాన్ని (భారద్వాజ గోత్రానికి చెందిన సత్యవహుడు) అంగిరసునకు బోధించాడని గ్రహించాలి.

**శౌనకో హ వై మహాశాలోఽఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ .**
**కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి**
**.. 1.1.3 ..**

ఒకప్పుడు గృహస్థాశ్రమానికి చెందిన ప్రసిద్ధి చెందిన శౌనకుడు (గురువైన) అంగిరసుడిని, శ్రుతి నిర్దేశించిన విధానంలో సమీపించినవాడై, “ఓ పూజనీయుడా! దేనిని తెలుసుకొన్నట్లైతే ఈ సమస్తమూ తెలియబడుతుందో అది ఏది?” అని ప్రశ్నించాడు.

**శంకరుల భాష్యం**



శౌనకః శునకస్యాపత్యం మహాశాలః మహాగృహస్థః అంగిరసం భారద్వాజశిష్యమాచార్యం విధివత్ యథాశాస్త్రమిత్యేతత్ ; ఉపసన్నః ఉపగతః సన్ పప్రచ్ఛ పృష్టవాన్ . శౌనకాంగిరసోః సంబంధాదర్వాగ్విధివద్విశేషణాభావాదుపసదనవిధేః పూర్వేషామనియమ ఇతి గమ్యతే . మర్యాదాకరణార్థం విశేషణం . మధ్యదీపికాన్యాయార్థం వా విశేషణం , అస్మదాదిష్వప్యుపసదనవిధేరిష్టత్వాత్ . కిమిత్యాహ — కస్మిన్ను భగవో విజ్ఞాతే, ను ఇతి వితర్కే, భగవః హే భగవన్ , సర్వం యదిదం విజ్ఞేయం విజ్ఞాతం విశేషేణ జ్ఞాతమవగతం భవతీతి ‘ఏకస్మిన్విజ్ఞాతే సర్వవిద్భవతి’ ఇతి శిష్టప్రవాదం శ్రుతవాఞ్శౌనకః తద్విశేషం విజ్ఞాతుకామః సన్కస్మిన్నితి వితర్కయన్పప్రచ్ఛ . అథవా, లోకసామాన్యదృష్ట్యా జ్ఞాత్వైవ పప్రచ్ఛ . సంతి హి లోకే సువర్ణాదిశకలభేదాః సువర్ణత్వాద్యేకత్వవిజ్ఞానేన విజ్ఞాయమానా లౌకికైః ; తథా కిం న్వస్తి సర్వస్య జగద్భేదస్యైకం కారణం యత్రైకస్మిన్విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతీతి . నన్వవిదితే హి కస్మిన్నితి ప్రశ్నోఽనుపపన్నః ; కిమస్తి తదితి తదా ప్రశ్నో యుక్తః ; సిద్ధే హ్యస్తిత్వే కస్మిన్నితి స్యాత్ , యథా కస్మిన్నిధేయమితి . న ; అక్షరబాహుల్యాదాయాసభీరుత్వాత్ప్రశ్నః సంభవత్యేవ — కిం న్వస్తి తద్యస్మిన్నేకస్మిన్విజ్ఞాతే సర్వవిత్స్యాదితి ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం**

**శౌనకః** శునకుని పుత్రుడు **మహాశాలః** గొప్ప గృహస్థుడు **అంగిరసమ్** భారద్వాజ శిష్యుడైన అంగిరసుడిని **విధివత్** శాస్త్రములో చెప్పిన రీతిలో **ఉపసన్నః** సమీపించిన వాడై **పప్రచ్ఛ** ప్రశ్నించాడు. ‘విధివత్’ అనే విశేషణాన్ని ఇక్కడ వాడటాన్నిబట్టి,

శౌనక-అంగిరసుల కాలానికి పూర్వం గురువును సమీపించేటప్పుడు అనుసరించదగిన నియమాలేవీ లేవని అర్థం చేసుకోవాలి. ఈ మర్యాద (తప్పనిసరిగా) అనుసరించ తగినదిగా ప్రత్యేకించి చెప్పారని అభిప్రాయం. లేదా, గడప మీద ఉన్న దీపం గడప లోపలి భాగాన్ని మరియు గడపకు బయట బాగాన్ని కూడా ప్రకాశింప చేసినట్లుగానే (దీనినే మధ్యదీపికాన్యాయం అంటారు) మనలాంటి వారికి కూడా గురువు సమీపించేటప్పుడు అనుసరించవలసిన మర్యాద అని కూడా అనుకోవచ్చు. ఏమని ప్రశ్నించాడో చెప్తున్నారు. **కస్మిన్ను భగవో విజ్ఞాతే** – 'భగవః' ఓ పూజనీయుడా, ఏది నిశ్చయంగా తెలియబడితే, **సర్వమ్ ఇదమ్** తెలియబడవలసియున్న ఈ సమస్తమూ, విజ్ఞాతమ్ విశిష్టంగా తెలియబడినదిగా **భవతి** అవగతమౌతుందో (అది ఏమిటి?) అని ప్రశ్నించాడు. ఇక్కడ 'ను' పదం సంశయాన్ని ప్రకటిస్తోంది. 'ఒకదాన్ని తెలుసుకొంటే సర్వమును తెలిసినవాడౌతాడు' ['ఏకస్మిన్విజ్ఞాతే సర్వవిద్భవతి'] అని ప్రచారంలో ఉన్న సాంప్రదాయకమైన మాటను విన్నవాడై శౌనకుడు దానియొక్క విశిష్టతను తెలుసుకోవాలనే కోరిక కలిగినవాడై 'అది ఏమిటి?' అన్న సంశయంతో ప్రశ్నించాడు. లేదా లోకంలో బంగారపు ముక్కలు విడిగా ఉన్నా వాటన్నింటిలో ఉన్న బంగారం ఒక్కటే అనే జ్ఞానం సామాన్య జనులలో ఉన్నదనే లోకసామాన్యమైన విషయాన్ని తెలిసినవాడై, అదేవిధంగా సమస్తమైన జగత్తులోని భేదత్వానికి కారణం ఒక్కటే అయి



ఉండవచ్చనే సంశయంతో 'కస్మిన్ విజ్ఞాతే సర్వమ్ విజ్ఞాతమ్ భవతి?' అని ప్రశ్నించాడని కూడా అనుకోవచ్చు.

**<u>సందేహం</u>** : అయితే, ఏమాత్రం తెలియని దానిని 'ఏమిటది?' అని ప్రశ్నించడం సంభవించదు కాదు కదా! అలాంటప్పుడు, 'అది ఉన్నదా?' అని ప్రశ్నించడం యుక్తం. 'దేనియందు ఉంచాలి?' అని అప్పటికే సిద్ధమై ఉన్నదాన్ని గురించి అన్నప్పుడు మాత్రమే 'ఏమిటది?' అనే ప్రశ్న ఉంటుంది.

**<u>సమాధానం</u>** : కాదు. 'ఒకటి తెలియబడితే సమస్తమూ తెలియబడుతుంది అనేటటువంటిది ఏదైనా ఉన్నదా లేదా?' అని ప్రశ్నించినట్లైతే, అనేక మాటలు, అధిక ఆయాసమే కలుగుతుంది. (ఎక్కువ మాటలు చెప్పి విషయాన్ని సంక్లిష్టం చేసి ప్రశ్నించడం వల్ల ఉపయోగమేముంటుంది? ఇలా ఎందుకు అడిగాడు అలా అడిగి వుండవచ్చుకదా అంటూ చేసే వాదన అనవసరం. కాబట్టి, స్పష్టంగా క్లుప్తంగా దేనిని తెలుసుకొంటే సర్వమూ తెలియబడుతుందని అడగడం సమంజసమే అవుతుంది).

**తస్మై స హోవాచ . ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదన్తి పరా చైవాపరా చ .. 1.1.4 ..**

ఆతనితో (శిష్యుడైన శౌనకునితో) అతడు (గురువైన అంగిరసుడు) ఇలా అన్నాడు. "పరావిద్య మరియు పరావిద్య అని రెండు విద్యలు తెలుసుకోదగినవి అని బ్రహ్మవేత్తలు నిర్ణయించి చెప్పారు".

## శంకరుల భాష్యం

తస్మై శౌనకాయ సః అంగిరాః హ కిల ఉవాచ ఉక్తవాన్ . కిమితి, ఉచ్యతే — ద్వే విద్యే వేదితవ్యే జ్ఞాతవ్యే ఇతి . ఏవం హ స్మ కిల యత్ బ్రహ్మవిదః వేదార్థాభిజ్ఞాః పరమార్థదర్శినః వదంతి . కే తే ఇత్యాహ — పరా చ పరమాత్మవిద్యా, అపరా చ ధర్మాధర్మసాధనతత్ఫలవిషయా . నను కస్మిన్విదితే సర్వవిద్భవతీతి శౌనకేన పృష్టం ; తస్మిన్వక్తవ్యేఽపృష్టమాహాంగిరాః — ద్వే విద్యే ఇత్యాది . నైష దోషః, క్రమాపేక్షత్వాత్ప్రతివచనస్య . అపరా హి విద్యా అవిద్యా ; సా నిరాకర్తవ్యా తద్విషయే హి అవిదితే న కించిత్తత్త్వతో విదితం స్యాదితి ; 'నిరాకృత్య హి పూర్వపక్షం పశ్చాత్సిద్ధాంతో వక్తవ్యో భవతి' ఇతి న్యాయాత్ ..

తత్ర కా అపరేత్యుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తస్మై** అతనికి అంటే ఆ శౌనకునికి **సః** అంగిరసుడు **ఉవాచ హ** చెప్పినాడట. ఏమని చెప్పాడో చెప్పబడుతోంది. **ద్వే విద్యే వేదితవ్యే ఇతి** రెండు విద్యలు తెలుసుకోదగినవి అని, **హ స్మ** సంప్రదాయం ప్రకారం **యద్** దేనినైతే **బ్రహ్మవిదః** వేదార్థాన్ని



తెలుసుకొన్నవారు, పరమార్థాన్ని దర్శించినవారు **వదన్తి** చెప్పారో. (ఆ రెండు విద్యలు) ఏమిటో చెప్తున్నారు. అవి **పరా చ** పరమాత్మను గురించిన విద్య, **అపరా చ** పాపపుణ్యాల సాధన గురించి వాటి ఫలితాల విషయాలకు సంబంధిన విద్య.

**సందేహం** : కాని, శౌనకుడు అడిగిందేమో దేనిని తెలుసుకుంటే సమస్తమూ తెలియబడుతుంది అని కదా! మరి అంగిరసుడు రెండు విద్యలు అంటూ అడగని విషయాన్ని గురించి చెప్తున్నాడేమిటి?

**సమాధానం** : దీనిలో దోషమేమీ లేదు. ఎందుకంటే, సమాధానాన్ని ఒక క్రమంలో చెప్పాల్సి ఉంది కాబట్టి. నిజానికి అపరా విద్య అంటే అవిద్యయే. దానిని (ఆ అవిద్యను) నివారించాలి. అవిద్యకు సంబంధించిన విషయాలను తెలుసుకొన్నందు వల్ల (యదార్థమైన) తత్త్వం ఏమాత్రమూ తెలియబడదు. పూర్వపక్షాన్ని నిరాకరించిన తర్వాతనే సిద్ధాంతాన్ని చెప్పాలనేది నియమం (అభ్యంతరాలను ప్రమాణపూర్వకంగా తిరస్కరించిన తర్వాతనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాలని నియమం ఉన్నది కాబట్టి, ఆ నియమానుసారం ముందు అవిద్యను ప్రమాణాల ఆధారంగా నిరాకరించి, బ్రహ్మవిద్యను ప్రతిపాదిస్తున్నారని అభిప్రాయం).

వీటిలో ఏది అపరా విద్యయో చెప్తున్నారు.

**తత్రాపరా, ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి . అథ పరా యయా తదక్షరమధిగమ్యతే .. 1.1.5 ..**

వీటిలో ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం, శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛన్దస్సు, జ్యోతిషం అన్నవి అపరా విద్యలు. ఇక ఏది అవినాశిత్వాన్ని సిద్ధింపచేస్తుందో అది పరా విద్య.

## శంకరుల భాష్యం

ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః ఇత్యేతే చత్వారో వేదాః . శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషం ఇత్యంగాని షట్ ; ఏషా అపరా విద్యోక్తా . అథ ఇదానీం ఇయం పరా విద్యోచ్యతే యయా తత్ వక్ష్యమాణవిశేషణం అక్షరం అధిగమ్యతే ప్రాప్యతే, అధిపూర్వస్య గమేః ప్రాయశః ప్రాప్త్యర్థత్వాత్ ; న చ పరప్రాప్తేరవగమార్థస్య చ భేదోఽస్తి ; అవిద్యాయా అపాయ ఏవ హి పరప్రాప్తిర్నార్థాంతరం . నను ఋగ్వేదాదిబాహ్యా తర్హి సా కథం పరా విద్యా స్యాత్ మోక్షసాధనం చ . 'యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః. . . ' (మను. 12-95) ఇతి హి స్మరంతి . కుదృష్టిత్వాన్నిష్ఫలత్వాదనాదేయా స్యాత్ ; ఉపనిషదాం చ ఋగ్వేదాదిబాహ్యత్వం స్యాత్ . ఋగ్వేదాదిత్వే తు పృథక్కరణమనర్థకం అథ పరేతి . న, వేద్యవిషయవిజ్ఞానస్య వివక్షితత్వాత్ .



ఉపనిషద్వేద్యాక్షరవిషయం హి విజ్ఞానమిహ పరా విద్యేతి ప్రాధాన్యేన వివక్షితం , నోపనిషచ్ఛబ్దరాశిః . వేదశబ్దేన తు సర్వత్ర శబ్దరాశిర్వివక్షితః . శబ్దరాశ్యధిగమేఽపి యత్నాంతరమంతరేణ గుర్వభిగమనాదిలక్షణం వైరాగ్యం చ నాక్షరాధిగమః సంభవతీతి పృథక్కరణం బ్రహ్మవిద్యాయా అథ పరా విద్యేతి ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అని ఇవి నాలుగు వేదాలు. శిక్ష (ఉచ్చారణకు సంబంధించిన శాస్త్రం), కల్పం (యజ్ఞాది కర్మల గురించి చెప్పే శాస్త్రం), వ్యాకరణం, నిరుక్తం (పదాల వ్యుత్పత్తిని తెలియచేసే శాస్త్రం), ఛందస్సు, జ్యోతిషం అని ఇవి ఆరు వేదాంగాలు. వీటన్నింటినీ అపరా విద్యలంటారు. **అథ** ఇప్పుడు **యయా** దేనిచే **తత్** అది అంటే దేని విశిష్టతలు ముందు ముందు చెప్పబోతున్నారో అది **అక్షరమ్** వినాశిత్వం అనేది లేనిది **అధిగమ్యతే** పొందబడుతుందో అటువంటి ఈ **పరా** పరావిద్యను చెప్తున్నారు. 'అధి' అనే ఉపసర్గ ముందు చేర్చబడిన 'గమ్' ధాతువు సాధారణంగా ప్రాప్తించడం అనే అర్థాన్నిస్తుంది. పరమాత్మను పొందటానికి మరియు అనుభవానికి తెచ్చుకోవడానికి తేడా ఏమీ లేదు. పరమాత్మను పొందటమంటే అవిద్యను తొలగించుకోవడం మాత్రమే తప్ప మరింకేమీ కాదు.

**సందేహం** : అలాంటప్పుడు, ఈ పరా విద్య అన్నది ఋగ్వేదం మొదలైన వాటికి బాహ్యమైనది అయినట్లైతే, ఆ పరా విద్య మోక్షానికి

సాధనమెట్లా అవతుంది? 'వేదవిరుద్ధమైన స్మృతులు ఏవైనా దోషపూరితాలే. అవన్నీ నిరర్థకాలే. అట్టి స్మృతులు మరణం తర్వాత పెనుచీకటిలో నిలబెట్టేవే' ('యా వేదబాహ్యః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః. సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తా స్మృతాః' (మను. 12-95) అని స్మృతి నిర్ణయం. దోషదృష్టికలవైనందున, వ్యర్థమైనవైనందున, అవి (ఆ వేదవిరుద్ధమైన స్మృతులు) అంగీకరించరానివి. అలాగే ఉపనిషత్తులు కూడా ఋగ్వేదాదులకు విరుద్ధమైనవే అవుతాయి. ఒకవేళ అవి ఋగ్వేదాదులలోని విషయాలే అనేనట్లైతే 'పరా' అనడంలో అర్థమే ఉండదు. {కొన్ని చోట్ల 'అథ కథం పరేతి' అంటే 'అలాంటప్పుడు పరా అని ఎలా అంటారు?' అని అదనపు పాఠం ఉన్నది – స్వామి గంభీరానంద}.

**సమాధానం** : కాదు. ఎందుకంటే (విద్య అన్న పదానికి) తెలుసుకోవలసిన విషయం యొక్క విజ్ఞానాన్ని వివేకించి తెలుసుకోవడం అని భావం కాబట్టి. 'పరావిద్య' అన్న పదానికి ఈ సందర్భంలో ప్రధానంగా, ఉపనిషత్తులచే బోధించబడిన అవినాశిత్వమైనదాన్ని గురించిన విజ్ఞానమే కాని (అంటే అనుభవంతో కూడిన జ్ఞానమేకాని), కేవలం పదాల సమూహమైనట్టి ఉపనిషత్తు పాఠం కాదని గ్రహించాలి. అయితే, వేదశబ్దానికి సర్వత్రా శబ్దాల సమూహమనే అర్థాన్నే ఉపయోగిస్తారు. శబ్దరాశిపై పట్టును సాధించినప్పటికీ, గురువును సమీపించడం మరియు వైరాగ్యం వంటి లక్షణాలతో కూడిన ప్రయత్నాన్ని చేయకపోతే అవినాశిత్వాన్ని



పొందటమనేది సాధ్యపడనందుచేత, బ్రహ్మవిద్యను (మిగిలిన అపరా విద్యలనుండి) వేరు చేసి పరావిద్య అని ఇప్పుడు చెప్తున్నారు.

**యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదం .**
**నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః .. 1.1.6 ..**

ఏది దృష్టికి గోచరించనిదో, పట్టుబడనిదో, మూలమనేది లేనిదో, వర్ణించను వీలుకానిదో, కన్నులు-చెవులు లేనిదో, చేతులు-పాదాలు లేనిదో, శాశ్వతమైనదో, అనేకంగా ఉన్నట్టిదో, సమస్తాన్నీ వ్యాపించియున్నట్టిదో, సూక్ష్మాతిసూక్ష్మమైనదో, ఆట్టి వినాశములేని సర్వభూతాలకు మూలకారణమైనట్టి దానిని, వివేకవంతులు సర్వత్రా దర్శిస్తున్నారు.

## శంకరుల భాష్యం

యథా విధివిషయే కర్త్రాద్యనేకకారకోపసంహారద్వారేణ వాక్యార్థజ్ఞానకాలాత్ అన్యత్రానుష్ఠేయోఽర్థోఽస్త్యగ్నిహోత్రాదిలక్షణః, న తథేహ పరవిద్యావిషయే వాక్యార్థజ్ఞానసమకాల ఏవ తు పర్యవసితో భవతి,

కేవలశబ్దప్రకాశితార్థజ్ఞానమాత్రనిష్ఠావ్యతిరిక్తాభావాత్ . తస్మాదిహ పరాం విద్యాం సవిశేషణేనాక్షరేణ విశినష్టి — యత్తదద్రేశ్యమిత్యాదినా .వక్ష్యమాణం బుద్ధౌ సంహృత్య సిద్ధవత్పరామృశతి — యత్తదితి . అద్రేశ్యం అదృశ్యం సర్వేషాం బుద్ధీంద్రియాణామగమ్యమిత్యేతత్ . దృశేర్బహిఃప్రవృత్తస్య పంచేంద్రియద్వారకత్వాత్ . అగ్రాహ్యం కర్మేంద్రియావిషయమిత్యేతత్ . అగోత్రం , గోత్రమన్వయో మూలమిత్యనర్థాంతరం . అగోత్రం అనన్వయమిత్యర్థః . న హి తస్య మూలమస్తి యేనాన్వితం స్యాత్ . వర్ణ్యంత ఇతి వర్ణా ద్రవ్యధర్మాః స్థూలత్వాదయః శుక్లత్వాదయో వా . అవిద్యమానా వర్ణా యస్య తత్ అవర్ణం అక్షరం . అచక్షుఃశ్రోత్రం చక్షుశ్చ శ్రోత్రం చ నామరూపవిషయే కరణే సర్వజంతూనాం , తే అవిద్యమానే యస్య తదచక్షుఃశ్రోత్రం . 'యః సర్వజ్ఞః సర్వవిత్' (ము.ఉ. 1-1-9) ఇతి చేతనావత్త్వవిశేషణాత్ప్రాప్తం సంసారిణామివ చక్షుఃశ్రోత్రాదిభిః కరణైరర్థసాధకత్వం ; తదిహ అచక్షుఃశ్రోత్రమితి వార్యతే, 'పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః' (శ్వే.ఉ. 3-19) ఇత్యాదిదర్శనాత్ . కించ, తత్ అపాణిపాదం కర్మేంద్రియరహితమిత్యేతత్ . యత ఏవం అగ్రాహ్యమగ్రాహకం చ అతో నిత్యమవినాశి . విభుం వివిధం బ్రహ్మాదిస్థావరాంతప్రాణిభేదైర్భవతీతి విభుం . సర్వగతం వ్యాపకమాకాశవత్సుసూక్ష్మం . శబ్దాదిస్థూలత్వకారణరహితత్వాత్ . శబ్దాదయో హ్యాకాశ వాయ్వాదీనాముత్తరోత్తరస్థూలత్వకారణాని ; తదభావాత్సుసూక్ష్మం , కించ, తత్ అవ్యయం ఉక్తధర్మత్వాదేవ న వ్యేతీత్యవ్యయం . న హ్యనంగస్య స్వాంగాపచయలక్షణో వ్యయః సంభవతి శరీరస్యేవ . నాపి కోశాపచయలక్షణో వ్యయః సంభవతి రాజ్ఞ ఇవ . నాపి గుణద్వారకో వ్యయః సంభవతి, అగుణత్వాత్సర్వాత్మకత్వాచ్చ . యత్ ఏవంలక్షణం భూతయోనిం భూతానాం కారణం పృథివీవ స్థావరజంగమానాం పరిపశ్యంతి సర్వత ఆత్మభూతం సర్వస్య



అక్షరం పశ్యంతి ధీరాః ధీమంతో వివేకినః . ఈదృశమక్షరం యయా విద్యయా అధిగమ్యతే సా పరా విద్యేతి సముదాయార్థః ..

భూతయోనిరక్షరమిత్యుక్తం . తత్కథం భూతయోనిత్వమిత్యుచ్యతే దృష్టాంతైః —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

కర్మల గురించిన విద్య విషయంలో, (వేద) వాక్యాలకు అర్థాన్ని గ్రహించిన తర్వాత, కర్త మొదలైన వారిని (మరియు ఇతర సాధన సామగ్రిని) సమకూర్చుకోవడం ద్వారా, అగ్నిహోత్రాదుల వంటి వేర్వేరు కర్మలు చేయవలసిన ఉన్నట్లుగా, పరబ్రహ్మను గురించిన విద్య విషయంలో కేవలం (వేద)శబ్దం ద్వారా ప్రకటితమైన జ్ఞానమందు మాత్రమే నిష్ఠ తప్ప అందుకు వ్యతిరేకమైన స్థితి అనేదే ఉండదు. కాబట్టి (వేద) వాక్యాలకు అర్థాన్ని గ్రహించిన తర్వాత ఆపై చేయవలసినదేదీ ఉండదు. అందువల్ల ఇక్కడ అక్షర బ్రహ్మన్ని దాని విశేషణాలతో సహా పేరుచేసి చూపుతూ పరావిద్యను 'యత్తదద్రేశ్యమ్ ....' అంటూ శ్రుతి బోధించబోతోంది.

చెప్పబోయే విషయాన్ని మనసులో ఉంచుకొని, అది అప్పటికే సిద్ధంగా ఉన్నదా అన్నట్లుగా 'యత్ తత్' అని (శ్రుతి) సూచిస్తోంది. **అద్రేశ్యమ్** ('అదృశ్యమ్' అని స్వీకరించాలి) ఇంద్రియజ్ఞానాలు పంచేంద్రియాల ద్వారా బాహ్యంలోని విషయాలోనే ప్రవర్తిస్తాయి కాబట్టి సర్వప్రాణులలోనున్న జ్ఞానేంద్రియాలచే ఇది

అనుభవానికి రాదు అని భావం. **అగ్రాహ్యమ్** కర్మేంద్రియాలకు చిక్కనిది అంటే విషయం కానిది ఇది అని భావం. **అగోత్రమ్** 'గోత్ర' అంటే సంబంధం కలది లేదా మూలము కలది అని అంతరార్థం. కాబట్టి 'అగోత్రమ్' అంటే (దానికి వేటితోనూ) సంబంధమనేదే లేనిదని అభిప్రాయం. దేనితోనైనా సంబంధం ఉన్నదని చెప్పాలి అంటే దానికి (ఆ పరబ్రహ్మానికి) ఒక మూలమంటూ ఉండాలి. అటువంటి మూలమనేదే లేదు (పైగా అన్నింటికీ అదే మూలం). వర్ణించబడేదాన్ని 'వర్ణాః' అంటారు. అంటే ద్రవ్య ధర్మాలైన స్థూలత్వం లేదా తెల్లదనము వంటి విశేషణాలను వర్ణాలంటారు. దేనికైతే అంటే ఏ అవినాశిత్వానికైతే ఎటువంటి విశేషణాలూ ఉన్నట్లుగా తెలియడంలేదో అది **అవర్ణమ్**. కన్ను మరియు చెవి అన్నవి అన్ని జంతువులలోనూ నామాన్ని రూపాన్ని గ్రహించగల సాధనాలు. దేనిలోనైతే అలాంటి కన్ను మరియు చెవి అనేవి ఉండవో అది **అచక్షుఃశ్రోత్రమ్.** 'ఎవనికైతే సమస్తం యొక్క స్థూలజ్ఞానం కలదో మరియు సమస్త సూక్ష్మ విశేషాలు తెలుసో, అతడు' ['యః సర్వజ్ఞః సర్వవిత్' (ము.ఉ. 1-1-9)] అని ముందు చెప్పబోయే పాఠాన్ని అనుసరించి, సామాన్య సంసారుల లాగానే అవినాశిత్వం కూడా చక్షు-శ్రోత్రాదుల సహాయంతో తన ప్రయోజనాన్ని సాధించుకుంటుంది అనే భావనను త్రోసిపుచ్చేందుకు 'అచక్షుఃశ్రోత్రమ్' అని ఇక్కడ అన్నారు. 'అతడు కన్ను లేకుండా చూస్తాడు చెవి లేకుండా వింటాడు' ['పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః' (శ్వే.ఉ. 3-19)] అన్న శ్రుతివాక్యం ఇదే విషయాన్ని ప్రకటించడం చూడవచ్చు.



మరింకా, అది (ఆ అవినాశిత్వం) **అపాణిపాదమ్** కర్మేంద్రియాలు లేనట్టిది. ఏది గ్రహించదో మరియు గ్రహించబడదో అది **నిత్యమ్** శాశ్వతమైనది, నశించనిది. (పట్టుకోవడం మరియు పట్టుబడటం అంటే సంఘటనలు. సంఘటన జరిగిందంటే కాలంలో ప్రమేయమున్నట్లే. అటువంటి సంఘటనకు అవకాశమే లేదంటే కాలంతో నిమిత్తం లేనిదని స్పష్టం. కాలానికి అతీతం అయినదాన్ని నిత్యం అంటారు. కాబట్టి, అగ్రాహ్యం-అగ్రాహకం అంటే నిత్యత్వమేనని నిర్ధారణవుతోంది). **విభుమ్** అంటే బ్రహ్మదేవుడు మొదలుకొని కదలని ప్రాణుల వరకు వేర్వేరుగా అయ్యేదని అర్థం. **సర్వగతమ్** సర్వాన్ని వ్యాపించియున్నది **సుసూక్ష్మమ్** శబ్దం స్పర్శ వంటి స్థూలత్వానికి కారణమయ్యే ధర్మాలేవీ లేనిదైనందున ఆకాశం లాగే అది సూక్ష్మాతిసూక్ష్మం. శబ్దం ఆకాశం యొక్క స్థూలత్వానికి కారణం, స్పర్శ వాయువు యొక్క స్థూలత్వానికి కారణం. పంచభూతాల యొక్క స్థూలత్వం ఆకాశాన్ని మించి వాయువుకు, వాయువును మించి అగ్నికి, అగ్నిని మించి జలానికి, జలనుండి పృథివికి వరుసగా ఒకదాన్ని మించి తర్వాత దానికి శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాల కారణంగా కలుగుతోంది. అలా స్థూలత్వాన్ని కలిగించే కారణాలేవీ వినాశరహితమైనదానికి లేనందుచేత అది సూక్ష్మాతిసూక్ష్మం. మరింకా, అది **అవ్యయమ్** పైన చెప్పబడిన (సుసూక్ష్మత్వాది) ధర్మాలు కలదైనందున నశించదు కాబట్టి అది అవ్యయం. అసలు అవయవాలే లేనిదైనందున, శరీర అవయవాలు నశించినట్లుగా, (దానికి) అవయవనాశమనేది ఉండదు. రాజుయొక్క

కోశాగారం లోని సంపద తరిగినట్లుగా, తరుగుదల అనేది కూడా ఉండదు. గుణాలే లేనిదైనందుచేత సర్వానికి అత్మయే అవడం చేత, గుణాల ద్వారా కూడా క్షీణతను పొందదు. **యత్** ఈవిధమైన లక్షణం కలిగి **భూతయోనిమ్** పృథివి వంటి భూతాలకు, కదలని మరియు కదిలే ప్రాణులకు కారణమైన దాన్ని **ధీరాః** బుద్ధిమంతులైనవారు, వివేకం కలిగిన వారు **పరిపశ్యన్తి** అంతటా సమస్తానికి ఆత్మసారమైనదాన్ని, అవినాశిత్వాన్ని చూస్తారు. ఇటువంటి అవినాశిత్వం ఏ విద్యచేత సాధింపబడుతుందో అదియే పరావిద్య అని మొత్తంమీదట కలిగే అభిప్రాయం.

అవినాశిత్వమే ప్రాణులన్నింటికి మూలకారణం అని చెప్పారు. అది (ఆ అవినాశిత్వం) ప్రాణులకు మూలకారణం ఎలా అయిందో ఉదాహరణలతో చెప్తున్నారు.

**యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషధయః సంభవన్తి .**
**యథా సతః పురుషాత్కేశలోమాని తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్ .. 1.1.7 ..**

ఎలాగైతే సాలీడు (గూడును తననుండి) తయారుచేసి (తనలోకే) గ్రహిస్తుందో, ఎలాగైతే భూమియందు



ఓషధులు సంభవిస్తున్నాయో, ఎలాగైతే జీవించిన మనిషినుండి జుట్టు వెంట్రుకలు (పుడుతున్నాయో), అలాగే అక్షరంనుండి (అవినాశిత్వం నుండి) విశ్వం సంభవిస్తోంది.

## శంకరుల భాష్యం

యథా లోకే ప్రసిద్ధః ఊర్ణనాభిః లూతాకీటః కించిత్కారణాంతరమనపేక్ష్య స్వయమేవ సృజతే స్వశరీరావ్యతిరిక్తానేవ తంతూన్బహిః ప్రసారయతి పునస్తానేవ గృహ్ణాతే చ గృహ్ణాతి స్వాత్మభావమేవాపాదయతి ; యథా చ పృథివ్యాం ఓషధయః, వ్రీహ్యాదిస్థావరాణీత్యర్థః, స్వాత్మావ్యతిరిక్తా ఏవ ప్రభవంతి సంభవంతి ; యథా చ సతః విద్యమానాజ్జీవతః పురుషాత్ కేశలోమాని కేశాశ్చ లోమాని చ సంభవంతి విలక్షణాని . యథైతే దృష్టాంతాః, తథా విలక్షణం సలక్షణం చ నిమిత్తాంతరానపేక్షాద్యథోక్తలక్షణాత్ అక్షరాత్ సంభవతి సముత్పద్యతే ఇహ సంసారమండలే విశ్వం సమస్తం జగత్ . అనేకదృష్టాంతోపాదానం తు సుఖావబోధనార్థం ..

యద్బ్రహ్మణ ఉత్పద్యమానం విశ్వం తదనేన క్రమేణోత్పద్యతే, న యుగపద్బదరముష్టిప్రక్షేపవదితి క్రమనియమవివక్షార్థోఽయం మంత్ర ఆరభ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యథా** ఏవిధంగానైతే లోకంలో ప్రసిద్ధమైన **ఊర్ణనాభిః** సాలెపురుగు ఎటువంటి కారణము లేకుండానే తనంతతానే **సృజతే** తన దేహానికి వేరుకానట్టి దారాలను బయటకు ప్రసరింపచేసి తిరిగి తనకుతానే **గృహ్ణతే చ** తనలోనికి లాక్కొంటుందో, తీసుకొంటుందో, మరియు **యథా** ఏవిధంగానైతే **పృథివ్యామ్** భూమియందు **ఓషధయః** వరిమొక్క నుండి వృక్షాలవరకూ అని అర్థం, భూమితో బేధమేమీ లేనట్లుగానే **సంభవన్తి** పుడుతున్నాయో, మరియు **యథా** ఏవిధంగానైతే **సతః** జీవంతో ఉన్నట్టి **పురుషాత్** మనిషినుండి **కేశలోమాని** జుట్టు మరియు వెంట్రుకలు విలక్షణంగా (జీవలక్షణానికి విరుద్ధమైన జడాలుగా) **సంభవన్తి** పుడుతున్నాయో అంటూ ఏవిధంగా ఈ దృష్టాంతాలలో వివరించారో, అదేవిధంగా విరుద్ధలక్షణాలతోనూ మరియు సమాన లక్షణాలతోనూ ఉన్నట్టి **ఇహ** సంసారంతో నిండియున్న **విశ్వం** సమస్తమైన జగత్తు, ఇతర కారణాలేవీ లేకుండా, పైన చెప్పిన లక్షణాలు కలిగిన అక్షరం నుండి (అంటే అవినాశిత్వం నుండి) **సంభవతి** ఉత్పన్నమౌతున్నది. సులభంగా అర్థంకావడానికి అనేకమైన దృష్టాంతాలు ఉదహరించబడినాయి.

బ్రహ్మనుండి ఉత్పన్నమైన జగత్తు క్రమంగా ఉద్భవిస్తుంది. అంతేకాని, గుప్పిటనుండి ఉసిరికలను విసరినట్లుగా ఒక్కసారిగా (ఉత్పన్నం) కాదు. నియమానుసారమైన క్రమంలో వివేకించి తెలియచెప్పడానికి ఈ క్రింది మంత్రం ప్రారంభించబడుతోంది.



**తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే .**
**అన్నాత్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్**
**.. 1.1.8 ..**

తపస్సుచే బ్రహ్మ ఉబ్బుతుంది. దానినుండి అన్నం పుడుతుంది. అన్నంనుండి ప్రాణము, (ఆ ప్రాణం నుండి) మనసు, (ఆ మనసు నుండి) సత్యం (పంచ మహాభూతములు), (ఆ పంచమహాభూతాల నుండి) లోకములు మరియు (అ లోకముల నుండి) కర్మలయందలి అమృతత్వం (ఉత్పన్నమౌతుంది).

## శంకరుల భాష్యం

తపసా జ్ఞానేన ఉత్పత్తివిధిజ్ఞతయా భూతయోన్యక్షరం బ్రహ్మ చీయతే ఉపచీయతే ఉత్పాదయిష్యదిదం జగత్ అంకురమివ బీజముచ్ఛూనతాం గచ్ఛతి పుత్రమివ పితా హర్షేణ . ఏవం సర్వజ్ఞతయా సృష్టిస్థితిసంహారశక్తివిజ్ఞానవత్తయోపచితాత్ తతః బ్రహ్మణః అన్నం అద్యతే భుజ్యత ఇత్యన్నమవ్యాకృతం సాధారణం కారణం సంసారిణాం వ్యాచికీర్షితావస్థారూపేణ అభిజాయతే ఉత్పద్యతే . తతశ్చ అవ్యాకృతాద్వ్యాచికీర్షితావస్థాత్ అన్నాత్ ప్రాణః హిరణ్యగర్భో బ్రహ్మణో జ్ఞానక్రియాశక్త్యధిష్ఠితో

జగత్సాధారణోఽవిద్యాకామకర్మభూతసముదాయబీజాంకురో జగదాత్మా అభిజాయత ఇత్యనుషంగః . తస్మాచ్చ ప్రాణాత్ మనః మనఆఖ్యం సంకల్పవికల్పసంశయనిర్ణయాద్యాత్మకమభిజాయతే . తతోఽపి సంకల్పాద్యాత్మకాన్మనసః సత్యం సత్యాఖ్యమాకాశాదిభూతపంచకమభిజాయతే . తస్మాత్సత్యాఖ్యాద్భూతపంచకాదండక్రమేణ సప్త లోకాః భూరాదయః . తేషు మనుష్యాదిప్రాణివర్ణాశ్రమక్రమేణ కర్మాణి . కర్మసు చ నిమిత్తభూతేషు అమృతం కర్మజం ఫలం . యావత్కర్మాణి కల్పకోటిశతైరపి న వినశ్యంతి, తావత్ఫలం న వినశ్యతీత్యమృతం ..

ఉక్తమేవార్థముపసంజిహీర్షుర్మంత్రో వక్ష్యమాణార్థమాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తపసా** జ్ఞానంద్వారా, సృష్టి కార్యం గురించి తెలిసిన **బ్రహ్మ** సృష్టికి మూల కారణమైన అవినాశిత్వం **చీయతే** పరిమాణంలో వృద్ధిని పొందుతుంది, ఈ జగత్తును ఉత్పన్నం చేయగోరుతుంది, మొలకెత్తబోయే విత్తనంలాగా, పుత్రుడు కలగబోతున్న తండ్రి హర్షాన్ని పొందినట్లుగా. ఆ విధంగా, సర్వజ్ఞత్వం చేత సృష్టి-స్థితి-సంహార శక్తి గురించిన జ్ఞానం పొందినట్టి ఆ బ్రహ్మనుండి, **అన్నమ్** భుజించబడేది అని అర్థాన్నిచ్చే 'అద్' ధాతురూపం (అద్ ధాతువు నుండి ఏర్పడిన ప్రాతిపదిక) **అభిజాయతే** ఉత్పన్నమౌతుంది. అంటే సంసారానికి కారణమైన అవ్యాకృతం యొక్క పరిణామ రూపంగా అన్నం ఉద్భవించింది అని గ్రహించాలి. తరువాత, అవ్యాకృతం యొక్క పరిణామ రూపమైన అన్నం నుండి **ప్రాణః** హిరణ్యగర్భుడనబడే బ్రహ్మ,



జ్ఞాన-క్రియ శక్తులకు అధిష్ఠానమైనవాడు, జగత్తంతటికీ సమానమైన వాడు, అవిద్య-కామ-కర్మలతో కూడిన బీజంనుండి మొలకెత్తిన జగత్తుతో తాదాత్మ్యాన్ని పొందినవాడు. 'అభిజాయత' ఉద్భవించాడని చేర్చుకోవాలి. ఆ ప్రాణం నుండి **మనః** సంకల్ప-వికల్ప-సంశయ-నిర్ణయాదులు కలిగి మనసు అని పిలువడేది ఉత్పన్నమౌతుంది. తరువాత సంకల్పాదులతో కూడిన మనసు నుండి **సత్యం** సత్యమని పిలువబడే ఆకాశం మొదలుగాగల పంచభూతాలు పుట్టినవి. తరువాత సత్యమనబడే పంచభూతాత్మమైన అండం నుండి క్రమంగా **లోకాః** భూః-భువః-సువః-మహః-జనః-తపః-సత్యః అనబడే ఏడు లోకాలు. వాటినుండి మనుష్యాది ప్రాణుల యొక్క వర్ణాశ్రమాల క్రమంలో కర్మలు. మరియు కర్మలయందు వాటికారణంగా **అమృతమ్** కర్మనుండి కలిగే ఫలం అమృతం. శతకోటి కల్పాల పర్యంతం కూడా ఎంతవరకైతే కర్మలు నశించవో, అంతవరకూ వాటి ఫలం కూడా నశించదు కాబట్టి కర్మఫలాన్ని అమృతం అంటున్నారు. (కర్మలు అనేవి ఉంటే, వాటి ఫలితం తప్పక ఉండితీరుతుంది అని అర్థం.)

ప్రస్తుతం బోధిస్తున్న విషయాన్ని (అవినాశిత్వం నుండి సృష్టి క్రమం ఎలా జరిగిందో చెప్పే ప్రకరణాన్ని) ముగించే ఉద్దేశ్యంతో, తరువాతి మంత్రాన్ని చెప్తున్నారు.

**యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః .**

**తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే**

**.. 1.1.9 ..**

ఎవనికైతే సమస్తం యొక్క స్థూలజ్ఞానం కలదో మరియు సమస్త సూక్ష్మ విశేషాలు తెలునో, అట్టి జ్ఞానమయుని జ్ఞానంనుండి ఈ బ్రహ్మదేవుడు, నామ, రూప, అన్నములు పుడుతున్నవి.

## శంకరుల భాష్యం

యః ఉక్తలక్షణోఽక్షరాఖ్యః సర్వజ్ఞః సామాన్యేన సర్వం జానాతీతి సర్వజ్ఞః . విశేషేణ సర్వం వేత్తీతి సర్వవిత్ . యస్య జ్ఞానమయం జ్ఞానవికారమేవ సార్వజ్ఞ్యలక్షణం తపః అనాయాసలక్షణం , తస్మాత్ యథోక్తాత్సర్వజ్ఞాత్ ఏతత్ ఉక్తం కార్యలక్షణం బ్రహ్మ హిరణ్యగర్భాఖ్యం జాయతే . కించ, నామ అసౌ దేవదత్తో యజ్ఞదత్త ఇత్యాదిలక్షణం , రూపం ఇదం శుక్లం నీలమిత్యాది, అన్నం చ వ్రీహియవాదిలక్షణం , జాయతే పూర్వమంత్రోక్తక్రమేణేత్యవిరోధో ద్రష్టవ్యః ..

.. ఇతి ప్రథమముండకే ప్రథమఖండభాష్యం ..



## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యః** ఎవరైతే అక్షరుడనబడుతున్నాడో, ఎవని గురించిన లక్షణాలు చెప్పబడబోతున్నవో అతడు **సర్వజ్ఞః** సమస్తాన్ని సామాన్యంగా (స్థూలంగా) తెలిసినవాడు సర్వజ్ఞుడు (మరియు) **సర్వవిత్** సమస్తాన్ని విశేషంగా అంటే కూలంకషంగా, వివరంగా తెలిసినవాడు **సర్వవిత్.** **యస్య** ఎవని యొక్క **తపః** తపస్సు **జ్ఞానమయం** జ్ఞానంతో పూర్తిగా నిండియున్నది మాత్రమే. అంటే సర్వజ్ఞ లక్షణమూ, అనాయాస లక్షణమే (అక్షరుడనే అనబడే అవినాశిత్వం మంటే కేవలం జ్ఞానం యొక్క సముదాయమే. అంటే అవినాశిత్వంలో జ్ఞానం తప్ప మరింకేమీ లేదని అర్థం. అది సర్వత్రా జ్ఞానమే. అప్రయత్నమే. శ్రమ గురించిన ప్రస్తావన ఏమీ లేదు). **తస్మాత్** దాని నుండి, అంటే చెప్పబడిన సర్వజ్ఞత్వం నుండి **ఏతత్** ఈ చెప్పబడిన కార్యలక్షణం కలిగిన **బ్రహ్మ** హిరణ్యగర్భుడని పిలువడే బ్రహ్మదేవుడు **జాయతే** ఉద్భవించాడు. మరింకా (ఆ హిరణ్యగర్భుని నుండి) **నామ** దేవదత్తుడు, యజ్ఞదత్తుడు అన్నట్లుగా పేర్లు, **రూప** ఇది తెలుపు, నలుపు మొదలుగా గలవి, **చ అన్నమ్** మరియు అన్నము అంటే వరి, బార్లీ వంటివి, **జాయతే** పుట్టినవి. పూర్వ మంత్రంలో చెప్పిన క్రమంలోనే పరిణామం ఏర్పడింది కాబట్టి (ముందు చెప్పిన మంత్రార్థానికి ప్రస్తుత మంత్రార్థానికి) వైరుధ్యమేమీ లేదని గ్రహించాలి.

.. ప్రథమ ముండకంలోని ప్రథమఖండ భాష్యానువాదం సమాప్తం ..

# ప్రథమ ముండకము

# ద్వితీయ ఖండము

## శంకరుల ఉపోద్ఘాత భాష్యం

సాంగా వేదా అపరా విద్యోక్తా 'ఋగ్వేదో యజుర్వేదః' (ము. ఉ. 1 . 1 . 5) ఇత్యాదినా . 'యత్తదద్రేశ్యం' (ము. ఉ. 1 . 1 . 6) ఇత్యాదినా 'నామరూపమన్నం చ జాయతే' (ము. ఉ. 1 . 1 . 9) ఇత్యంతేన గ్రంథేనోక్తలక్షణమక్షరం యయా విద్యయాధిగమ్యత ఇతి సా పరా విద్యా సవిశేషణోక్తా . అతః పరమనయోర్విద్యయోర్విషయౌ వివేక్తవ్యౌ సంసారమోక్షావిత్యుత్తరో గ్రంథ ఆరభ్యతే . తత్రాపరవిద్యావిషయః కర్త్రాదిసాధనక్రియాఫలభేదరూపః సంసారోఽనాదిరనంతో దుఃఖస్వరూపత్వాద్ధాతవ్యః ప్రత్యేకం శరీరిభిః సామస్త్యేన నదీస్రోతోవదవిచ్ఛేదరూపసంబంధః తదుపశమలక్షణో మోక్షః పరవిద్యావిషయోఽనాద్యనంతోఽజరోఽమరోఽమృతోఽభయః శుద్ధః ప్రసన్నః స్వాత్మప్రతిష్ఠాలక్షణః పరమానందోఽద్వయ ఇతి . పూర్వం తావదపరవిద్యాయా విషయప్రదర్శనార్థమారంభః . తద్దర్శనే హి తన్నిర్వేదోపపత్తిః . తథా చ వక్ష్యతి — 'పరీక్ష్య లోకాన్కర్మచితాన్' (ము. ఉ. 1 . 2 . 12) ఇత్యాదినా . న హ్యప్రదర్శితే పరీక్షోపపద్యత ఇతి తత్ప్రదర్శయన్నాహ —



## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

'ఋగ్వేదో యజుర్వేదః' (ము.ఉ. 1-1-5) అన్న మంత్రంలో వేదములు వేదాంగాలతో సహా మొత్తాన్ని అపరా విద్య అని చెప్పారు. 'యత్తదద్రేశ్యం' (ము.ఉ. 1-1-6) అన్న మంత్రం మొదలుకొని 'నామరూపమన్నం చ జాయతే' (ము.ఉ. 1-1-9) అన్న మంత్రం వరకు ఈ ఉపనిషత్తు గ్రంథంలో, ఏ విద్యచేతనైతే అక్షరము (అవినాశిత్వం) యొక్క లక్షణం అవగతమౌతుందో అది పరా విద్య అని వివరంగా చెప్పారు. ఆ తరువాత, ఈ రెండు విద్యల యొక్క విషయాలైన, సంసార-మోక్షాలను వేరుచేసి వివరించడానికి గ్రంథం యొక్క తర్వాతి పాఠాన్ని ప్రారంభిస్తున్నారు. వాటిలో (ఈ రెండు విద్యలలో) కర్త వంటి సాధనాలు-కర్మలు-వాటి ఫలాలలో కూడిన భేధరూపమైన సంసారమే అపర విద్య యొక్క విషయపరిధి. దీనికి (ఈ సంసారానికి) మొదలు లేదు, చివర లేదు. దుఃఖమే స్వరూపంగా గలది కావడం చేత దేహంగల ప్రతి జీవుడు దీనిని (ఈ సంసారాన్ని) పూర్తిగా పారద్రోలాలి. {ద్వైవిధ్యమైన జగత్తు గాఢ నిద్రలో నశించదు. కాని, అవిద్య నశించి ఆత్మజ్ఞానం కలిగిన ఫలితంగా ఈ జగత్తు పూర్తిగానూ శాశ్వతంగానూ తొలగిపోతుంది. – స్వామి గంభీరానంద}. నదీప్రవాహం లాగా ఎడతెరిపి లేకుండా పెనవేసుకొన్నట్లుగా గల ఈ సంసారం ఉపశమించడమే లక్షణంగా కలది, పరావిద్యకు విషయంగా గల మోక్షం. అది (మోక్షం ఎలాంటిదంటే) అనాది-అనంతం-అజరం-అమరం-అమృతం-అభయం వంటి లక్షణాలు గలది, శుద్ధమైనది, ప్రసన్నమైనది, తన ఆత్మయందే

నిలిచియుండటమనే స్థితి కలిగినట్టిది, పరమానందకరమైనది, రెండవది అనేదే లేనట్టిది. ముందుగానైతే అపరవిద్య యొక్క విషయాన్ని తెలియచెప్పడం ప్రారంభించబడుతోంది. ఎందుకంటే, దేనిని తెలుసుకొంటే దానిపట్ల నిర్వేదం నిశ్చయంగా కలుగుతుంది కాబట్టి. అందుకని 'పరీక్ష్య లోకాన్కర్మచితాన్' (ము.ఉ. 1-2-12) అంటూ ప్రారంభమౌతోంది. (సంసారమనేది అనుభవంలో లేకపోతే) అనుభవంలో లేనిదాన్ని పరిశీలించడమనేది జరుగదు కాబట్టి దాన్ని (ఆ సంసారం యొక్క యదార్థత్వాన్ని) తెలియచేస్తూ ఇలా అంటున్నారు.

**తదేతత్సత్యం**

**మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సంతతాని .**

**తాన్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాః సుకృతస్య లోకే .. 1.2.1 ..**

అట్టి ఇది సత్యమే (యదార్థమే). ఋగ్వేదాది మంత్రాలలో మేధావులు ఏ కర్మలనైతే దర్శించారో, అవి మూడు వేదాలతోనూ అనేకంగా ముడిపడియున్నవే. వాటిని



నీవు సత్యం పట్ల కోరిక కలవాడవై నియమబద్ధంగా ఆచరించు. కర్మ ఫలితాలను పొందేందుకు నీకు ఇదే మార్గం.

## శంకరుల భాష్యం

తదేతత్ సత్యం అవితథం . కిం తత్ ? మంత్రేషు ఋగ్వేదాద్యాఖ్యేషు కర్మాణి అగ్నిహోత్రాదీని మంత్రైరేవ ప్రకాశితాని కవయః మేధావినో వసిష్ఠాదయః యాని అపశ్యన్ దృష్టవంతః . యత్తదేతత్సత్యమేకాంతపురుషార్థసాధనత్వాత్ , తాని చ వేదవిహితాని ఋషిదృష్టాని కర్మాణి త్రేతాయాం త్రయీసంయోగలక్షణాయాం హౌత్రాధ్వర్యవౌద్గాత్రప్రకారాయామధికరణభూతాయాం బహుధా బహుప్రకారం సంతతాని సంప్రవృత్తాని కర్మిభిః క్రియమాణాని త్రేతాయాం వా యుగే ప్రాయశః ప్రవృత్తాని ; అతో యూయం తాని ఆచరథ నిర్వర్తయత నియతం నిత్యం సత్యకామా యథాభూతకర్మఫలకామాః సంతః . ఏషః వః యుష్మాకం పంథాః మార్గః సుకృతస్య స్వయం నిర్వర్తితస్య కర్మణః లోకే ఫలనిమిత్తం లోక్యతే దృశ్యతే భుజ్యత ఇతి కర్మఫలం లోక ఉచ్యతే . తదర్థం తత్ప్రాప్తయే ఏష మార్గ ఇత్యర్థః . యాన్యేతాన్యగ్నిహోత్రాదీని త్రయ్యాం విహితాని కర్మాణి, తాన్యేష పంథా అవశ్యఫలప్రాప్తిసాధనమిత్యర్థః ..

తత్రాగ్నిహోత్రమేవ తావత్ప్రథమం ప్రదర్శనార్థముచ్యతే, సర్వకర్మణాం ప్రాథమ్యాత్ . తత్కథం ?

## **శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం**

**తదేతత్ సత్యమ్** అటువంటి ఇది యదార్థమైనట్టిదే (ప్రథమ ఖండంలో చెప్పబడిన అపరా విద్య మరియు పరా విద్యల గురించి చెప్పబడిన విషయాలు యదార్థంగా ఉన్నట్టివే). **మంత్రేషు** ఋగ్వేదాదులనబడే వాటిలో **కర్మాణి** మంత్రములచే ప్రకటించబడిన అగ్నిహోత్రాది కర్మలను **యాని** వేటినైతే **కవయః** మేధావులైన వసిష్ఠాదులు **అపశ్యన్** దర్శించారో. ఏవైతే పురుషార్థాలను సాధించడంలో సఫలీకృతమైనవో, వేదవిహితమైనవో, ఋషులచే దర్శించబడినవో, అట్టి కర్మలు **త్రేతాయామ్** మూడువేదాల కలయిక అయినట్టి హోత్ర-అధ్వర్యు-ఉద్గాత్రల అధ్వర్యంలో ఒక క్రమంలో నిర్వహించబడే (యజ్ఞ యాగాది) కర్మలు లేదా త్రేతాయుగంలో ఆచరణలో ఉన్నట్టి కర్మలు **బహుధా** అనేక విధాలైనవి **సంతతాని** కర్మలు ఆచరణలో ఉన్నాయి. కాబట్టి నీవు **సత్యకామా** ఆ కర్మలయొక్క యదార్థమైన ఫలమందు మాత్రమే కోరిక కలిగిన వాడవై **తాని ఆచరథ** వాటిని (ఆ కర్మలను) ఎల్లవేళలా నియమం ప్రకారంగా ఆచరించు. **ఏషః** ఇది **సుకృతస్య** స్వయంగా నిర్వర్తించ బడిన కర్మయొక్క **లోకే** ఫలితాన్ని పొందేందుకు **వః** నీకు **పన్థాః** దారి లేదా మార్గం. 'లోక' అన్న పదం దర్శించుట లేదా అనుభవించుట అనే అర్థాన్నిచ్చే 'లుక్' ధాతువు యొక్క రూపం కాబట్టి, కర్మఫలాన్ని 'లోక' అని చెప్తున్నారు. దానిని (ఆ కర్మఫలాన్ని) పొందటానికి మార్గం ఇది అని అభిప్రాయం. వేదవిహితాలైన



అగ్నిహోత్రాది కర్మలేవైతే ఉన్నాయో, అవియే తప్పనిసరిగా (పురుషార్థాలనే) ఫలితాల సాధనకు మార్గమని అభిప్రాయం.

ఆ కర్మలన్నింటియందు ప్రధానమైనందు వల్ల, ముందుగా అగ్నిహోత్రాన్ని గురించి వివరించబోతున్నారు. అది ఎలా చెప్తున్నారంటే,

**యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే .**
**తదాఽఽజ్యభాగావన్తరేణాఽఽహుతీః ప్రతిపాదయేత్**
**.. 1.2.2 ..**

ఎప్పుడైతే అగ్ని సమిధలచే ప్రజ్వలింప జేయబడుతుందో, హవిస్సును తీసుకొనిపోయే ఆ అగ్నియందు అప్పుడు ఆజ్యభాగముల మధ్యలో ఆహుతులను సమర్పించాలి.

## **శంకరుల భాష్యం**

యదైవ ఇంధనైరభ్యాహితైః సమ్యగిద్ధే సమిద్ధే దీప్తే హవ్యవాహనే లేలాయతే చలతి అర్చిః ; తదా తస్మిన్కాలే లేలాయమానే చలత్యర్చిషి ఆజ్యభాగౌ ఆజ్యభాగయోః అంతరేణ మధ్యే ఆవాపస్థానే ఆహుతీః ప్రతిపాదయేత్ ప్రక్షిపేత్ దేవతాముద్దిశ్య . అనేకాహఃప్రయోగాపేక్షయా ఆహుతీరితి బహువచనం . ఏష

సమ్యగాహుతిప్రక్షేపాదిలక్షణః కర్మమార్గో లోకప్రాప్తయే పంథాః . తస్య చ సమ్యక్కరణం దుష్కరం ; విపత్తయస్త్వనేకా భవంతి ..

కథం ?

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యదా** ఎప్పుడైతే చుట్టూ పేర్చబడిన **సమిద్ధే** చక్కగా మండే కట్టెలలో **హవ్యవాహనే లేలాయతే** హవిస్సును తీసుకుపోయే, చలించే అగ్ని ప్రజ్వరిల్లుతుందో, **తదా** అప్పుడు, ప్రజ్వలంగా అగ్ని వెలుగుతున్న ఆ సమయంలో, **ఆజ్యభాగౌ** రెండు ఆజ్యభాగాల **అంతరేణ** మధ్యలో అంటే ఆవాపస్థానంలో {దర్శ, పూర్ణమాస క్రతువులలో అగ్నికి ఇరుప్రక్కలా కుడి ఎడమ ప్రక్కల అగ్నిదేవతకు మరియు సోమదేవతకు హవిస్సులు ఇవ్వబడుతాయి ఈ రెండు స్థానాల మధ్యనున్న అగ్నియందలి ప్రదేశాన్ని ఆవాపస్థానం అంటారు – స్వామి గంభీరానంద} **ఆహుతీః** ఆహుతులను **ప్రతిపాదయేత్** దేవతలను ఉద్దేశిస్తూ సమర్పించాలి. అనేక దినాలు ఆహుతులను సమర్పించాల్సి ఉంటుంది కాబట్టి ఆహుతీః అన్న బహువచనాన్ని ప్రయోగించారు. {అగ్నిహోత్ర కర్మను ప్రతిదినం రెండు మార్లు, ప్రాతఃకాలంలోనూ సంధ్యాకాలంలోనూ, జీవితాంతం చేయాలి. కాబట్టి, ద్వివచనం బదులు, ఆహుతీః అన్న బహువచనాన్ని ఉపయోగించారు – స్వామి గంభీరానంద}. ఇదే చక్కగా ఆహుతులను సమర్పించడమనే లక్షణం కలిగిన, లోకంలో ప్రసిద్ధమైన కర్మమార్గం. దానికి చక్కగా



నిర్వహించడం కష్టంతో కూడినట్టిది. అయితే, దీనికి (ఈ అగ్నిహోత్ర కర్మాచరణకు) అనేకమైన అవరోధాలు కలుగుతాయి.

ఏ విధంగా కలుగుతాయి?

**యస్యాగ్నిహోత్రమదర్శమపౌర్ణమాసమచాతుర్మాస్యమనాగ్రయణమతిథివర్జితం చ .**
**అహుతమవైశ్వదేవమవిధినా హుతమాసప్తమాంస్తస్య లోకాన్హినస్తి .. 1.2.3 ..**

ఎవని యొక్క అగ్నిహోత్రంలో దర్శ, పౌర్ణమాస, చాతుర్మాస్యం, అగ్రయణం నిర్వహించబడవో, అతిథి లేకుండునో, ఆహుతులు-వైశ్వదేవం సమర్పించ బడవో, విధి ప్రకారం హోమం చేయబడదో, అతని యొక్క సప్తలోకాలు నిశ్చయంగా నశిస్తాయి.

## శంకరుల భాష్యం

యస్య అగ్నిహోత్రిణః అగ్నిహోత్రం అదర్శం దర్శాఖ్యేన కర్మణా వర్జితం . అగ్నిహోత్రిభిరవశ్యకర్తవ్యత్వాద్దర్శస్య . అగ్నిహోత్రిసంబంధ్యగ్నిహోత్రవిశేషణమివ భవతి . తదక్రియమాణమిత్యేతత్ . తథా అపౌర్ణమాసం

ఇత్యాదిష్వప్యగ్నిహోత్రవిశేషణత్వం ద్రష్టవ్యం . అగ్నిహోత్రాంగత్వస్యావిశిష్టత్వాత్ . అపౌర్ణమాసం పౌర్ణమాసకర్మవర్జితం . అచాతుర్మాస్యం చాతుర్మాస్యకర్మవర్జితం . అనాగ్రయణం ఆగ్రయణం శరదాదిషు కర్తవ్యం , తచ్చ న క్రియతే యస్య తత్తథా . అతిథివర్జితం చ అతిథిపూజనం చాహన్యహన్యక్రియమాణం యస్య . స్వయం సమ్యగగ్నిహోత్రకాలే అహుతం . అదర్శాదివత్ అవైశ్వదేవం వైశ్వదేవకర్మవర్జితం . హూయమానమప్యవిధినా హుతం అయథాహుతమిత్యేతత్ . ఏవం దుఃసంపాదితమసంపాదితమగ్నిహోత్రాద్యుపలక్షితం కర్మ కిం కరోతీత్యుచ్యతే — ఆసప్తమాన్ సప్తమసహితాన్ తస్య కర్తుర్లోకాన్ హినస్తి హినస్తీవ ఆయాసమాత్రఫలత్వాత్ . సమ్యక్ క్రియమాణేషు హి కర్మసు కర్మపరిణామానురూప్యేణ భూరాదయః సత్యాంతాః సప్త లోకాః ఫలం ప్రాప్తవ్యం . తే లోకాః ఏవంభూతేనాగ్నిహోత్రాదికర్మణా త్వప్రాప్యత్వాద్ధింస్యంత ఇవ, ఆయాసమాత్రం త్వవ్యభిచారీత్యతో హినస్తీత్యుచ్యతే . పిండదానాద్యనుగ్రహేణ వా సంబధ్యమానాః పితృపితామహప్రపితామహాః పుత్రపౌత్రప్రపౌత్రాః స్వాత్మోపకారాః సప్త లోకా ఉక్తప్రకారేణాగ్నిహోత్రాదినా న భవంతీతి హింస్యంత ఇత్యుచ్యతే ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యస్య** ఎవని యొక్క అంటే అగ్నిహోత్ర కర్మచేసే వాని యొక్క **అగ్నిహోత్రమ్** అగ్నిహోత్రమునందు **అదర్శమ్** దర్శ అనబడే కర్మ విడువబడినదో (చేయబడలేదో). దర్శ అన్నది అగ్నిహోత్రుడైనవాడు తప్పనిసరిగా చేయవలసిన కర్మ అయినందుచేత



అగ్నిహోత్రునికి సంబంధించిన అగ్నిహోత్రానికి అది విశేషణంగా పరిణమించింది. అది (అ దర్శ అనే క్రతువు) నిర్వర్తించలేదని భావం. అలాగే అపౌర్ణమాసం వంటివాటియందు కూడా అవి అగ్నిహోత్రానికి అంగాలైనందుచేత అగ్నిహోత్ర విశేషణాలుగా గ్రహించాలి. **అపౌర్ణమాసమ్** పౌర్ణమాస అనే కర్మ విడువబడినదో. **అచాతుర్మాస్యమ్** చాతుర్మాస్యమనే కర్మ నిర్వర్తించబడలేదో. **అనాగ్రయణమ్** శరద్కాలాదులలో నిర్వహించవలసినది అగ్రయణం. దేనియందు (ఎవని అగ్నిహోత్రంలో) అది చేయబడదో అది అనాగ్రయణం. **అతిథివర్జితమ్** ప్రతిదినం చేయతగిన అతిథిని పూజించడమనే క్రియ దేనియందు (ఎవని అగ్నిహోత్రంలో) విడువబడినదో (జరుగదో). **అహుతమ్** స్వయంగా అగ్నిహోత్ర క్రియయే సరియైన కాలంలో నిర్వహించబడదో. **అవైశ్వదేవం** అదర్శలో వలెనే వైశ్వదేవమనే కర్మ చేయబడదో. **అవిధినా హుతమ్** అగ్నిహోత్రకర్మను నిర్వహించినప్పటికీ అది నియమానుసారం చేయబడదో. ఈ విధంగా అగ్నిహోత్రాదుల వంటి ఈ కర్మలను నిర్వర్తించకపోతే మరియు నియమానుసారం నిర్వహించకపోతే ఏమవుతుందో చెప్తున్నారు. (అటువంటి కర్మ) **ఆసప్తమాస్** ఆ కర్త యొక్క సప్తమలోకంతో సహా ఏడు లోకాల వరకూ **హినస్తి** నాశనం చేస్తుంది. అంటే, కేవల కర్మవల్ల శ్రమ మాత్రమే కలగడం చేత నాశనమైనట్లుగా అని భావన. చక్కగా నిర్వహించిన కర్మయందు నిశ్చయంగా కర్మకు ప్రతిఫలరూపంగా భూలోకంతో మొదలై సత్య లోకం వరకు గల ఏడు లోకాలు ప్రాప్తిస్తాయి.

అగ్నిహోత్రాదికర్మల ద్వారా ప్రాప్తించ వలసియున్న లోకాలైతే ప్రాప్తించనందు చేత అవి నశించినట్లుగా, కేవలం శ్రమ మాత్రమే మిగిలినందున (అటువంటి నిర్వహించ వలసిన కర్మలను నిర్వర్తించని లేద విధివిధాంగా ఆచరించని అగ్నిహోత్రునికి) నష్టం కలుగుతుందని అంటున్నారు. పిండ ప్రదానం మొదలైన వాటి ద్వారా తండ్రి, తాత, ముత్తాతలతోనూ, తనూ, తన కుమారుడు, మనుమడు, మునిమనుమలతోనూ సంబంధాన్ని కలిగి ఉండటం అనే ఏడు తరాల వల్ల కలిగే ఉపకారం, పైన చెప్పిన ప్రకారం అగ్నిహోత్రాదులను నిర్వహించబడనందున, నశిస్తుంది అని చెప్తున్నారు.

**కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా .**
**స్ఫులిఙ్గినీ విశ్వరుచీ చ దేవీ లేలాయమానా ఇతి సప్త జిహ్వాః**
**.. 1.2.4 ..**

కాలీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ మరియు విశ్వరుచీ. ఇవి ప్రకాశించే అగ్నిజ్వాలల యొక్క ఏడు నాలుకలు.



## శంకరుల భాష్యం

కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా . స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ లేలాయమానా దహనస్య జిహ్వాః . కాల్యాద్యా విశ్వరుచ్యంతా లేలాయమానాః అగ్నేర్హవిరాహుతిగ్రసనార్థా ఏతాః కిల సప్త జిహ్వాః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

కాలీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ మరియు విశ్వరుచీ అన్న **దేవీ** ప్రకాశాలు **లేలాయమానా** ప్రజ్వలించే అగ్నియొక్క **సప్త జిహ్వాః** ఏడు నాలుకలు. కాలీ మొదలు విశ్వరుచి వరకూ ప్రజ్వలించే అగ్నియందు హవిస్సును స్వీకరించే ఏడు నాలుకలు ఇవే అని అభిప్రాయం.

**ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు యథాకాలం చాహుతయో హ్యాదదాయన్ .**
**తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో యత్ర దేవానాం పతిరేకోఽధివాసః .. 1.2.5 ..**

ఎవనిచే సరియైన కాలంలో మండుతున్న అగ్నిలో ఆహుతులు సమర్పించబడుతాయో, అవి (ఆ ఆహుతులు)

సూర్యుని యొక్క కిరణాలై అతనిని దేవతలయందు అధిపతి ఒక్కడే ఉండే స్థానానికి తీసుకొని వెడతాయి.

## శంకరుల భాష్యం

ఏతేషు అగ్నిజిహ్వాభేదేషు యః అగ్నిహోత్రీ చరతే కర్మాచరత్యగ్నిహోత్రాదికం భ్రాజమానేషు దీప్యమానేషు . యథాకాలం చ యస్య కర్మణో యః కాలస్తం కాలమనతిక్రమ్య యథాకాలం యజమానం ఆదదాయన్ ఆదదానా ఆహుతయః తం నయంతి ప్రాపయంతి . ఏతాః ఆహుతయో యా ఇమా అనేన నిర్వర్తితాః సూర్యస్య రశ్మయః భూత్వా, రశ్మిద్వారైరిత్యర్థః . యత్ర యస్మిన్స్వర్గే దేవానాం పతిః ఇంద్రః ఏకః సర్వానుపరి అధి వసతీతి అధివాసః ..

కథం సూర్యస్య రశ్మిభిర్యజమానం వహంతీత్యుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఏతేషు భ్రాజమానేషు** దీప్తిమంతమైన అగ్ని యొక్క ఈ వివిధ రకాలైన నాలుకల యందు **యః** ఏ అగ్నిహోత్రుడైతే యథాకాలం – ఏ కర్మ ఏకాలంలో చేయాలో ఆకాలాన్ని అతిక్రమించకుండా చేయడం **చరతే** అగ్నిహోత్రాది కర్మలను ఆచరిస్తాడో **తమ్** అతనిని, ఆ యజమానిని **ఏతాః ఆహుతయః** సమర్పించబడిన ఈ ఆహుతులు **సూర్యస్య రశ్మయః** సూర్యుని కిరణాలుగా మారి, సూర్య కిరణాల మార్గంలో అని అభిప్రాయం **ఆదదాయన్** తీసుకొని పోయి **యత్ర** ఏ స్వర్గంలోనైతే **దేవానాం పతిః** దేవతల అధిపతియైన ఇంద్రుడు **ఏకః**



ఒక్కడే **అధివాసః** అందరికన్నా పైన నివసిస్తాడో అక్కడకు **నయంతి** తీసుకుపోత .

ఏవిధంగా సూర్యకిరణాలు యజమానిని మోసుకొనిపోతాయో చెప్తున్నారు.

**ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి .**
**ప్రియాం వాచమభివదన్త్యోఽర్చయన్త్య ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః .. 1.2.6 ..**

“రండి, రండి” అని ప్రియమైన వాక్కులను ఉచ్చరిస్తూ, పూజిస్తూ, “ఇదియే ధర్మాచరణవల్ల నీచే చక్కగా సాధించుకొన్న స్వర్గానికి మార్గం” అని పలుకుతూ ఆ యజమానిని చక్కని వర్చస్సు కల ఆహుతులు సూర్యుని కిరణాల మార్గంలో మోసుకొనిపోతాయి.

## శంకరుల భాష్యం

ఏహి ఏహి ఇతి ఆహ్వాయంత్యః తం యజమానం ఆహుతయః సువర్చసః దీప్తిమత్యః ; కించ, ప్రియాం ఇష్టాం వాచం స్తుత్యాదిలక్షణాం అభివదంత్యః ఉచ్చారయంత్యః అర్చయంత్యః పూజయంత్యశ్చ ఏషః వః యుష్మాకం పుణ్యః

సుకృతః బ్రహ్మలోకః ఫలరూపః, ఇత్థం ప్రియాం వాచం అభివదంత్యో వహంతీత్యర్థః . బ్రహ్మలోకః స్వర్గః ప్రకరణాత్ ..

ఏతచ్చ జ్ఞానరహితం కర్మైతావత్ఫలమవిద్యాకామకర్మకార్యం అతోఽసారం దుఃఖమూలమితి నింద్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఏహి ఏహి ఇతి** రండి రండి అని స్వాగతిస్తూ **తం** యజమానం **ఆహుతయః సువర్చసః** వెలుగులు చిమ్మే ఆహుతులు. మరింకేంటి? **ప్రియామ్ వాచమ్** ప్రీతిని కలిగించే కీర్తిలక్షణాలు కల వాక్యాలను **అభివదన్త్యః** పలుకుతున్నాయి, **అర్చయన్త్యః** పూజిస్తున్నాయి కూడా. **ఏషః** ఇది **వః** నీయొక్క **పుణ్యః సుకృతః** ధర్మాచరణకు ఫలరూపమైన **బ్రహ్మలోకః** బ్రహ్మలోకానికి దారి అని అంటూ ప్రియమైన మాటలు పలుకుతూ మోసుకెడుతున్నాయని అభిప్రాయం. సందర్భాన్ని బట్టి ఇక్కడ 'బ్రహ్మలోకః' అంటే స్వర్గం అని గ్రహించాలి.

ఈ కర్మ, జ్ఞానరహితమైనది మరియు అవిద్య-కామ-కర్మల వల్ల కలిగేది కాబట్టి దాని ఫలితం పరిమితమైనది. అందుచేత, (ఈ కర్మలను) నిస్సారమైనవనీ మరియు దుఃఖానికి మూలమనీ ఇలా నిందిస్తున్నారు.



**ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ .**

**ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి .. 1.2.7 ..**

పదునెనిమిది అంశాలు కలిగిన ఈ యజ్ఞమనే కర్మ తక్కువస్థాయిది, అస్థిరమైనది నిశ్చయంగా నశించేది. దీనిని శ్రేయమని ఏ మూర్ఖులు అభినందిస్తున్నారో వారు జరా మరణాలను తిరిగి పొందుతూనే ఉన్నారు.

## శంకరుల భాష్యం

ప్లవాః వినాశిన ఇత్యర్థః . హి యస్మాత్ ఏతే అదృఢాః అస్థిరాః యజ్ఞరూపాః యజ్ఞస్య రూపాణి యజ్ఞరూపాః యజ్ఞనిర్వర్తకాః అష్టాదశ అష్టాదశసంఖ్యాకాః షోడశర్త్విజః పత్నీ యజమానశ్చేత్యష్టాదశ . ఏతదాశ్రయం కర్మ ఉక్తం కథితం శాస్త్రేణ యేషు అష్టాదశసు అవరం కేవలం జ్ఞానవర్జితం కర్మ . అతస్తేషామవరకర్మాశ్రయాణామష్టాదశానామదృఢతయా ప్లవత్వాత్ప్లవతే సహ ఫలేన తత్సాధ్యం కర్మ ; కుండవినాశాదివ క్షీరదధ్యాదీనాం తత్స్థానాం నాశః ; యత ఏవం ఏతత్ కర్మ శ్రేయః శ్రేయఃసాధనమితి యే అభినందంతి అభిహృష్యంతి అవివేకినః మూఢాః, అతః తే జరాం చ మృత్యుం చ

జరామృత్యుం కంచిత్కాలం స్వర్గే స్థిత్వా పునరేవ అపి యంతి భూయోఽపి గచ్ఛంతి ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ప్లవాః** నశించేవి అని అభిప్రాయం. **హి** ఎందువల్లనంటే **ఏతే** ఇవి (ఈ కర్మలు) **అదృఢాః** అస్థిరములు యజ్ఞరూపాః యజ్ఞం యొక్క అంశాలు అంటే యజ్ఞాన్ని నిర్వహించేవారు **అష్టాదశ** పదునెనిమిది మంది అంటే పదహారు మంది ఋత్విక్కులు, యజమాని, యజమాని భార్య కలిపి పదునెనిమిది మంది. {బ్రహ్మ, బ్రాహ్మణాచ్ఛంసి, అగ్నీధ్రుడు, పోత, ప్రతిప్రస్థాత, హోత, ఉద్గాత, ప్రతిహర్త, సుబ్రహ్మణ్యుడు, మైత్రావరుణుడు, ప్రస్తోత, అచ్ఛావాకుడు, గ్రావస్తుత్, నేష్ట, ఉన్నేత, అధ్వర్యుడు, యజమానుడు, పత్ని అని 18మంది – స్వామి తత్త్వవిదానంద సరస్వతి}. **యేషు** ఏ పదునెనిమిది మంది మీదనైతే ఆధారపడి యున్నదో అట్టి **ఉక్తం** శాస్త్రంలో చెప్పబడిన కర్మ **అవరం** జ్ఞానసంబంధం లేని కేవల కర్మ కాబట్టి. ఈ జ్ఞాన సంబంధం లేని కేవల కర్మను ఆశ్రయించినట్టి పదునెనిమంది యొక్క అస్థిరత్వం వల్ల , కర్మ ఫలంతో సహా దానికి సాధనమైన కర్మకూడా, కుండ నశించగా దానిలో నున్న పాలు, పెరుగు మొదలైనవి నశించినట్లుగా, నశించిపోతుంది. **ఏతత్** ఈ కర్మను **శ్రేయః** శ్రేయస్సుకు సాధనమని **యే అభినందన్తి** ఎవరైతే సంతోషిస్తారో వారు **మూఢాః** అవివేకులు, మూర్ఖులు. ఎందుకంటే వారు **పునరేవ అపి** కొంతకాలం



స్వర్గంలో ఉండి తిరిగి మరలా **జరామృత్యుమ్** వృద్ధాప్యాన్ని మరియు మృత్యువును **యాన్తి** చేరుతారు.

**అవిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితం మన్యమానాః .**
**జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః .. 1.2.8 ..**

అవిద్యయందే మసలేవారు, తమకు తామే బుద్ధిగల వారమనీ పండితులమనీ అనుకొనే వారు, మరో గుడ్డివానిచే తీసుకుపోబడే గుడ్డివారిలాగా, మూర్ఖులు. దుఃఖపీడితులై పరిభ్రమిస్తూ ఉంటారు.

## శంకరుల భాష్యం

కించ, అవిద్యాయాం అంతరే మధ్యే వర్తమానాః అవివేకప్రాయాః స్వయం వయమేవ ధీరాః ధీమంతః పండితా విదితవేదితవ్యాశ్చేతి మన్యమానా ఆత్మానం సంభావయంతః, తే చ జంఘన్యమానాః జరారోగాద్యనేకానర్థవ్రాతైర్హన్యమానా భృశం పీడ్యమానాః పరియంతి విభ్రమంతి మూఢాః . దర్శనవర్జితత్వాత్ అంధేనైవ అచక్షుష్కేణైవ నీయమానాః

ప్రదర్శ్యమానమార్గాః ; యథా లోకే అంధాః చక్షురహితా గర్తకంటకాదౌ పతంతి, తద్వత్ ..

కించ,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఇంకా ఏమంటే, **అవిద్యాయామ్ అన్తరే** అజ్ఞానంలోనే **వర్తమానాః** ఉండేవారు అవివేకప్రాయులైనవారు, **స్వయమ్** తమకు తామే **ధీరాః** బుద్ధికలవారమని **పండితాః** తెలియదగిన దాన్ని తెలుసుకొన్నామని **మన్యమానాః** భావించుకొనేవారు, మరియు **జంఘన్యమానాః** జరారోగాదుల వంటి అనేక బాధలచే బాగా పీడింపబడే వారు **మూఢా** మూర్ఖులు. వారు **పరియన్తి** భ్రమకు లోనౌతారు. **యథా** లోకంలో **అంధేనైవ** చూపులేని, కన్నులులేనివానిచే **నీయమానాః** దారి చూపబడే **అంధాః** గుడ్డివారు గుంటలో ముళ్ళలో పడతారో ఆవిధంగా.

ఇంకేమంటే,

**అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః .**
**యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగాత్తేనాఽఽతురాః క్షీణలోకాశ్చ్యవన్తే .. 1.2.9 ..**



అవివేకులు అజ్ఞానంలోనే పలువిధాలుగా ప్రవర్తిస్తూ తమకు తామే 'కృతార్థులమైనాము' అని అనుకొంటుంటారు. కర్మఫలాసక్తి మీద మోహంతో కర్మలు చేసేవారు తత్త్వాన్ని గ్రహించలేరు. ఆ కారణంగా వారు దుఃఖపీడితులై కర్మఫలం క్షీణించిన మీదట స్వర్గం నుండి పడిపోతారు.

## శంకరుల భాష్యం

అవిద్యాయాం బహుధా బహుప్రకారం వర్తమానాః వయమేవ కృతార్థాః కృతప్రయోజనాః ఇతి ఏవం అభిమన్యంతి అభిమన్యంతే అభిమానం కుర్వంతి బాలాః అజ్ఞానినః . యత్ యస్మాదేవం కర్మిణః న ప్రవేదయంతి తత్త్వం న జానంతి రాగాత్ కర్మఫలరాగాభిభవనిమిత్తం , తేన కారణేన ఆతురాః దుఃఖార్తాః సంతః క్షీణలోకాః క్షీణకర్మఫలాః స్వర్గలోకాత్ చ్యవంతే ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**బాలాః** వివేకం లేనివారు **అవిద్యాయామ్** అజ్ఞానంలోనే **బహుధా** అనేక విధాలుగా **వర్తమానాః** ప్రవర్తిస్తూ **వయమ్ కృతార్థాః మేము లక్ష్యాన్ని సాధించాము ఇతి** అనే విధంగా **అభిమన్యంతి (అభిమన్యంతే)** అనుకుంటారు. **యత్** ఎందుకంటే, **రాగాత్** కర్మఫలాల మీద కోరిక కలవారవడం చేత **కర్మిణః న ప్రవేదయంతి** కర్మిష్ఠులు

తత్త్వాన్ని తెలుసుకోలేరు కాబట్టి. **తేన** ఆ కారణం వల్ల **ఆతురాః** దుఃఖంచేత బాధపడేవారై **క్షీణలోకాః** కర్మఫలం నశించగా స్వర్గలోకం నుండి **చ్యవంతే** జారిపోతారు లేదా పడిపోతారు.

**ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః .**
**నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వేమం లోకం హీనతరం వా విశన్తి .. 1.2.10 ..**

మూర్ఖులు ఇష్టాపూర్తాలే గొప్పవని, అంతకంటే శ్రేయమైనవి వేరేవీ లేవని అనుకొంటుంటారు. వారు స్వర్గంయొక్క ఉన్నతస్థానంలో కర్మఫలాలను అనుభవించిన మీదట ఈ లోకాన్ని లేదా ఇంకా తక్కువస్థాయి లోకాన్ని ప్రవేశిస్తారు.

## శంకరుల భాష్యం

ఇష్టాపూర్తం ఇష్టం యాగాది శ్రౌతం కర్మ పూర్తం స్మార్తం వాపీకూపతడాగాదికర్మ మన్యమానాః ఏతదేవాతిశయేన పురుషార్థసాధనం వరిష్ఠం ప్రధానమితి చింతయంతః, అన్యత్ ఆత్మజ్ఞానాఖ్యం శ్రేయఃసాధనం న వేదయంతే న జానంతి ప్రమూఢాః పుత్రపశుబాంధవాదిషు ప్రమత్తతయా మూఢాః ; తే చ నాకస్య



స్వర్గస్య పృష్ఠే ఉపరిస్థానే సుకృతే భోగాయతనే అనుభూత్వా అనుభూయ కర్మఫలం పునః ఇమం లోకం మానుషం అస్మాత్ హీనతరం వా తిర్యఙ్నరకాదిలక్షణం యథాకర్మశేషం విశంతి ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఇష్టమ్** వేదవిహితమైన యాగం మొదలుగాగల కర్మ **పూర్తమ్** స్మృతులు నిర్దేశించిన తటాకాలు, బావులు, చెరువులను నిర్మించడం వంటి కర్మ మాత్రమే పురుషార్థ సాధనాలలో **వరిష్ఠమ్** ప్రధానమని ఉత్తమమని **మన్యమానాః** అనుకొనేవారు **అన్యత్ శ్రేయః** ఆత్మజ్ఞానమనే శ్రేయసాధనాన్ని **న వేదయంతే** తెలుసుకొనరు. అట్టి వారు **ప్రమూఢాః** సంతానం, పశువులు, బంధువులయందు జాగరూకులై ఉంటారు కాబట్టి మూర్ఖులు. వారు **నాకస్య** స్వర్గం యొక్క **పృష్ఠే** ఉన్నతమైన స్థానంలో **సుకృతే** భోగములయందు **అనుభూత్వా** కర్మఫలాలకు తగిన అనుభవాలను పొందిన తర్వాత తిరిగి **ఇమం లోకం** ఈ మానుషలోకాన్ని **వా** లేదా దానికన్నా **హీనతరమ్** మిగిలిన కర్మశేషానికి అనుగుణంగా జంతు-నరక లక్షణాలు కలిగిన (క్రింది స్థాయి) లోకాన్ని **విశంతి** ప్రవేశిస్తారు.

**తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్షచర్యాం చరన్తః .**

**సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా .. 1.2.11 ..**

ఎవరైతే ఆశ్రమ విహిత కర్మ మరియు ఉపాసనను నిర్వర్తిస్తూ, శాంతులు మరియు గృహస్థులు భిక్షాటనతో వనాలలో సంచరిస్తుంటారో, వారు దోషరహితులై సూర్యుని మార్గంలో మృతి, వినాశాలు లేని ఆ పురుషుడుండే స్థానానికి పయనిస్తారు.

## శంకరుల భాష్యం

యే పునస్తద్విపరీతజ్ఞానయుక్తా వానప్రస్థాః సంన్యాసినశ్చ, తపఃశ్రద్ధే హి తపః స్వాశ్రమవిహితం కర్మ, శ్రద్ధా హిరణ్యగర్భాదివిషయా విద్యా, తే తపఃశ్రద్ధే ఉపవసంతి సేవంతేఽరణ్యే వర్తమానాః సంతః . శాంతాః ఉపరతకరణగ్రామాః . విద్వాంసః గృహస్థాశ్చ జ్ఞానప్రధానా ఇత్యర్థః . భైక్షచర్యాం చరంతః పరిగ్రహాభావాదుపవసంత్యరణ్యే ఇతి సంబంధః . సూర్యద్వారేణ సూర్యోపలక్షితేనోత్తరేణ పథా తే విరజాః విరజసః, క్షీణపుణ్యపాపకర్మాణః సంత ఇత్యర్థః . ప్రయాంతి ప్రకర్షేణ యాంతి యత్ర యస్మిన్సత్యలోకాదౌ అమృతః స పురుషః ప్రథమజో హిరణ్యగర్భః హి అవ్యయాత్మా అవ్యయస్వభావో యావత్సంసారస్థాయీ . ఏతదంతాస్తు సంసారగతయోఽపరవిద్యాగమ్యాః . నన్వేతం మోక్షమిచ్ఛంతి కేచిత్ . న, 'ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః' (ము. ఉ. 3 . 2 . 2) 'తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మానః సర్వమేవావిశంతి' (ము. ఉ. 3 . 2 . 5) ఇత్యాదిశ్రుతిభ్యః ; అప్రకరణాచ్చ . అపరవిద్యాప్రకరణే హి ప్రవృత్తే న హ్యకస్మాన్మోక్షప్రసంగోఽస్తి . విరజస్త్వం త్వాపేక్షికం . సమస్తమపరవిద్యాకార్యం సాధ్యసాధనలక్షణం క్రియాకారకఫలభేదభిన్నం ద్వైతం ఏతావదేవ యద్ధిరణ్యగర్భప్రాప్త్యవసానం . తథా చ మనునోక్తం స్థావరాద్యం సంసారగతిమనుక్రామతా — 'బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్తమేవ చ . ఉత్తమాం సాత్త్వికీమేతాం గతిమాహుర్మనీషిణః' (మను. 12 . 50) ఇతి ..



అథేదానీమస్మాత్సాధ్యసాధనరూపాత్సర్వస్మాత్సంసారాద్విరక్తస్య పరస్యాం విద్యాయామ్ అధికార ప్రదర్శనార్థమిదముచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మరి ముందు చెప్పిన దానికి విపరీతంగా, **యే** ఎవరైతే ఉపాసనలో నిమగ్నులైన వానప్రస్థులు మరియు సన్యాసులున్నారో వారు, **తపఃశ్రద్ధే హి** తపమనగా తమ ఆశ్రమానికి విధించిన కర్మ, శ్రద్ధయనగా హిరణ్యగర్భాది విషయ విచారణతో, **ఉపవసంతి** ఉపాసిస్తూ **అరణ్యే** వనాలలో ఉంటున్నారు. వారు **శాంతాః** ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన్నవారు **విద్వాంసః** జ్ఞానమే ప్రధానంగా గలిగిన గృహస్థులని కూడా అర్థం. **భైక్షచర్యాం చరంతః** దానాది స్వీకారం లేకుండా (భిక్షాటనతో) ఉపాసన చేసుకుంటూ అరణ్యంలో ఉన్నవారనే సంబంధాన్ని గ్రహించాలి. **తే** వారు **విరజాః** దోషములు లేని వారై, అంటే పుణ్య-పాప కర్మలు నశించినట్టి వారై అని భావం, **సూర్యద్వారేణ** సూర్య

అనే పదంతో సూచించబడిన ఉత్తర మార్గాన, **యత్ర** ఎక్కడ సత్యలోకాదులున్నాయో **హి అవ్యయాత్మా** తరుగుదలే లేని స్వభావం కల, సంసారమున్నంత వరకూ ఉండేటటువంటి **సః అమృతః పురుషః** మృతిలేనట్టి ప్రథమంగా పుట్టిన ఆ హిరణ్యగర్భుని లోకానికి **ప్రయాంతి** ఎంతో (సునాయాసంగా) చక్కగా పయనిస్తారు. ఇదియే అపర విద్య వల్ల కలిగే సంసార గతియొక్క అంతిమ గమ్యం.

**సందేహం** : కొందరిచే మోక్షమని భావించబడేది ఇదే కదా!

**సమాధానం** : కాదు. 'ఇక్కడే అన్ని కోరికలు విలీనమౌతాయి' ['ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః' (ము.ఉ. 3-2-2)]; 'వివేకం కలిగి విచారణలో నిమగ్నమైన వారు సర్వవ్యాపకమైన బ్రహ్మాన్ని సర్వత్రా పొంది సర్వంలోకే ప్రవేశిస్తారు' ['తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మానః సర్వమేవావిశంతి' (ము.ఉ. 3-2-5)] అని చెప్పబడబోయే శ్రుతివాక్యాల వల్ల (పైన చెప్పబడిన స్థితి మోక్షం కాదు). ఈ ప్రకరణం యొక్క సందర్భం కూడా ఇది కాదు. (ప్రస్తుత ప్రకరణం అపరా విద్యకు సంబంధించినది. అపరా విద్యకు అంతిమ లక్ష్యం మోక్షం కాదు కాబట్టి, ఇక్కడ అపరా విద్యయొక్క అంతిమ లక్ష్యంగా చెప్పబడిన హిరణ్యగర్భుని స్థాయికి చేరుకోవడమనేది మోక్షం కానేరదు). అపరా విద్య గురించి చెప్తున్నప్పుడు అకస్మాత్తుగా మోక్షం గురించిన ప్రస్తావన తీసుకురాబడదు. పాప-పుణ్య రహితమైన విరజస్త్వ స్థితి సాపేక్షికమే. సాధనాలు-లక్షితాలు అనే లక్షణాలున్నవి మరియు క్రియ-కారకం-ఫలం అనే భిన్నత్వంతో ద్వైత భావన కలిగిన అపరా విద్య



వల్ల కలిగే సమస్త ఫలితాలు, కేవలం హిరణ్యగర్భుని పొందటంతో మాత్రమే ముగుస్తాయి. అలాగే మనువు కూడా కదలని ప్రాణులతో మొదలు (సమస్త జీవుల) సంసార గతి క్రమాన్ని వివరిస్తూ 'బ్రహ్మ, ప్రజాపతులు, ధర్ముడు, మహత్తత్వం మరియు అవ్యక్తాన్ని పొందటమన్నదే ఉత్తమమైన సత్వప్రధానమైన లక్ష్యం అని వివేకం కలవారు చెప్తారు' ['బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్తమేవ చ . ఉత్తమాం సాత్త్వికీమేతాం గతిమాహుర్మనీషిణః' (మను. 12-50)] అని అన్నాడు.

ఇక సర్వత్రా ఈ సాధ్యము-సాధనమనే రూపాలు గలిగిన సంసారంనుండి విరక్తి చెందిన వానికి పరా విద్యయందు అధికారం ఉంటుందని తెలియజేయడానికి ఇలా అంటున్నారు.

**పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన .**
**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ .. 1.2.12 ..**

కర్మల పర్యవసానంగా కలిగే లోకాలను పరిశీలించిన బ్రాహ్మణుడు (శాశ్వతం కాని) కర్మ ఫలం తప్ప మరేదీ లేదని, మరి కర్మ గురించి (ఎందుకు

నిర్వర్తించాలి? అనే) విరక్తిని పొందాలి. దానిని (శాశ్వతమైన దానిని) తెలుసుకోవడం కోసం అతడు శ్రోత్రియుడు మరియు బ్రహ్మనిష్ఠుడైన గురువును సమిధలు చేతబట్టి సమీపించాలి.

## శంకరుల భాష్యం

పరీక్ష్య యదేతదృగ్వేదాద్యపరవిద్యావిషయం స్వాభావికావిద్యాకామకర్మదోషవత్పురుషానుష్ఠేయమ్ అవిద్యాదిదోషవంతమేవ పురుషం ప్రతి విహితత్వాత్తదనుష్ఠానకార్యభూతాశ్చ లోకా యే దక్షిణోత్తరమార్గలక్షణాః ఫలభూతాః, యే చ విహితాకరణప్రతిషేధాతిక్రమదోషసాధ్యా నరకతిర్యక్ప్రేతలక్షణాః, తానేతాన్పరీక్ష్య ప్రత్యక్షానుమానోపమానాగమైః సర్వతో యాథాత్మ్యేనావధార్య లోకాన్ సంసారగతిభూతానవ్యక్తాదిస్థావరాంతాని వ్యాకృతావ్యాకృతలక్షణాన్బీజాంకురవదితరేతరోత్పత్తినిమిత్తాన్యనేకానర్థశతసహస్రసంకులాన్కదలీగర్భవదసారాన్మాయామరీచ్యుదకగంధర్వనగరాకారస్వప్నజలబుద్బుదఫేనసమాన్ప్రతిక్షణప్రధ్వంసాన్పృష్ఠతః కృత్వా విద్యాకామదోషప్రవర్తితకర్మచితాంధర్మాధర్మనిర్వర్తితానిత్యేతత్ . బ్రాహ్మణః, బ్రాహ్మణస్యైవ విశేషతోఽధికారః సర్వత్యాగేన బ్రహ్మవిద్యాయామితి బ్రాహ్మణగ్రహణం . పరీక్ష్య లోకాన్కిం కుర్యాదిత్యుచ్యతే — నిర్వేదం , నిష్పూర్వో విదిరత్ర వైరాగ్యార్థే, వైరాగ్యం ఆయాత్ కుర్యాదిత్యేతత్ . స వైరాగ్యప్రకారః ప్రదర్శ్యతే — ఇహ సంసారే నాస్తి కశ్చిదపి అకృతః పదార్థః . సర్వ ఏవ హి లోకాః కర్మచితాః కర్మకృతత్వాచ్చానిత్యాః . న నిత్యం కించిదస్తీత్యభిప్రాయః . సర్వం తు



కర్మానిత్యస్యైవ సాధనం . యస్మాచ్చతుర్విధమేవ హి సర్వం కర్మ కార్యం — ఉత్పాద్యమాప్యం వికార్యం సంస్కార్యం వా . నాతః పరం కర్మణో విషయోఽస్తి . అహం చ నిత్యేనామృతేనాభయేన కూటస్థేనాచలేన ధ్రువేణార్థేనార్థీ, న తద్విపరీతేన . అతః కిం కృతేన కర్మణా ఆయాసబహులేనానర్థసాధనేన ఇత్యేవం నిర్విణ్ణోఽభయం శివమకృతం నిత్యం పదం యత్ , తద్విజ్ఞానార్థం విశేషేణాధిగమార్థం స నిర్విణ్ణో బ్రాహ్మణః గురుమేవ ఆచార్యం శమదమాదిసంపన్నం అభిగచ్ఛేత్ . శాస్త్రజ్ఞోఽపి స్వాతంత్ర్యేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం న కుర్యాదిత్యేతద్గురుమేవేత్యవధారణఫలం . సమిత్పాణిః సమిద్భారగృహీతహస్తః శ్రోత్రియం అధ్యయనశ్రుతార్థసంపన్నం బ్రహ్మనిష్ఠం హిత్వా సర్వకర్మాణి కేవలేఽద్వయే బ్రహ్మణి నిష్ఠా యస్య సోఽయం బ్రహ్మనిష్ఠః ; జపనిష్ఠస్తపోనిష్ఠ ఇతి యద్వత్ . న హి కర్మిణో బ్రహ్మనిష్ఠతా సంభవతి, కర్మాత్మజ్ఞానయోర్విరోధాత్ . స తం గురుం విధివదుపసన్నః ప్రసాద్య పృచ్ఛేదక్షరం పురుషం సత్యం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**పరీక్ష్య** ఏవి ఈ ఋగ్వేదాదులయందు ప్రస్తావించిన అపరా విద్య యొక్క విషయాలో, అజ్ఞానం-కోరిక-కర్మ అనే దోషాలే స్వభావంగా కలిగి సాధకులచే అనుష్టించదగినవన్నీ అవిద్యాది దోషాలతో నిండినవో, వాటిని సాధకుడు ఆచరించిన ఫలితంగా ఏర్పడిన దక్షిణ-ఉత్తర మార్గాలనే లక్షణాలున్న ఏ లోకాలున్నాయో, విహితమైన కర్మలు నిర్వర్తించకుండా వాటిని అతిక్రమించి నిషిద్ధ కర్మల ఆచరణ ఫలంగా కలిగే నరక-తిర్యక్-ప్రేత లక్షణాలున్న ఏ లోకాలున్నాయో,

వాటన్నింటిని **పరీక్ష్య** ప్రత్యక్ష-అనుమాన-ఉపమాన ప్రమాణాలతో వాటి యదార్థత్వాన్ని అన్నిరకాలుగా నిర్ధారించుకొని **లోకాన్** అవ్యక్తం మొదలుకొని కదలని ప్రాణుల వరకు గల పరిణామం చెందుట పరిణామం చెందకపోవడమనే లక్షణాలు కలదీ, విత్తు-మొలక లాగా ఒకదాని కారణంగా నుండి మరొకటి ఉత్పన్నమయ్యే లక్షణాలు కలదీ, వందలు వేలుగా దుఃఖాలచే పీడించబడేవి, అరటి చెట్టు యొక్క గర్భంలాగే ఎటువంటి సారమూ లేనిదీ, మాయలాగా-ఎండమావిలో నీటిలా-కలలోని గంధర్వ నగరంలా-నీటిలోని బుడగలాగా ప్రతిక్షణమూ నశించేదీ, అవిద్య-కోరికలనే దోషంతో **కర్మచితాన్** పుణ్యపాప కర్మలను నిర్వర్తించడం వల్ల కలిగినదనీ అని స్పష్టం చేసుకొని, **బ్రాహ్మణః** బ్రాహ్మణుడు లేదా సాధకుడు, సర్వాన్ని త్యజించి బ్రహ్మవిద్యను పొందేందుకు విశేషించి బ్రాహ్మణునికే అధికారమున్నదని గ్రహించాలి. (విశేషించి అన్న పదాన్ని ఉపయోగించడం ద్వారా మిగిలిన వారికి కూడా ఆ యోగ్యత లభిస్తుందనే అభిప్రాయాన్ని శంకరులు తెలియపరుస్తున్నారు). కర్మ వల్ల కలిగే లోకాలను పరీక్షించిన తర్వాత ఏమి చేయాలో చెప్తున్నారు. **నిర్వేదమ్** 'నిః' ఉపసర్గతో కూడిన 'విద్' ధాతువుకు వైరాగ్యమనే అర్థంలో వైరాగ్యాన్ని **ఆయాత్** పొందాలి. ఆ వైరాగ్యం ఏ ప్రకారంగా కలుగుతుందో చూపిస్తున్నారు. ఇక్కడ సంసారంలో **న అస్తి అకృతః** చేయబడనిది అంటూ ఏదీ లేదు. సమస్త లోకాలన్నీ కూడా **కర్మచితాః** కర్మచేయడం వల్లనే కలిగినవైనవి, అశాశ్వతాలు. శాశ్వతమైనది ఏదీ లేదని అభిప్రాయం. సమస్త లోకాలు



కూడా అశాశ్వతమైన కర్మయే సాధంగా కలవి. ఉత్పత్తిచేయడం-పొందడం-మార్పుచేయడం-శుద్ధిపరచడం వంటి నాలుగువిధాలైన కర్మ యొక్క కార్యమే ఈ సమస్త లోకాలన్నీ. ఇంతకు మించి కర్మకు సంబంధించని విషయమేదీ లేదు. నేనైతే శాశ్వతమైన-నశించని-భయంకలిగించని-స్థిరమైన-కదలని-ధ్రువమైన దాన్ని అర్థిస్తున్నానే కాని, వీటికి వ్యతిరేకమైన దాన్ని కోరడం లేదు. కాబట్టి, **కృతేన** 'అధిక ప్రయత్నంతో కూడి, దుఃఖాన్ని తెచ్చిపెట్టే సాధనాలైన కర్మలను ఎందుకు చేయాలి?' అని ఈ విధంగా (కర్మల పట్ల) విరక్తిని పొందినవాడు అభయమైన-మంగళకరమైన-కర్మచేసాధించబడని-శాశ్వతమైన స్థితి ఏది కలదో {కొందరు ఈ పాఠభాగాన్ని ఇలా వ్యాఖ్యానించారు. ఏది **అకృతః** ఉత్పన్నం చేయబడేది కానందున, **కృతేన** కర్మ ఫలంగా **న అస్తి** లేనట్టిదో, ఉత్పత్తి చేయబడలేదో అది – స్వామి గంభీరానంద} **తద్విజ్ఞానార్థం** దానిని విశదంగా తెలుసుకోవడానికై ఆ విరక్తి చెందిన **బ్రాహ్మణః** బ్రాహ్మణుడు **గురుమ్ ఏవ** శమము, దమము మొదలైన సంపదలు కలిగిన ఆచార్యుని వద్దకు మాత్రమే **అభిగచ్ఛేత్** చేరాలి లేదా సమీపించాలి. 'గురుమ్ ఏవ' అని ఎందుకు అంటున్నారంటే, (ఒకవేళ శిష్యుడు) శాస్త్రం తెలిసినవాడైనప్పటికీ, (గురువుచేత బోధింపబడకుండా) తనకై తాను బ్రహ్మజ్ఞానాన్ని అన్వేషించరాదని అభిప్రాయం. **సమిత్పాణిః** సమిధలను చేతిలో పట్టుకొని **శ్రోత్రియమ్** తను అధ్యయనం చేసిన మరియు విన్న వేదపాఠముల యొక్క అర్థాన్ని తెలిసికొన్నవాడు, **బ్రహ్మనిష్ఠమ్**

సమస్తమైన కర్మలను విడిచిపెట్టి కేవలం అద్వయ బ్రహ్మయందే ఎవనికి నిష్ఠ కలదో అతడు 'బ్రహ్మనిష్ఠ'. జపనిష్ఠుడు, తపోనిష్ఠుడు ఎలాగో ఇది కూడా అలాగే. కర్మలకు ఆత్మజ్ఞానంతో విరోధం ఉండడంచేత, కర్మలతో ముడిపడిన వానికి బ్రహ్మనిష్ఠత్వం కలగదు. అతడు అట్టి బ్రహ్మనిష్ఠుడైన గురువును సరియైన పద్ధతిలో సమీపించి, ప్రీతికలిగించినవాడై, నాశములేని యదార్థమైన పురుషుని గురించి (సర్వవ్యాపకమైన సత్యాన్ని గురించి) ప్రశ్నించాలి.

**తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ .**

**యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ .. 1.2.13 ..**

అలా సరియైన విధంగా సమీపించిన ఆతనికి, ప్రశాంతమైన హృదయం కలిగి బాహ్యేంద్రియాలు నియంత్రణలో ఉన్న ఆ విద్వాంసుడు (ఆ ఆచార్యుడు), దేని బోధవల్లనైతే అవినాశిత్వం కల యదార్థమైన పురుషుడిని గురించి



తెలియబడుతుందో, అట్టిదైన బ్రహ్మజ్ఞాన తత్త్వాన్ని తగినంతగా ఉపదేశించాలి.

## శంకరుల భాష్యం

తస్మై సః విద్వాన్ గురుర్బ్రహ్మవిత్ , ఉపసన్నాయ ఉపగతాయ . సమ్యక్ యథాశాస్త్రమిత్యేతత్ . ప్రశాంతచిత్తాయ ఉపరతదర్పాదిదోషాయ . శమాన్వితాయ బాహ్యేంద్రియోపరమేణ చ యుక్తాయ, సర్వతో విరక్తాయేత్యేతత్ . యేన విజ్ఞానేన యయా విద్యయా చ పరయా అక్షరం అద్రేశ్యాదివిశేషణం తదేవాక్షరం పురుషశబ్దవాచ్యం పూర్ణత్వాత్పురి శయనాచ్చ, సత్యం తదేవ పరమార్థస్వాభావ్యాదవ్యయం , అక్షరం చాక్షరణాదక్షతత్వాదక్షయత్వాచ్చ, వేద విజానాతి తాం బ్రహ్మవిద్యాం తత్త్వతః యథావత్ ప్రోవాచ ప్రబ్రూయాదిత్యర్థః . ఆచార్యస్యాప్యయమేవ నియమో యన్న్యాయప్రాప్తసచ్ఛిష్య నిస్తారణమవిద్యామహోదధేః ..

.. ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య
శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
ముండకోపనిషద్భాష్యే ప్రథమం ముండకం సమాప్తం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**సమ్యక్** శాస్త్రంలో చెప్పబడిన విధంగా **ఉపసన్నాయ** సమీపించిన **తస్మై** ఆతనికి **ప్రశాంతచిత్తాయ** గర్వం వంటి దోషాలు లేనటువంటి **శమాన్వితాయ** బాహ్యేంద్రియాలను అదుపులో ఉంచుకొన్నట్టి, అంటే సమస్త విషయాలపైన విరక్తి ఉన్నటువంటి **సః**

**విద్వాన్** ఆ బ్రహ్మవేత్తయైన ఆచార్యుడు ఏ విజ్ఞానం చేత అంటే ఏ పరా విద్యచేతనైతే **అక్షరమ్** అవినాశిత్వం అదృశ్యం వంటి విశేషణాలు కలదీ **పురుషమ్** పూర్తిగా పురమనే హృదయంలో వ్యాపించియున్నందున పురుషుడనే శబ్దంతో సూచించబడేదీ **సత్యమ్** అది ఏ తరుగుదలా లేని పరమార్థమే స్వభావంగా కలదీ అయిన **తామ్ బ్రహ్మవిద్యామ్** దానిని ఆ బ్రహ్మవిద్యను **తత్త్వతః** యదార్థంగా **ప్రోవాచ** ఉపదేశిస్తాడు లేదా ఉపదేశించాలి అని అభిప్రాయం. అంటే, శాస్త్రప్రకారంగా తన వద్దకు చేరిన శిష్యుడిని అజ్ఞానమనే మహాసముద్రం నుండి తరింపచేయడం అనేది ఆచార్యునికి కూడా నియమమే.

.. శ్రీమత్ పరమహంస ప్రరివ్రాజకాచార్యులైన
శ్రీగోవిందభగవత్పూజ్యపాదుల శిష్యులైన శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన ముండకోపనిషత్తు భాష్యంలోని ప్రథమ ముండకం సమాప్తం ..



# ద్వితీయ ముండకము

## ప్రథమ ఖండము

### శంకరుల ఉపోద్ఘాత భాష్యం

అపరవిద్యాయాః సర్వం కార్యముక్తం . స చ సంసారో యత్సారో యస్మాన్మూలాదక్షరాత్సంభవతి యస్మింశ్చ ప్రలీయతే, తదక్షరం పురుషాఖ్యం సత్యం . యస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి, తత్పరస్యా బ్రహ్మవిద్యాయా విషయః . స వక్తవ్య ఇత్యుత్తరో గ్రంథ ఆరభ్యతే —

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

అపర విద్య వల్ల ఉత్పన్నమయ్యే సమస్తమైన కర్మఫలాలు చెప్పబడినవి. మరియు, అట్టి సంసారానికి ఏది మూలమో, ఏ అవినాశిత్వమనే మూలంనుండి సంసారం ఏర్పడిందో, దేనియందు విలీనమౌతుందో, ఆ పురుషుడని పిలువబడే అవినాశిత్వమే యథార్థం లేదా నిజం. దేనిని తెలుసుకొంటే ఈ సమస్తమూ తెలియబడినదిగా అవుతుందో, ఆ పరమమైనదియే బ్రహ్మవిద్యకు విషయం. దానిని చెప్పడానికే తరువాతి పాఠం ప్రారంభమౌతోంది.

**తదేతత్సత్యం**

**యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులిఙ్గాః సహస్రశః ప్రభవన్తే సరూపాః .**

**తథాఽక్షరాద్వివిధాః సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి .. 2.1.1 ..**

అలాంటి ఇది సత్యం.

ఎలాగైతే బాగా మండుతున్న అగ్నినుండి వేలాదిగా అగ్నిని పోలినట్టి నిప్పుకణాలు ఉద్భవిస్తాయో అలాగే ఓ సౌమ్యుడా! అవినాశిత్వం నుండి వివిధ రకాలైన ప్రాణులు పుట్టి దానిసే తిరిగి చేరుతాయి.

## శంకరుల భాష్యం

యదపరవిద్యావిషయం కర్మఫలలక్షణం , సత్యం తదాపేక్షికం . ఇదం తు పరవిద్యావిషయం , పరమార్థసల్లక్షణత్వాత్ . తదేతత్ సత్యం యథాభూతం విద్యావిషయం ; అవిద్యావిషయత్వాచ్చ అనృతమితరత్ . అత్యంతపరోక్షత్వాత్కథం నామ ప్రత్యక్షవత్సత్యమక్షరం ప్రతిపద్యేరన్నితి దృష్టాంతమాహ — యథా సుదీప్తాత్ సుష్ఠు దీప్తాదిద్ధాత్ పావకాత్ అగ్నేః విస్ఫులింగాః అగ్న్యవయవాః సహస్రశః అనేకశః ప్రభవంతే నిర్గచ్ఛంతి సరూపాః అగ్నిసలక్షణా ఏవ, తథా ఉక్తలక్షణాత్ అక్షరాత్ వివిధాః



నానాదేహోపాధిభేదమనువిధీయమానత్వాద్వివిధాః హే సోమ్య, భావాః జీవాః ఆకాశాదివద్ఘటాదిపరిచ్ఛిన్నాః సుషిరభేదా ఘటాద్యుపాధిప్రభేదమను భవంతి ; ఏవం నానానామరూపకృతదేహోపాధిప్రభవమను ప్రజాయంతే, తత్ర చైవ తస్మిన్నేవ చాక్షరే అపియంతి దేహోపాధివిలయమను విలీయంతే ఘటాదివిలయమన్వివ సుషిరభేదాః . యథాఽఽకాశస్య సుషిరభేదోత్పత్తిప్రలయనిమిత్తత్వం ఘటాద్యుపాధికృతమేవ, తద్వదక్షరస్యాపి నామరూపకృతదేహోపాధినిమిత్తమేవ జీవోత్పత్తిప్రలయనిమిత్తత్వం ..

నామరూపబీజభూతాదవ్యాకృతాఖ్యాత్స్వవికారాపేక్షయా పరాదక్షరాత్పరం యత్సర్వోపాధి భేదవర్జితమక్షరస్యైవ స్వరూపమాకాశస్యేవ సర్వమూర్తివర్జితం నేతి నేతీత్యాదివిశేషణం వివక్షన్నాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

అపరా విద్యకు విషయమై కర్మఫలమే లక్షణంగా కలిగినట్టి (ఈ ఉపనిషత్తులోని 1.2.1 వ మంత్రంలో చెప్పబడిన) సత్యం సాపేక్షికమే (అసలు పరమ సత్యంతో పోలిస్తే తక్కువ స్థాయిదే). ఇప్పుడు చెప్పేదయితే పరా విద్యకు విషయం మరియు పరమ సత్యమనే లక్షణం కలిగింది కాబట్టి, **తదేతత్ సత్యమ్** జ్ఞానానికి విషయమైన యదార్థమైన సత్యం. మిగిలినవన్నీ అజ్ఞానానికి విషయాలైనందున అసత్యాలే. ఆ పరమ సత్యం మరియు అవినాశిత్వం అనేది అత్యంత పరోక్షమైనదైనందున ప్రత్యక్షప్రమాణంతో ఎలా ప్రతిపాదించాలో ఆలోచించి దృష్టాంతాన్ని చెప్తున్నారు. **యథా** ఎలాగైతే **సుదీప్తాత్** బాగా వెలిగించబడిన **పావకాత్** అగ్నినుండి **సరూపాః**

అగ్నివంటి లక్షణాలు కలిగిన **విస్ఫులింగాః** నిప్పుకణాలు **సహస్రశః** అనేకములు **ప్రభవంతే** నిర్గమిస్తున్నాయో **తథా** అదే విధంగా, ముందే చెప్పబడిన **అక్షరాత్** అవినాశిత్వం నుండి ఓ సౌమ్యా! **వివిధాః** అనేక దేహములనే పరిమితాలైన ఉపాధిభేదాలతో కూడినవైనట్టి వివిధ రకాలైన **భావాః** జీవులు లేదా ప్రాణులు. కుండ మొదలైనవాటిచే ఆవరించబడినట్టి ఆకాశం ఆయా పరిమితులకులోనై వివిధ రూపభేదాలను పొందుతుంది. అదేవిధంగా నామ రూపములనే అనేకమైన తేడాలతోకూడిన దేహములనే ఉపాధులు కలిగిన జీవులు (ఆ అవినాశిత్వం నుండి) **ప్రజాయంతే** పుట్టుకొస్తారు. **తత్ర చైవ** దానియందే ఆ అవినాశిత్వమందే **అపియంతి** దేహమనే ఉపాధుల వినాశానికి అనుగుణంగా లయాన్ని పొందుతారు. కుండ వంటివి నశించగా ఘటాకాశం నశించినట్లుగా. ఎలాగైతే ఆకాశంలో వేర్వేరు ఆకాశాలు ఉత్పన్నం కావడానికి నశించడానికి ఘటాదులు కారణమౌతున్నాయో, అదేవిధంగా అవినాశిత్వం యొక్క నామరూపాలతో నిండిన దేహ ఉపాధులే జీవులు పుట్టడానికి నశించడానికి కారణాలు.

నామరూపాలకు బీజం వంటి అవ్యాకృతమనబడేది (మాయ అనబడేది) తన (కార్యాలకన్నా) పరిణామాలకన్నా ఉన్నతమైనది. అటువంటి (తక్కువస్థాయి) అవినాశిత్వాని కన్నా కూడా (మాయకన్నా) ఉన్నతమైన, సమస్త ఉపాధి భేదాలు లేని, ఆకాశం లాగా ఎటువంటి వ్యక్తమైన స్వరూపమే లేని, ఇదికాదు



ఇదికాదు అనే విశ్లేషణతో వివరింపబడే పరమమైన అవినాశిత్వాన్ని (అక్షర బ్రహ్మాన్ని) గురించి (తర్వాతి మంత్రంలో) చెప్తున్నారు. (కనబడే ఈ నామ రూపాలకు మూలమైనట్టిది అవ్యాకృతం. ఆ అవ్యాకృతం అనబడే అవినాశిత్వం లేదా అక్షరం దానియొక్క పరిణామాలైన నామ-రూపాదులకన్నా ఉన్నతమైనది. అటువంటి ఆ అక్షరానికన్నా మించిన ఉన్నతోన్నతమైనది అక్షర బ్రహ్మం. ఆ పరమమైన అక్షరబ్రహ్మంలో ఎటువంటి పరిమితులు కాని ఉపాధి బేధాలు కాని ఉండవు. దానికి ఆకాశం లాగా వ్యక్తం కాబడే ఒక స్వరూపమంటూ ఏదీ లేదు. ఇది కాదు, ఇది కాదు అని అంటూ సమస్తమైన భిన్నత్వాలన్నింటినీ త్రోసిపుచ్చగా, ఇక త్రోసిపుచ్చేందుకు ఏదీ లేకుండా మిగిలినదే ఆ అక్షర బ్రహ్మం. ఆ అక్షర బ్రహ్మం గురించే తర్వాతి మంత్రంలో ప్రస్తావిస్తున్నారు.)

**దివ్యో హ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యన్తరో హ్యజః .**
**అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః**
**.. 2.1.2 ..**

ఆ పురుషుడు నిశ్చయంగా స్వయంప్రకాశకుడు. ఎటువంటి రూపము లేని వాడు, తన లోపల-బయట కూడా తానై ఉన్నవాడు, పుట్టుకలేని వాడు.

క్రియాశీల-జ్ఞానశీల రహితుడు. శుద్ధమైనవాడు. అక్షరానికన్నా (అవినాశిత్వానికన్నా) భిన్నమైనట్టి ఉన్నతుడు.

## శంకరుల భాష్యం

దివ్యః ద్యోతనవాన్ , స్వయంజ్యోతిష్ట్వాత్ . దివి వా స్వాత్మని భవః అలౌకికో వా . హి యస్మాత్ అమూర్తః సర్వమూర్తివర్జితః, పురుషః పూర్ణః పురిశయో వా, సబాహ్యాభ్యంతరః సహ బాహ్యాభ్యంతరేణ వర్తత ఇతి . అజః న జాయతే కుతశ్చిత్ , స్వతోఽజస్య జన్మనిమిత్తస్య చాభావాత్ ; యథా జలబుద్బుదాదేర్వాయ్వాదిః, యథా నభఃసుషిరభేదానాం ఘటాదిః . సర్వభావవికారాణాం జనిమూలత్వాత్ తత్ప్రతిషేధేన సర్వే ప్రతిషిద్ధా భవంతి . సబాహ్యాభ్యంతరో హ్యజః అతోఽజరోఽమృతోఽక్షరో ధ్రువోఽభయ ఇత్యర్థః . యద్యపి దేహాద్యుపాధిభేదదృష్టిభేదేషు సప్రాణః సమనాః సేంద్రియః సవిషయ ఇవ ప్రత్యవభాసతే తలమలాదిమదివాకాశం , తథాపి తు స్వతః పరమార్థస్వరూపదృష్టీనాం అప్రాణః అవిద్యమానః క్రియాశక్తిభేదవాన్ చలనాత్మకో వాయుర్యస్మిన్నసౌ అప్రాణః . తథా అమనాః అనేకజ్ఞానశక్తిభేదవత్సంకల్పాద్యాత్మకం మనోఽప్యవిద్యమానం యస్మిన్సోఽయమమనాః . అప్రాణో హ్యమనాశ్చేతి ప్రాణాదివాయుభేదాః కర్మేంద్రియాణి తద్విషయాశ్చ తథా బుద్ధిమనసీ బుద్ధీంద్రియాణి తద్విషయాశ్చ ప్రతిషిద్ధా వేదితవ్యాః ; యథా శ్రుత్యంతరే — ధ్యాయతీవ లేలాయతీవేతి . యస్మాచ్చైవం ప్రతిషిద్ధోపాధిద్వయస్తస్మాత్ శుభ్రః శుద్ధః . అతోఽక్షరాన్నామరూపబీజోపాధిలక్షితస్వరూపాత్ , సర్వకార్యకరణ



బీజత్వేనోపలక్ష్యమాణత్వాత్పరం తత్త్వం తదుపాధిలక్షణమవ్యాకృతాఖ్యమక్షరం సర్వవికారేభ్యతస్మాత్పరతోఽక్షరాత్పరః నిరుపాధికః పురుష ఇత్యర్థః . యస్మింస్తదాకాశాఖ్యమక్షరం సంవ్యవహారవిషయమోతం చ ప్రోతం చ . కథం పునరప్రాణాదిమత్త్వం తస్యేత్యుచ్యతే . యది హి ప్రాణాదయః ప్రాగుత్పత్తేః పురుష ఇవ స్వేనాత్మనా సంతి, తదా పురుషస్య ప్రాణదినా విద్యమానేన ప్రాణాదిమత్త్వం స్యాత్ ; న తు తే ప్రాణాదయః ప్రాగుత్పత్తేః సంతి . అతః ప్రాణాదిమాన్పరః పురుషః, యథాఽనుత్పన్నే పుత్రే అపుత్రో దేవదత్తః ..

కథం తే న సంతి ప్రాణాదయ ఇతి, ఉచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**పురుషః** ఆ పురుషుడు అంటే సర్వత్రా వ్యాపించినవాడు లేదా హృదయంలో నివసించిన వాడు, **దివ్యః** స్వయం ప్రకాశకత్వం అనే ధర్మంచేత ప్రకాశంకలిగినవాడు లేదా తన ఆత్మయందే అలౌకికంగా ఉండేవాడు. **హి** ఎందువల్లనంటే **అమూర్తః** రూపమన్నది లేనివాడు **సబాహ్యాభ్యంతరః** తనకు లోపల మరియు బయటకూడా తానే ఉండేవాడు కనుక అని అర్థం. **అజః** దేనినుండీ దేనివల్లనూ పుట్టనివాడు. ఎలాగంటే, నీటిలో బుడగలు పుట్టడానికి వాయువు కారణమైనట్లుగా, ఆకాశంలో వివిధ ఆకాశాలు ఉత్పన్నం కావడానికి కుండ మొదలైనవి కారణాలైనట్లుగా, తను తప్ప తన పుట్టుకకు కారణమైన ఇతరం అనేదేదీ లేనందువల్ల. సమస్తమైన పరిణామభేదాలకు మూలం పుట్టుక కాబట్టి, అదే (ఆ పుట్టుకనేదే)

లేకపోతే సమస్తమైన పరిణామాలనేవి ఉత్పన్నం కావు. లోపలా బయటా కూడా తానే ఉన్నవాడు, పుట్టుట అనే పరిణామం లేనివాడు కాబట్టే, జరామరణవినాశ రహితమైన స్థిరమైన భయరహితమైన స్థితి కలిగినవాడని అభిప్రాయం. అయితే, ఆకాశంలో అంచు, మలినాలనే తేడాలున్నట్లుగా, దేహం మొదలైన ఉపాధులలోని తేడా వల్ల ప్రాణము-మనసు-ఇంద్రియాలు-విషయాలు కలిగినవాడుగా ప్రకటన మౌతున్నాడు. అలా అయినా కూడా, స్వయంగా పరమార్థ స్వరూపం దృష్టితో చూస్తే, **అప్రాణః** క్రియాశక్తి భేదాలున్నట్టి వానిగా తెలియడం లేదు. వానియందు చలన స్వభావం కలిగిన వాయువున్నట్లుగా తెలియడం లేదు. అదేవిధంగా **అమనాః** అనేకమైన జ్ఞానశక్తి బేధాలతో కూడిన సంకల్పాదుల మయమైన మనసు కూడా దేనియందు తెలియబడటం లేదో అది అమనాః. 'అప్రాణః' అని అన్నప్పుడు ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అనే వాయువులనూ మరియు కర్మేంద్రియాలు, వాటి యొక్క విషయాలనూ, మరియు 'అమనాః' అన్నప్పుడు బుద్ధి-మనసు మరియు జ్ఞానేంద్రియాలు, వాటి విషయాలనూ నిషేధించినట్లుగా అర్థం చేసుకోవాలి. ఈ స్థితినే వేరొక శ్రుతిలో 'ధ్యానించే దానివలె, కదిలేదాని వలె' [ధ్యాయతీవ లేలాయతీవ (బృ.ఉ. 4-3-7)] అని చెప్పారు. ఈ విధంగా ఈ రెండు పరిమిత ఉపాధులను నిషేధించడం వల్ల, **శుభ్రః** శుద్ధమైనది. అటువంటి నామ-రూప-బీజ-ఉపాధి లక్షణ స్వరూపమైన అక్షరం కన్నా లేదా మాయకన్నా అంటే సమస్త కార్యాలు-సాధనాలకు మూలమనే లక్షణాని



కన్నా పరమమైన లేదా ఉన్నతమైన తత్త్వం. అది అన్ని పరిణామాలతో కూడిన అవ్యాకృతమనబడే ఉపాధిలక్షణం కల అక్షరం కన్నా పరం కాబట్టి **అక్షరాత్ పరతః** అంటే ఉపాధిరహితమైన పురుషుడని అభిప్రాయం. ఆ ఆకాశమనబడే అక్షరంలోనే సమస్త వ్యవహారాలు విషయాలు పడుగు-పేక వలె ఉంటాయి కదా! మరి అలాంటప్పుడు, అప్రాణాదిత్వాన్ని ఎందుకు ప్రస్తావించారో చెప్తున్నారు. పురుషుని లాగానే ప్రాణాదులకు కూడా ముందే ఉనికి ఉన్నట్లైతే, పురుషుడిని ప్రాణాదులు ఉన్నవానిగా తెలుసుకోవడం కుదురుతుంది. కాని, ఆ ప్రాణాదులకు పురుషునికన్నా పూర్వం ఉనికియే లేదు. కొడుకు పుట్టక పూర్వం దేవదత్తుడు అపుత్రుడయిన విధంగా, ప్రాణాదులున్నవాటికన్నా పరమమైన లేదా ఉన్నతమైన వాడు పురుషుడని గ్రహించాలి.

ఆ ప్రాణాదులు (పురుషుని కన్నా పూర్వం) ఎందుకు ఉండవో చెప్తున్నారు.

**ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ .**

**ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ**

**.. 2.1.3 ..**

దీనినుండియే ప్రాణం, మనసు, సమస్త ఇంద్రియాలు, ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, జగత్తును ధరించే పృథివి జనిస్తున్నాయి.

## శంకరుల భాష్యం

యస్మాత్ ఏతస్మాదేవ పురుషాన్నామరూపబీజోపాధిలక్షితాత్ జాయతే ఉత్పద్యతేఽవిద్యావిషయో వికారభూతో నామధేయోఽనృతాత్మకః ప్రాణః, 'వాచారంభణం వికారో నామధేయం' (ఛా. ఉ. 6 . 1 . 4) 'అనృతం' ఇతి శ్రుత్యంతరాత్ . న హి తేనావిద్యావిషయేణానృతేన ప్రాణేన సప్రాణత్వం పరస్య స్యాదపుత్రస్య స్వప్నదృష్టేనేవ పుత్రేణ సపుత్రత్వం . ఏవం మనః సర్వాణి చేంద్రియాణి విషయాశ్చైతస్మాదేవ జాయంతే . తస్మాత్సిద్ధమస్య నిరుపచరితమప్రాణాదిమత్త్వమిత్యర్థః . యథా చ ప్రాగుత్పత్తేః పరమార్థతోఽసంతస్తథా ప్రలీనాశ్చేతి ద్రష్టవ్యాః . యథా కరణాని మనశ్చేంద్రియాణి చ, తథా శరీరవిషయకారణాని భూతాని ఖం ఆకాశం, వాయుః బాహ్య ఆవహాదిభేదః, జ్యోతిః అగ్నిః, ఆపః ఉదకం, పృథివీ ధరిత్రీ విశ్వస్య సర్వస్య ధారిణీ ; ఏతాని చ శబ్దస్పర్శరూపరసగంధోత్తరోత్తరగుణాని పూర్వపూర్వగుణసహితాన్యేతస్మాదేవ జాయంతే ..

సంక్షేపతః పరవిద్యావిషయమక్షరం నిర్విశేషం పురుషం సత్యం 'దివ్యో హ్యమూర్తః' (ము. ఉ. 2 . 1 . 2) ఇత్యాదినా మంత్రేణోక్త్వా, పునస్తదేవ సవిశేషం విస్తరేణ వక్తవ్యమితి ప్రవవృతే ; సంక్షేపవిస్తరోక్తో హి పదార్థః సుఖాధిగమ్యో భవతి సూత్రభాష్యోక్తివదితి . యో హి ప్రథమజాత్ప్రాణాద్ధిరణ్యగర్భాజ్జాయతేఽణ్డస్యాంతర్విరాట్ , స తత్త్వాంతరితత్త్వేన



లక్ష్యమాణోఽప్యేతస్మాదేవ పురుషాజ్జాయత ఏతన్మయశ్చేత్యేతదర్థమాహ, తం చ విశినష్టి —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఏతస్మాత్** దీనినుండియే అంటే ఈ పురుషునినుండియే నామ-రూప-బీజ-ఉపాధి లక్షణాలున్న జగత్తు **జాయతే** ఉత్పన్నమౌతుంది. **ప్రాణః** అజ్ఞానమే విషయంగా కలదీ, పరిణామశీలమైనది, నామధేయమనే అసత్యంతో కూడినట్టి ప్రాణం (ఈ పురుషుని నుండియే పుడుతుంది). ఎందుకంటే, 'వాచారంభణం వికారో నామధేయం' (ఛా.ఉ. 6-1-4) అది 'అనృతమ్' అని మరొక శ్రుతి చెప్పింది కాబట్టి. ఎలాగైతే పుత్రుడున్నట్లుగా కలగనినంత మాత్రాన పుత్రుడున్నవాడయిపోడో, అలాగే సత్యం కానటువంటి అజ్ఞానవిషయమైన ప్రాణం వలన (ఈ పురుషుడు) ప్రాణత్వం ఉన్నవాడు కాదు. అదేవిధంగా, **మనః** సమస్తమైన ఇంద్రియాలు వాటి విషయాలతో సహా దీనినుండియే (ఈ పురుషుని నుండియే) పుడుతున్నాయి. అందుచే ఈ పురుషుడు ప్రాణము, మనసు మొదలైనవేవీ కలవాడు కాదని నిరూపితమైంది. (అంటే ప్రాణం, మనసు వంటి వికారాలు ఈ పురుషుని కారణంగా ఉత్పన్నమౌతున్నాయే కాని, వాటిని ఈ పురుషుడు కలిగి లేడని అభిప్రాయం). ఏవిధంగానైతే వీటి (ఈ ప్రాణం, మనసు వంటివాటి పుట్టుక) యదార్థంగా (పురుషునికి) పూర్వం ఉత్పన్నంకాలేదో,

అదేవిధంగా వీటి లయం కూడా ఉత్పన్నం కాబోదు. కర్మేంద్రియాలు, మనసు మరియు జ్ఞానేంద్రియాలలాగానే, దేహాదులకు కారణాలైన పంచభూతాలైన, **ఖం** ఆకాశం, **వాయుః** లోపల బయట తిరుగాడే గాలి, **జ్యోతిః** అగ్ని, **ఆపః** జలం, **విశ్వస్య ధారిణీ పృథివీ** జగత్తంతటినీ ధరించే భూమి, ఇవన్నీ కూడా - అంటే శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలనే గుణాలను, ముందు ముందు గుణాలు తర్వాతి గుణాలతో కలవడం ద్వారా ఏర్పడిన గుణాల సమ్మిళితమైన పంచభూతాలు కూడా – దానినుండియే (ఆ పురుషుని నుండియే) పుడుతున్నాయి.

'దివ్యో హ్యమూర్తః' (ము.ఉ. 2-1-2) మొదలుగాగల మంత్రాలలో పరావిద్యకు విషయమైన అక్షరాన్ని విశేషణాలేవీ లేని పురుషునిగా సత్యమని సంక్షిప్తంగా చెప్పి, తిరిగి దానినే విశేషణాలతో విస్తృతంగా చెప్పాలని అనుకొంటున్నారు. సూత్రం-భాష్యం అన్నపద్ధతితో సంక్షిప్తంగానూ మరియు వివరంగానూ చెప్పినట్లైతే విషయం సులభంగా అవగాహనకు వస్తుంది. బ్రహ్మాండానికి లోపలనున్నట్టి ఏ విరాట్ అయితే ముందుగా పుట్టిన ప్రాణం అనగా హిరణ్యగర్భునినుండి ఉద్భవించాడో, అతడు (ఆ విరాట్) ఒక తత్త్వం లోపలి తత్త్వం లాగా వేరొక లక్షణం కలవాడైనప్పటికీ, ఆ పురుషుని నుండియే (అక్షరబ్రహ్మ రూపమైన ఆ హిరణ్యగర్భుని నుండియే) జనించాడు. అంటే, దీనితోనే (విరాట్ అనబడే తత్త్వం హిరణ్యగర్భుడనబడే తత్త్వంతోనే) నిండియున్నాడనే అభిప్రాయాన్ని చెప్పడానికి, దానిని (ఆ విరాట్ ను గురించి) విశదీకరిస్తున్నారు.



**అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః .**

**వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా .. 2.1.4 ..**

స్వర్గలోకమే శిరస్సుగా కలదీ, సూర్యచంద్రులే కన్నులుగా కలదీ, దిక్కులే శ్రోత్రములుగా కలదీ, విస్తారమైన వేదములే వాక్కుగా కలదీ, వాయువే ప్రాణంగా కలదీ, విశ్వమే హృదయంగా కలదీ, పృథివియే దాని పాదాలుగా కలదీ, ఇదియే సమస్త ప్రాణులలో ఆత్మరూపంలో ఉన్నది.

## శంకరుల భాష్యం

అగ్నిః ద్యులోకః, 'అసౌ వావ లోకో గౌతమాగ్నిః' (ఛా. ఉ. 5 . 4 . 1) ఇతి శ్రుతేః . మూర్ధా యస్యోత్తమాంగం శిరః, చక్షుషీ చంద్రశ్చ సూర్యశ్చేతి చంద్రసూర్యౌ ; యస్యేతి సర్వత్రానుషంగః కర్తవ్యః అస్యేత్యస్య పదస్య వక్ష్యమాణస్య యస్యేతి విపరిణామం కృత్వా . దిశః శ్రోత్రే యస్య . వాక్ వివృతాశ్చ ఉద్ఘాటితాః ప్రసిద్ధా వేదాః యస్య . వాయుః ప్రాణో యస్య . హృదయం అంతఃకరణం విశ్వం సమస్తం జగత్ అస్య యస్యేత్యేతత్ . సర్వం హ్యంతఃకరణవికారమేవ జగత్ , మనస్యేవ సుషుప్తే ప్రలయదర్శనాత్ ; జాగరితేఽపి తత

ఏవాగ్నివిస్ఫులింగవద్విప్రతిష్ఠానాత్ . యస్య చ పద్భ్యాం జాతా పృథివీ, ఏష దేవో విష్ణురనంతః ప్రథమశరీరీ త్రైలోక్యదేహోపాధిః సర్వేషాం భూతానామంతరాత్మా . స హి సర్వభూతేషు ద్రష్టా శ్రోతా మంతా విజ్ఞాతా సర్వకరణాత్మా ..

పంచాగ్నిద్వారేణ చ యాః సంసరంతి ప్రజాః, తా అపి తస్మాదేవ పురుషాత్ప్రజాయంత ఇత్యుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

'ఓ గౌతమా ఆ లోకమే అగ్ని' ['అసౌ వావ లోకో గౌతమాగ్నిః' (ఛా.ఉ. 5-4-1)] అన్న శ్రుతి వాక్యానుసారం **అగ్నిః** ద్యులోకం అనగా స్వర్గం, **మూర్ధా** ఎవనికి ఉత్తమాంగమైన శిరస్సో, **చక్షుషీ** కన్నులు రెండూ **చంద్రసూర్యౌ** చంద్రుడు మరియు సూర్యుడు. 'దానికి' అనే అర్థం కల 'అస్య' అని తరువాత చెప్పబడబోయే పదాన్ని అనుసరిస్తూ 'ఎవనికి' అన్న అర్థాన్నిచ్చే 'యస్య' అన్న పదాన్ని ప్రతి అంశానికి జోడించుకొని, ఎవనికి **దిశః శ్రోత్రే** దిక్కులు శ్రోత్రములో, ఎవనికి **వేదాః** ప్రసిద్ధములైన వేదములు **వాక్ వివృతాశ్చ** ఉద్ఘాటించబడిన వాక్కో, ఎవనికి **వాయుః ప్రాణో** ప్రాణము వాయువో, **విశ్వమ్** ఈ సకల జగత్తు అంతయూ **హృదయమ్** ఎవనికి అంతఃకరణమో. సుషుప్తిలో సకలమూ మనసునందే లయం కావడం చూస్తున్నాం, జాగ్రదావస్థలో కూడా అగ్నికణాలలాగా ఈ సకల జగత్తూ ఏర్పడుతోంది కాబట్టి ఈ సమస్తమైన జగత్తంతా అంతఃకరణం యొక్క పరిణామమే. మరియు



ఎవని **పద్భ్యామ్** పాదముల నుండి **పృథివీ** భూమి ఉద్భవిస్తోందో, **ఏష** అటువంటి విష్ణువు లేదా అనంతుడు అనబడే త్రిలోకములే దేహంగా కలిగిన మొదటి శరీరాన్ని మొదటగా ధరించిన దైవమే, **సర్వభూతాంతరాత్మా** ('సర్వకారణాత్మా' అని పాఠాంతరం కలదు) సమస్త ప్రాణులలో అంతరంగా ఉన్న ఆత్మ. అతడే నిశ్చయంగా సకలప్రాణులలోనుండి, చూచేవాడు, వినేవాడు, ఆలోచించే వాడు, తెలుసుకొనేవాడు, అన్ని ఇంద్రియాలకు మూలమైనవాడు.

పంచాగ్నుల (స్వర్గం, మేఘం, ఆకాశం, తండ్రి మరియు తల్లి అన్నవి పంచాగ్నులు) ద్వారా సంసారాన్ని గడిపే జనులు ఎవరైతే ఉన్నారో, వారు కూడా ఆవిధంగానే పురుషుని నుండియే ఉత్పన్నమౌతున్నారని (తర్వాతి మంత్రంలో) ఇలా చెప్తున్నారు.

**తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యామ్ .**
**పుమాన్రేతః సిఞ్చతి యోషితాయాం బహ్వీః ప్రజాః పురుషాత్సంప్రసూతాః .. 2.1.5 ..**

దానినుండి, దేనికి సూర్యుడు సమిధయో ఆ అగ్ని (స్వర్గలోకం), (ఆ స్వర్గలోకం నుండి పుట్టిన) చంద్రుని నుండి పర్జన్యుడు (మేఘం), (ఆ మేఘం

నుండి పుట్టిన) భూమియందలి ఓషధులు, స్త్రీలయందుంచబడిన పురుషుని రేతస్సు. (ఇలా) అనేకంగా జనులు పురుషుని నుండి ఉద్భవిస్తున్నారు.

## శంకరుల భాష్యం

తస్మాత్ పరస్మాత్పురుషాత్ ప్రజావస్థానవిశేషరూపః అగ్నిః . స విశేష్యతే — సమిధో యస్య సూర్యః, సమిధ ఇవ సమిధః ; సూర్యేణ హి ద్యులోకః సమిధ్యతే . తతో హి ద్యులోకాగ్నేర్నిష్పన్నాత్ సోమాత్ పర్జన్యః ద్వితీయోఽగ్నిః సంభవతి . తస్మాచ్చ పర్జన్యాత్ ఓషధయః పృథివ్యాం సంభవంతి . ఓషధిభ్యః పురుషాగ్నౌ హుతాభ్య ఉపాదానభూతాభ్యః పుమానగ్నిః రేతః సించతి యోషితాయాం యోషితి యోషాగ్నౌ స్త్రియామితి . ఏవం క్రమేణ బహ్వీః బహ్వ్యః ప్రజాః బ్రాహ్మణాద్యాః పురుషాత్ పరస్మాత్ సంప్రసూతాః సముత్పన్నాః ..

కించ, కర్మసాధనాని ఫలాని చ తస్మాదేవేత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తస్మాత్** ఆ పరమ పురుషుని నుండి ప్రాణులకు ప్రత్యేకమైన స్థావరం రూపమైన **అగ్నిః** అనగా స్వర్గలోకం అని ప్రత్యేకిస్తున్నారు. **సమిధో యస్య సూర్యః** దేనికి సూర్యుడు సమిధయో. సమిధ వంటి సమిధ. సూర్యునిచే స్వర్గలోకం వెలుగొందుతుందని అర్థం. తర్వాత, ఆ ద్యులోకాన్ని నుండి ఏర్పడిన **సోమాత్** చంద్రుని



నుండి **పర్జన్యః** మేఘం అనే రెండవ అగ్ని సంభవిస్తుంది. మరి దాని నుండి, ఆ పర్జన్యుని నుండి **ఓషధయః పృథివ్యామ్** భూమియందు ఓషధులు (మూడవ అగ్ని ) సంభవిస్తాయి. **పుమాన్రేతస్** ఆ పురుషాగ్ని అనబడే (నాల్గవ అగ్నిలో) దానిలో ఓషధులు ఆహుతి చేయబడటం ద్వారా వీర్యం ఉత్పన్నమౌతుందో అది **యోషితాయామ్** స్త్రీ అనబడే అగ్నియందు (అయిదవ అగ్ని యందు) **సించతి** ఉంచబడుతుంది. ఈ విధంగా ఒక క్రమంగా **బహ్వీః** అనేకంగా ప్రజలు అంటే బ్రాహ్మణులు మొదలైన వారు **పురుషాత్** ఆ పరమపురుషుని నుండి **సంప్రసూతాః** ఉత్పన్నమౌతున్నారు.

మరింకా, కర్మసాధనాలు మరియు వాటి ఫలాలు కూడా అదేవిధంగా (దాని నుండే సంభవిస్తున్నాయన్నది) చెప్తున్నారు.

**తస్మాదృచః సామ యజూంషి దీక్షా యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ .**
**సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమో యత్ర పవతే యత్ర సూర్యః .. 2.1.6 ..**

ఋక్, సామ, యజుస్సులు, యజ్ఞదీక్షలు, సకల యజ్ఞాలు, క్రతువులు, దానములు, సంవత్సరములు, యజమానులు, ఏయే లోకాలను చంద్రుడు పవిత్రం

చేస్తున్నాడో, సూర్యుడు (తపింపచేస్తున్నాడో) అవన్నీ దానినుండే (ఆ పరమ పురుషునినుండే ఉద్భవిస్తున్నాయి).

## శంకరుల భాష్యం

కథం ? తస్మాత్ పురుషాత్ ఋచః నియతాక్షరపాదావసానాః గాయత్ర్యాదిచ్ఛందోవిశిష్టా మంత్రాః ; సామ పాంచభక్తికం సాప్తభక్తికం చ స్తోభాదిగీతివిశిష్టం ; యజూంషి అనియతాక్షరపాదావసానాని వాక్యరూపాణి ; ఏవం త్రివిధా మంత్రాః . దీక్షాః మౌంజ్యాదిలక్షణాః కర్తృనియమవిశేషాః . యజ్ఞాశ్చ సర్వే అగ్నిహోత్రాదయః . క్రతవః సయూపాః . దక్షిణాశ్చ ఏకగవాద్యా అపరిమితసర్వస్వాంతాః . సంవత్సరశ్చ కాలః కర్మాంగభూతః . యజమానశ్చ కర్తా . లోకాః తస్య కర్మఫలభూతాః ; తే విశేష్యంతే — సోమః యత్ర యేషు లోకేషు పవతే పునాతి లోకాన్ యత్ర చ యేషు సూర్యస్తపతి . తే చ దక్షిణాయనోత్తరాయణమార్గద్వయగమ్యా విద్వదవిద్వత్కర్తృఫలభూతాః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఎలాగంటే, అటువంటి పరమపురుషుని నుండి, **ఋచః** అక్షర-పాద నియమాలు గల గాయత్రి మొదలైన ఛన్దస్సు విశిష్టతలు కల మంత్రాలు, **సామ** (హింకార, ప్రస్తావ, ఉద్గీథ, ప్రతిహార మరియు నిధన అనబడే) ఐదు భాగాలున్నది, (ముందు చెప్పిన ఐదు భాగాలకు అదనంగా ఉపద్రవ మరియు ఆది అనే వాటితో కలిపి) ఏడు



భాగాలున్నది, స్తోభ (హ, ఉ వంటి అక్షరములతో కూడినట్టిది) మొదలైన గాన విశిష్టతలు కలిగిన మంత్రాలు, **యజూంషి** అక్షర-పాద నియమాలు లేని వాక్యరూపాలు కలిగిన మంత్రాలు. ఈ విధంగా మూడు రకాలైన మంత్రాలు. **దీక్షాః** యాగాది నిర్వహణల ప్రారంభంగా ముంజ గడ్డితో పేనబడిన త్రాడును నడుముకు చుట్టడం వంటి యజమాని పాటించే నియమ విశేషాలు, **యజ్ఞాశ్చ సర్వే** మరియు అగ్నిహోత్రం మొదలైన సకల యజ్ఞాలు, **క్రతవః** యూపస్తంభంతో కూడిన యాగములు, **దక్షిణాశ్చ** మరియు ఒక గోవు మొదలు అపరిమితంగా సమస్తమైన వాటిని బ్రాహ్మణులకు దానం చేయుట అనే కర్మలు, **సంవత్సరశ్చ** మరియు కర్మలలో భాగమైన కాలం, **యజమానశ్చ** మరియు కర్త లేదా కర్మను నిర్వర్తించే యజమాని, **లోకాః** ఆయా కర్మల ఫలితంగా కలిగే లోకాలు. **సోమః యత్ర** ఏ లోకాలను చంద్రుడు **పవతే** పవిత్రం చేస్తున్నాడో, **యత్ర సూర్యః** ఏ లోకాలను సూర్యుడు తపింపచేస్తున్నాడో అటువంటి విశిష్టతలు కల లోకాలు, అంటే విద్వాంసులు-అవిద్వాంసులు (వైదిక కర్మలను ఉపాసనలతో సహా అనుష్టించినవారు విద్వాంసులు, కేవలం వైదిక కర్మలను మాత్రమే అనుష్టించినవారు అవిద్వాంసులు) వారివారి కర్మల ఫలంగా దక్షిణాయన-ఉత్తరాయణమనే రెండు మార్గాల ద్వారా చేరే లోకాలు. (ఇవన్నీ కూడా, ఆ పరమపురుషుని నుండే ఉద్భవిస్తున్నాయని అభిప్రాయం).

**తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః సాధ్యా మనుష్యాః పశవో వయాంసి .**
**ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ .. 2.1.7 ..**

మరియు దానినుండి అనేక దేవతలు ఉద్భవించారు, సాధ్యులు, మానవులు, పశువులు, పక్షులు, ప్రాణ-అపానాదులు, వరి-బార్లీ వంటి ధాన్యవిశేషాలు, మరియు తపస్సు-శ్రద్ధ-సత్యం-బ్రహ్మచర్యం-విధులు కూడా (దాని నుండియే ఉద్భవించాయి).

## శంకరుల భాష్యం

తస్మాచ్చ పురుషాత్కర్మాంగభూతా దేవాః బహుధా వస్వాదిగణభేదేన సంప్రసూతాః సమ్యక్ ప్రసూతాః — సాధ్యాః దేవవిశేషాః, మనుష్యాః కర్మాధికృతాః, పశవః గ్రామ్యారణ్యాః, వయాంసి పక్షిణః ; జీవనం చ మనుష్యాదీనాం ప్రాణాపానౌ, వ్రీహియవౌ హవిరర్థౌ ; తపశ్చ కర్మాంగం పురుషసంస్కారలక్షణం స్వతంత్రం చ ఫలసాధనం ; శ్రద్ధా యత్పూర్వకః సర్వపురుషార్థసాధనప్రయోగశ్చిత్తప్రసాద ఆస్తిక్యబుద్ధిః ; తథా సత్యం అనృతవర్జనం యథాభూతార్థవచనం చాపీడాకరం ; బ్రహ్మచర్యం మైథునాసమాచారః ; విధిశ్చ ఇతికర్తవ్యతా ..



## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తస్మాత్ చ** మరియు ఆ పరమ పురుషుని నుండియే, కర్మలలో భాగమైన **దేవాః బహుధా** వసువు మొదలైన వివిధ దేవగణాలు (అష్ట వసువులు, ద్వాదశ ఆదిత్యులు, ఏకాదశ రుద్రులు మొదలైన దేవగణాలు) **సంప్రసూతాః** తగినట్లుగా ఉద్భవించాయి. **సాధ్యాః** సాధ్యులనబడే దేవజాతులు, **మనుష్యాః** కర్మలను నిర్వర్తించే అధికారం కల మానవులు, **పశవః** గ్రామాలు, అరణ్యాలలో సంచరించే జంతువులు, **వయాంసి** పక్షులు, **ప్రాణాపానౌ** మనుష్యాదులలో జీవత్వానికి సంబంధించిన ఉచ్ఛ్వాస-నిశ్వాసలు, **వ్రీహియవౌ** హవిస్సుగా ఇవ్వదగిన వరి-బార్లీ వంటి ధాన్యవిశేషాలు, **తపశ్చ** మానవుని సంస్కారాన్ని ఉద్దేశించి కర్మలో భాగంగా ఉన్నట్టిది, ఇతరమైన దానిపై ఆధారపడకుండా ఫలితాన్ని సాధించి పెట్టేది అయిన తపస్సు, **శ్రద్ధా** అన్ని పురుషార్థ సాధనాలను అనుష్టించే ముందు ఆ సాధనల పట్ల కావలసియున్న నమ్మిక లేదా విశ్వాసం మరియు మానసిక ప్రశాంతత, అదేవిధంగా **సత్యమ్** అసత్యాన్ని పలకకపోవడం, ఇతరులకు బాధ కలిగించకుండా ఉన్నదాన్ని ఉన్నట్లుగా మాట్లాడడం, **బ్రహ్మచర్యమ్** మైథునత్వాన్ని నిర్జించడం, **విధిశ్చ** నియమానుసారంగా కర్తవ్యాన్ని నిర్వర్తించడం. (ఇవన్నీ కూడా, ఆ పరమపురుషుని నుండే ఉద్భవిస్తున్నాయని అభిప్రాయం).

**సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్సప్తార్చిషః సమిధః సప్త హోమాః . సప్తేమే లోకా యేషు చరన్తి ప్రాణా గుహాశయా నిహితాః సప్త సప్త .. 2.1.8 ..**

దానినుండి (ఆ పరమ పురుషుని నుండి) ఏడు జ్ఞానేంద్రియాలు ఉత్పన్నమౌతున్నాయి. ఏడు (విషయ గ్రహణమనే) అగ్నులు, ఏడు రకాల (విషయాలనే) సమిధలు, ఏడు (విషయ జ్ఞానాలు) హోమాలు (ఆ పరమ పురుషుని నుండి ప్రభవిస్తున్నాయి). ఏ ఏడు లోకాలలో జ్ఞానేంద్రియాలు సంచరించస్తాయో అవి ఏడు ఏడు సమూహాలుగా గుహను (హృదయాన్ని) ఆశ్రయించి విశ్రమిస్తాయి.

## శంకరుల భాష్యం

కించ, సప్త శీర్షణ్యాః ప్రాణాః తస్మాదేవ పురుషాత్ ప్రభవంతి . తేషాం సప్త అర్చిషః దీప్తయః స్వస్వవిషయావద్యోతనాని . తథా సప్త సమిధః సప్తవిషయాః ; విషయైర్హి సమిధ్యంతే ప్రాణాః . సప్త హోమాః ; తద్విషయవిజ్ఞానాని, 'యదస్య విజ్ఞానం తజ్జుహోతి' (తై. నా. 80) ఇతి శ్రుత్యంతరాత్ . కించ, సప్త ఇమే లోకాః ఇంద్రియస్థానాని, యేషు చరంతి సంచరంతి ప్రాణాః ఇతి విశేషణాత్ . ప్రాణా



యేషు చరంతీతి ప్రాణానాం విశేషణమిదం ప్రాణాపానాదినివృత్త్యర్థం . గుహాయాం శరీరే హృదయే వా స్వాపకాలే శేరత ఇతి గుహాశయాః . నిహితాః స్థాపితా ధాత్రా సప్త సప్త ప్రతిప్రాణిభేదం . యాని చ ఆత్మయాజినాం విదుషాం కర్మాణి కర్మఫలాని చావిదుషాం చ కర్మాణి తత్సాధనాని కర్మఫలాని చ సర్వం చైతత్పరస్మాదేవ పురుషాత్సర్వజ్ఞాత్ప్రసూతమితి ప్రకరణార్థః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, **సప్త ప్రాణాః** ప్రాణుల శిరస్సులో గల ఏడు జ్ఞానేంద్రియాలు (అంటే రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రాలు మరియు నోరు) **తస్మాత్** ఆ పరమ పురుషుని నుండియే **ప్రభవంతి** పుడుతున్నాయి. వాటియందలి **సప్త అర్చిషః** ఏడు ప్రకాశాలు అంటే ఏడు జ్ఞానేంద్రియాల వల్ల కలిగే ఏడు విధాలైన విషయాలను గ్రహించడం , అదేవిధంగా **సప్త సమిధః** ఏడు విషయాలు, అంటే విషయాలచే ఇంద్రియాలు రగల్చబడుతాయి కాబట్టి వాటిని సమిధలంటున్నారు, **సప్త హోమా** ఆ విషయాలకు సంబంధించిన జ్ఞానాలు అని అభిప్రాయం. 'ఏది అతని విషయ జ్ఞానమో దానిసే హవిస్సుగా హోమం చేస్తాడు' ['యదస్య విజ్ఞానం తజ్జుహోతి' (తై. నా. 80)] అని వేరొక శ్రుతికూడా అంటోంది. మరింకా, **సప్త ఇమే లోకాః** ఇంద్రియస్థానాలు, వేటిలో ఇంద్రియాలు సంచరిస్తాయో అని విశేషించి చెప్తున్నారు. ఇంద్రియాలు దేనిలో సంచరిస్తాయో అన్నది ఇంద్రియాలను గురించిన విశేషణం, ఇక్కడ ప్రాణ-అపానాదుల గురించిన ప్రస్తావన కాదని చెప్పే ఉద్దేశ్యం. **గుహాశయాః** గుహాలో అంటే

దేహంలోని హృదయమందు అని. లేదా నిద్రాస్థితిలో దేనియందు విశ్రమిస్తాయో అది అని అర్థం. **సప్త సప్త** ప్రతిప్రాణిలో ఏడు ఏడు సమూహాలుగా **నిహితాః** ఈశ్వరునిచే స్థాపించబడినవి. కర్మలు మరియు కర్మఫలాల గురించి తెలిసిన విద్వాంసులు, ఆత్మయాజులు (అంటే యజ్ఞాది కర్మలను ఆ పరమాత్మయొక్క ఉపాసనగా 'నాతో సహా ఇదంతా కూడా పరమాత్మ తప్ప మరేమీ కాదు' అనే భావనతో నిర్వహిస్తారో వారు – ఆనందగిరి టీక) మరియు ఇవేవీ తెలియనివారు మరియు ఈ కర్మలు, వాటి సాధనాలు, కర్మఫలాలు సర్వమూ కూడా సర్వజ్ఞుడైన ఆ పరమ పురుషుని నుండియే ఉద్భవిస్తున్నారని ఈ మొత్తం ప్రకరణానికి అర్థమని గ్రహించాలి.

**అతః సముద్రా గిరయశ్చ సర్వేఽస్మాత్స్యన్దన్తే సిన్ధవః సర్వరూపాః .**

**అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ యేనైష భూతైస్తిష్ఠతే హ్యన్తరాత్మా .. 2.1.9 ..**

ఆ పురుషుని నుండి సకల సముద్రాలు, పర్వతాలు ఉద్భవించాయి. అతని నుండే వివిధ రూపాలలో నదులు ప్రవహిస్తున్నాయి. మరియు అతని నుండే



సమస్త ఓషధులు, రసములు ఏవైతే ఈ ప్రాణులలోపల ఉన్నాయో అవన్నీ (ఆ పరమ పురుషుని నుండే) ఉత్పన్నమౌతున్నాయి

## శంకరుల భాష్యం

అతః పురుషాత్ సముద్రాః సర్వే క్షారాద్యాః . గిరయశ్చ హిమవదాదయః అస్మాదేవ పురుషాత్ సర్వే . స్యందంతే స్రవంతి గంగాద్యాః సింధవః నద్యః సర్వరూపాః బహురూపాః . అస్మాదేవ పురుషాత్ సర్వాః ఓషధయః వ్రీహియవాద్యాః . రసశ్చ మధురాదిః షడ్విధః, యేన రసేన భూతైః పంచభిః స్థూలైః పరివేష్టితః తిష్ఠతే తిష్ఠతి హి అంతరాత్మా లింగం సూక్ష్మం శరీరం . తద్ధ్యంతరాలే శరీరస్యాత్మనశ్చాత్మవద్వర్తత ఇత్యంతరాత్మా ..

ఏవం పురుషాత్సర్వమిదం సంప్రసూతం . అతో వాచారంభణం వికారో నామధేయమనృతం పురుష ఇత్యేవ సత్యం ;

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**అతః** పురుషుని నుండి **సముద్రాః** సకల క్షారములు **గిరయశ్చ** హిమాలయాది పర్వతాలు **సర్వే** అన్నీ ఆ పురుషుని నుండే. **సింధవః** గంగ మొదలైన నదులు **సర్వరూపాః** అనేక రూపాలు గలవి **స్యందంతే** ప్రవహిస్తున్నాయి. ఆ పురుషుని నుండే సకలములైన **ఓషధయః** వరి, బార్లీ వంటి ధాన్యములు **రసశ్చ** తీపి వంటి ఆరు రకాలైన రుచులు, ఏ రసములచే **భూతైః** స్థూలమైన పంచభూతములు

ఆవరించబడి **అంతరాత్మా** లింగ-సూక్ష్మ శరీరంగా **తిష్ఠతే** ఉంటున్నాయో. దేహానికి ఆత్మకు మధ్యలో ఆత్మలాగా వర్తిస్తుంది కాబట్టి దానిని అంతరాత్మ అన్నారు. (అంటే స్థూలమైన పంచభూతాలతో నిర్మితమైనది దేహం. రసాలచే నిండిన ఆ పంచభూతాలు, లింగ-సూక్ష్మ శరీరాలను ఆవరించి ఉన్నాయి. ఈ లింగ-సూక్ష్మ శరీరాలు అసలైన ఆత్మను ఆవరించి ఉన్నాయి. ఆ విధంగా, లింగ-సూక్ష్మ శరీరం ఆత్మకు స్థూల దేహానికి మధ్యలో ఉన్నది కాబట్టి దానిని కూడా అంతరాత్మ అని ఈ సందర్భంలో సూచిస్తున్నారు).

ఈ విధంగా పరమ పురుషుని నుండియే ఈ సమస్తమూ ఉత్పన్నమౌతున్నది. అందుచేత, వాక్కుచే తెలియచెప్పబడే ఈ పరిణామాలన్నీ కేవలం పేరు కలిగినవే కాని యదార్థమైనవి కావు. పరమ పురుషుడే యదార్థం.

**పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్ .**
**ఏతద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య .. 2.1.10 ..**

## శంకరుల భాష్యం

అతః పురుష ఏవ ఇదం విశ్వం సర్వం . న విశ్వం నామ పురుషాదన్యత్కించిదస్తి . అతో యదుక్తం తదేవేదమభిహితం 'కస్మిన్ను భగవో



విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' (ము. ఉ. 1 . 1 . 3) ఇతి ; ఏతస్మిన్హి పరస్మిన్నాత్మని సర్వకారణే పురుషే విజ్ఞాతే, పురుష ఏవేదం విశ్వం నాన్యదస్తీతి విజ్ఞాతం భవతీతి . కిం పునరిదం విశ్వమిత్యుచ్యతే — కర్మ అగ్నిహోత్రాదిలక్షణం ; తపః జ్ఞానం తత్కృతం ఫలమన్యదేవ తావద్ధీదం సర్వం ; తచ్చ ఏతద్బ్రహ్మణః కార్యం ; తస్మాత్సర్వం బ్రహ్మ పరామృతం పరమమృతమహమేవేతి యో వేద నిహితం స్థితం గుహాయాం హృది సర్వప్రాణినాం , సః ఏవం విజ్ఞానాత్ అవిద్యాగ్రంథిం గ్రంథిమివ దృఢీభూతామవిద్యావాసనాం వికిరతి విక్షిపతి వినాశయతి ఇహ జీవన్నేవ, న మృతః సన్ హే సోమ్య ప్రియదర్శన ..

.. ఇతి ద్వితీయముండకే ప్రథమఖండభాష్యం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

అందువలన ఆ విధంగా **ఇదమ్ విశ్వమ్** ఈ సమస్త విశ్వమూ **పురుష ఏవ** పరమాత్మయే. విశ్వం అనే పేరుగలది వేరొకటి పరమాత్మకు అన్యంగా లేదు. అందుకనే 'ఓ పూజనీయుడా, దేనిని తెలుసుకొన్నట్లైతే ఈ సమస్తమూ తెలియబడుతుంది?' ['కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' (ము.ఉ. 1-1-3)] అని (శిష్యుడు) దేనినైతే తెలుసుకోవాలనుకొన్నాడో దానిని చెప్పారు. సకలానికి కారణమైన పరమపురుషుడైన ఈ పరమాత్మను తెలుసుకొన్నట్లైతే, నిశ్చయంగా ఈ విశ్వమనగా ఆ పరమ పురుషుడే తప్ప వేరొకటి కాదని తెలుస్తుంది. మరైతే ఈ విశ్వం ఏమిటి? అన్న ప్రశ్నకు సమాధానమిస్తున్నారు. **కర్మ** అగ్నిహోత్రాదుల వంటి కర్మ,

**తపః** అనగా జ్ఞానం వాటి వల్ల కలిగే భిన్నమైన ఫలం, ఈ సమస్తమంతా నిశ్చయంగా ఇంత మాత్రమే. (అంటే ఎంతగా పరిశీలించినా ఈ విశ్వమంతా కేవలం కర్మలు, ఉపాసనలు మరియు వాటి వల్ల కలిగే ఫలితాలు మాత్రమే. అంతకు మించి వేరేమీ లేదని అభిప్రాయం). అందువలన, ఈ సమస్తమూ **బ్రహ్మ** పరబ్రహ్మం యొక్క కార్యమే (లేదా పరిణామమే). **పరామృతమ్** పరమమైనది, అమృతమైనట్టిదని, అది తానేనని **గుహాయామ్** సకల ప్రాణుల గుహలో **స్థితం** ఉన్నట్టిదానిగా **ఏతత్** దీనిని **యో వేద** ఎవడైతే తెలుసుకొంటాడో, **సోమ్య** ఓ సౌమ్యుడా, చూడగానే ప్రీతికలిగించే వాడా (అంటూ శిష్యుడిని గురువు ఆప్యాయంగా సంబోధిస్తున్నాడు) **సః** అతడు ఆ విధమైన జ్ఞానంతో **అవిద్యాగ్రంథిం** ముడిలాగా దృఢంగా చిక్కుపడియున్న అజ్ఞానపు వాసనలను **ఇహ** జీవించి ఉండగానే, మరణించిన తర్వాత కాదు **వికిరతి** విసిరివేస్తాడు, నాశనం చేస్తాడు.

.. ద్వితీయ ముండకంలోని ప్రథమఖండ భాష్యానువాదం సమాప్తం ..



# ద్వితీయ ముండకము

# ద్వితీయ ఖండము

## శంకరుల ఉపోద్ఘాత భాష్యం

అరూపం సదక్షరం కేన ప్రకారేణ విజ్ఞేయమిత్యుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

రూపం లేని ఆ అవినాశిత్వం (అక్షర బ్రహ్మ) ఏ ప్రకారంగా తెలియబడుతుందనేది చెప్తున్నారు.

**ఆవిః సంనిహితం గుహాచరం నామ మహత్పదమత్రైతత్సమర్పితమ్ .**
**ఏజత్ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానామ్ .. 2.2.1 ..**

ప్రకాశమై, హృదయంలో ప్రసిద్ధమై అందుబాటులో ఉన్నదైన అతిగొప్ప లక్ష్యం. దానియందే కదిలేవీ (పక్ష్యాదులు), శ్వాసించేవీ (మనుష్యాదులు),

కనురెప్పలున్నవీ లేనివీ (వృక్షాదులు) కూడా ఉన్నాయి. 'సత్' మరియు 'అసత్'ల కన్నా గొప్పదైనదీ-అతీతమైనదీ, ప్రాణులలో సాధారణంగా ఏ విజ్ఞానం ఉంటుందో వాటికన్నా మిన్నయైనట్టి దీనిని తెలుసుకోండి.

## శంకరుల భాష్యం

ఆవిః ప్రకాశం, సంనిహితం , వాగాద్యుపాధిభిః — జ్వలతి భ్రాజతీతి శ్రుత్యంతరాత్ — శబ్దాదీనుపలభమానవదవభాసతే ; దర్శనశ్రవణమననవిజ్ఞానాద్యుపాధిధర్మైరావిర్భూతం సల్లక్ష్యతే హృది సర్వప్రాణినాం . యదేతదావిర్భూతం బ్రహ్మ సంనిహితం సమ్యక్ స్థితం హృది, తత్ గుహాచరం నామ గుహాయాం చరతీతి దర్శనశ్రవణాదిప్రకారైర్గుహాచరమితి ప్రఖ్యాతం . మహత్ సర్వమహత్త్వాత్ , పదం పద్యతే సర్వేణేతి, సర్వపదార్థాస్పదత్వాత్ . కథం తన్మహత్పదమితి, ఉచ్యతే ? యతః అత్ర అస్మిన్బ్రహ్మణి ఏతత్సర్వం సమర్పితం సంప్రవేశితం రథనాభావివారాః — ఏజత్ చలత్పక్ష్యాది, ప్రాణత్ ప్రాణితీతి ప్రాణాపానాదిమన్మనుష్యపశ్వాది, నిమిషచ్చ యన్నిమేషాదిక్రియావత్ , యచ్చానిమిషత్ ; చ - శబ్దాత్ సమస్తమేతదత్రైవ బ్రహ్మణి సమర్పితం . ఏతత్ యదాస్పదం సర్వం జానథ హే శిష్యాః, అవగచ్ఛత తదాత్మభూతం భవతాం ; సదసత్ సదసత్స్వరూపం సదసతోర్మూర్తామూర్తయోః స్థూలసూక్ష్మయోః, తద్వ్యతిరేకేణాభావాత్ . వరేణ్యం వరణీయం , తదేవ హి సర్వస్య నిత్యత్వాత్ప్రార్థనీయం ; పరం వ్యతిరిక్తం



విజ్ఞానాత్ప్రజానామితి వ్యవహితేన సంబంధః ; యల్లౌకికవిజ్ఞానాగోచరమిత్యర్థః . యత్ వరిష్ఠం వరతమం సర్వపదార్థేషు వరేషు ; తద్ధ్యేకం బ్రహ్మ అతిశయేన వరం సర్వదోషరహితత్వాత్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఆవిః** అనగా ప్రకాశం (అంటే ప్రకాశమే స్వరూపమైనట్టి ఆ అక్షర బ్రహ్మ) **సంనిహితం** వాక్కు మొదలుగాగల ఉపాధులచే శబ్దాదులు కలగటంద్వారా ప్రకాశమానమై సమీపంలో ఉన్నది. దీనిసే 'వెలుగుతోంది ప్రకాశిస్తోంది' ['జ్వలతి భ్రాజతి'] అని వేరొక శ్రుతి వాక్యం చెప్తోంది కూడా. చూచుట-వినుట- ఆలోచించుట-గ్రహించుట వంటి ఉపాధి ధర్మాల ద్వారా సకల ప్రాణుల హృదయాలలో ప్రకాశితమై యున్నట్లుగా గుర్తింబడుతోంది. ఏ ఈ ప్రకాశమానమైన బ్రహ్మ హృదయంలో చక్కగా ప్రతిష్ఠితమై ఉన్నదో, అది **గుహాచరమ్ నామ** గుహలలో చరించేది, అంటే చూచుట-వినుట అనే వివిధ ప్రకారాలుగా ప్రాణుల హృదయాలలో కదలుతూ ఉంటుంది కాబట్టి గుహాచరమ్ అనే పేరుతో ప్రసిద్ధికెక్కినది. **మహత్** అన్నింటికన్నా గొప్పదైన, **పదమ్** అన్ని పదార్థాలకు ఆశ్రయమైనట్టిది కాబట్టి సర్వమూ పొందే అంతిమ లక్ష్యం. అది మహత్పదం ఎలా అయిందో చెప్తున్నారు. ఇక్కడ ఈ అక్షర బ్రహ్మయందే ఇవన్నీ (ఈ చెప్పబోయే వన్నీ) **సమర్పితమ్** రథనాభికి ఆకులున్నట్లుగా ప్రవేశించి స్థిరంగా ఉన్నాయి. **ఏజత్** కదిలే పక్షులు మొదలైనవి, **ప్రాణత్** శ్వాసించేవి, అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు

కలిగిన మానవులు, పశువులు మొదలైనవి, **యత్ నిమిషత్ చ** కనులు మూసేవీ మరియు కనులు మాయనివీ. చ శబ్దం వల్ల సమస్తమూ ఈ అక్షర బ్రహ్మ యందే స్థితికలిగి ఉన్నదని భావం. ఈ సమస్తానికి ఆశ్రయమైనది ఏది కలదో ఆత్మరూపమైన దానిని **జానథ** ఓ శిష్యులారా మీరు తెలుసుకోండి. అది **సదసత్** 'సత్' మరియు 'అసత్' స్వరూపమైనట్టిది. సత్-అసత్ అంటే మూర్తమైనట్టిది-అమూర్తమైనట్టిది లేదా స్థూలమైనది-సూక్ష్మమైనట్టిది, ఎందుకంటే దానికి భిన్నమైనది ఏదీ లేదు కాబట్టి. **వరేణ్యమ్** పొందతగినది, అన్నింటిలోకి అదియే నిశ్చయంగా శాశ్వతమైనది కాబట్టి అదియే ప్రార్థింపతగినది లేదా కోరతగినది. **ప్రజానామ్ విజ్ఞానాత్ పరమ్** జనులయొక్క లౌకిక విజ్ఞానంతో తెలియజాలనిది అని అర్థం. ఇలా దూరంగా ఉన్న 'విజ్ఞానాత్ ప్రజానామ్'ను 'పరమ్'కు కలుపుకోవాలి. **యత్ వరిష్ఠమ్** ఏది కోరతగిన పదార్థాలన్నింటిలోకి ఉన్నతమైనదో. అది నిశ్చయంగా ఆ బ్రహ్మ ఒక్కటే, సకల దోష రహితమైనది కాబట్టి, ఉత్తమైన వాటన్నింటిలోకి ఉత్తమమైనదని భావం.

**యదర్చిమద్యదణుభ్యోఽణు చ యస్మింల్లోకా నిహితా లోకినశ్చ .**

**తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః .**



**తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి**

**.. 2.2.2 ..**

ఏది ప్రకాశవంతమైనదో, ఏది సూక్ష్మాతి సూక్ష్మమో, దేనియందు లోకాలు మరియు లోకులు కూడా స్థితిని కలిగి ఉంటారో అది ఈ అవినాశిత్వమైన బ్రహ్మము. అదియే ప్రాణము, వాక్కు, మనసు కూడా. అదియే సత్యం, అమృతం. అదియే లక్షింపతగినది అని ఓ సౌమ్యుడా! తెలుసుకో.

## శంకరుల భాష్యం

కించ, యత్ అర్చిమత్ దీప్తిమత్ ; తద్దీప్త్యా హ్యాదిత్యాది దీప్యత ఇతి దీప్తిమద్బ్రహ్మ . కించ, యత్ అణుభ్యః శ్యామాకాదిభ్యోఽపి అణు చ సూక్ష్మం . చ - శబ్దాత్స్థూలేభ్యోఽప్యతిశయేన స్థూలం పృథివ్యాదిభ్యః . యస్మిన్ లోకాః భూరాదయః నిహితాః స్థితాః, యే చ లోకినః లోకనివాసినః మనుష్యాదయః ; చైతన్యాశ్రయా హి సర్వే ప్రసిద్ధాః ; తదేతత్ సర్వాశ్రయం అక్షరం బ్రహ్మ స ప్రాణః తదు వాఙ్మనః వాక్చ మనశ్చ సర్వాణి చ కరణాని తదు అంతశ్చైతన్యం ; చైతన్యాశ్రయో హి ప్రాణేంద్రియాదిసర్వసంఘాతః, 'ప్రాణస్య ప్రాణం' (బృ. ఉ. 4 . 4 . 10) ఇతి శ్రుత్యంతరాత్ . యత్ప్రాణాదీనామంతశ్చైతన్యమక్షరం తదేతత్ సత్యం అవితథం , అతః అమృతం అవినాశి తత్ వేద్ధవ్యం మనసా

తాడయితవ్యం . తస్మిన్మనసః సమాధానం కర్తవ్యమిత్యర్థః . యస్మాదేవం హే సోమ్య, విద్ధి అక్షరే చేతః సమాధత్స్వ ..

కథం వేద్ధవ్యమితి, ఉచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, **యత్ అర్చిమత్** ఏది ప్రకాశవంతమైనదో, దాని ప్రకాశం కారణంగానే సూర్యుడు మొదలైనవి ప్రకాశిస్తున్నాయి కాబట్టి బ్రహ్మ ప్రకాశమానుడు. మరింకా, **యత్ అణుభ్యః** ఏది సూక్ష్మంగా ఉండే శ్యామలు (సామలు కావచ్చు) అనబడే ధాన్యవిశేషణం కన్నా **అణు** మరింత సూక్ష్మమైనదో (అంటే సూక్ష్మమైనవాటిలోకెల్లా అత్యంత సూక్ష్మమైనదని భావం). **చ** శబ్దం స్థూలమైన వాటిని మించి స్థూలమైనది అంటే భూమి మొదలైన వాటికన్నా మించినది అన్న భావనను సూచిస్తుంది. **యస్మిన్** దేనిలో **లోకాః** భూలోకం-భువర్లోకం-సువర్లోకం వంటివి, **చ లోకినః** ఆయా లోకాలలో నివసించే మానవులు మొదలైనవారితో సహా, ఎందుకంటే సమస్తమూ చైతన్యం పైననే ఆధారపడింది అన్నది లోక ప్రసిద్ధమైన విషయమే కాబట్టి, **నిహితాః** స్థితి కలిగి ఉన్నాయో, అదియే సర్వానికి ఆశ్రయమైనట్టి **అక్షరమ్ బ్రహ్మ** అవినాశిత్వ బ్రహ్మ. **స ప్రాణః** అదియే ప్రాణం, **తత్ ఉ** మరి అదియే **వాఙ్మనః** వాక్కు, మనసు. అంటే సకల జ్ఞానేంద్రియాలుకర్మేంద్రియాలు. అదియే అంతరంగంలో ఉండే చైతన్యం. ఈ చైతన్యాన్ని ఆశ్రయించియే ప్రాణము, ఇంద్రియాలు మొదలైన దేహసంఘాతం ఉంటాయి. అందుకే



'అది ప్రాణం యొక్క ప్రాణం' ['ప్రాణస్య ప్రాణం' (బృ.ఉ. 4-4-10)] అని మరొక శృతి కూడా చెప్పింది. ప్రాణాదుల అంతరంగంలో ఏ అవినాశిత్వమైన చైతన్యమైతే ఉన్నదో అదియే **సత్యమ్** యదార్థం. అందుచేత అది అమృతమ్ శాశ్వతమైనది, వినాశం లేనిది. **తత్ వేద్ధవ్యమ్** మనసుచేత గురిచేసి కొట్టబడేది. అంటే, దానియందు మనసును ఏకాగ్రం చేయడం మనేది కర్తవ్యం అని అభిప్రాయం. అందుచేత ఈ రీతిగా ఓ సౌమ్యుడా, **విద్ధి** అవినాశిత్వం మీదనే చిత్తాన్ని లగ్నం చేసి సమాధిస్థితిని పొందు.

ఏ విధంగా లగ్నం చేయాలనేది (తర్వాతి పాఠంలో) చెప్తున్నారు.

**ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసానిశితం సన్దధీత .**

**ఆయమ్య తద్భావగతేన చేతసా లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి .. 2.2.3 ..**

ఉపనిషత్తులో చెప్పబడిన గొప్ప ఆయుధమైన ధనుస్సును చేతబూని, ఉపాసనచే పదును పెట్టిన బాణాన్ని అనుసంధానించి, వింటినారిని లాగి, ఓ

సౌమ్యుడా! లక్ష్యమైన అవినాశిత్వంలో మనసు లగ్నమయ్యేలా ప్రయోగించు.

## శంకరుల భాష్యం

ధనుః ఇష్వాసనం గృహీత్వా ఆదాయ ఔపనిషదం ఉపనిషత్సు భవం ప్రసిద్ధం మహాస్త్రం మహచ్చ తదస్త్రం చ మహాస్త్రం ధనుః, తస్మిన్ శరం ; కింవిశిష్టమిత్యాహ — ఉపాసానిశితం సంతతాభిధ్యానేన తనూకృతం , సంస్కృతమిత్యేతత్ ; సందధీత సంధానం కుర్యాత్ . సంధాయ చ ఆయమ్య ఆకృష్య సేంద్రియమంతఃకరణం స్వవిషయాద్వినివర్త్య లక్ష్య ఏవావర్జితం కృత్వేత్యర్థః . న హి హస్తేనేవ ధనుష ఆయమనమిహ సంభవతి . తద్భావగతేన తస్మిన్బ్రహ్మణ్యక్షరే లక్ష్యే భావనా భావః తద్గతేన చేతసా, లక్ష్యం తదేవ యథోక్తలక్షణం అక్షరం సోమ్య, విద్ధి ..

యదుక్తం ధనురాది, తదుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ధనుః** బాణాన్ని ప్రయోగించే సాధనాన్ని **గృహీత్వా** తీసుకొని **ఔపనిషదమ్** ఉపనిషత్తులో ప్రసిద్ధమై యున్న **మహాస్త్రమ్** గొప్ప ఆయుధమైన ఆ ధనుస్సునందు **శరమ్** అంటే బాణం. దానికి గల విశిష్టత ఏమిటో చెప్తున్నారు. **ఉపాసానిశితమ్** నిరంతరం తదేకధ్యానంతో పదునుచేయబడినది, సంస్కరించబడినది అని. **సందధీత** (బాణాన్ని ధనుస్సునందు) సంధానించి మరియు **ఆయమ్య** (వింటినారిని) లాగిపట్టి, అంటే ఇంద్రియాలతో సహా అంతఃకరణాన్ని వాటివాటి విషయాలవైపు పోకుండా నివారించి, లక్ష్యాన్ని విడనాడకుండా అని అర్థం. వింటినారిని చేతితో లాగటం అనే భావనను ఈ సందర్భంలో గ్రహించరాదు. **తద్భావగతేన** ఆ అక్షర బ్రహ్మయే లక్ష్యమనే భావనయందే నిమగ్నమైన **చేతసా** మనసుతో **తత్ ఏవ** చెప్పబడిన లక్షణాలు కలిగిన **అక్షరమ్** అవినాశిత్వం అనే **లక్ష్యం** లక్ష్యాన్ని, సోమ్య ఓ సౌమ్యుడా, **విద్ధి** ఛేదించాలి.



ఏ ధనుస్సు మొదలైనవాటిని (ప్రస్తుత మంత్రంలో) ప్రస్తావించారో, వాటిని గురించి (మరింత వివరంగా తర్వాతి పాఠంలో) చెప్తున్నారు.

**ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే .**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ .. 2.2.4 ..**

ఓంకారమే ధనుస్సు. ఆత్మయే బాణం. బ్రహ్మ దాని లక్ష్యమంటారు. (సాధకుడు) అప్రమత్తతో ఛేదించాలి. బాణంలాగా అదియే (ఆ లక్ష్యమైన బ్రహ్మయే) తానయిపోతాడు.

## శంకరుల భాష్యం

ప్రణవః ఓంకారః ధనుః . యథా ఇష్వాసనం లక్ష్యే శరస్య ప్రవేశకారణం , తథా ఆత్మశరస్యాక్షరే లక్ష్యే ప్రవేశకారణమోంకారః . ప్రణవేన హ్యభ్యస్యమానేన సంస్క్రియమాణస్తదాలంబనోఽప్రతిబంధేనాక్షరేఽవతిష్ఠతే . యథా ధనుషా అస్త ఇషుర్లక్ష్యే . అతః ప్రణవో ధనురివ ధనుః . శరో హ్యాత్మా ఉపాధిలక్షణః పర ఏవ జలే సూర్యాదివదిహ ప్రవిష్టో దేహే సర్వబౌద్ధప్రత్యయసాక్షితయా ; స శర ఇవ స్వాత్మన్యేవార్పితోఽక్షరే బ్రహ్మణి ; అతః బ్రహ్మ తత్ లక్ష్యముచ్యతే లక్ష్య ఇవ మనః సమాధిత్సుభిరాత్మభావేన లక్ష్యమాణత్వాత్ .

అక్షరస్యైవ దుర్లక్ష్యత్వాత్పునః పునర్వచనం సులక్షణార్థం .

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ప్రణవః** ఓంకారము **ధనుః** ధనుస్సు. ఎలాగైతే బాణాన్ని లక్ష్యంలో ప్రవేశపెట్టడానికి విల్లు కారణమైనట్లుగా, ఆత్మ అనే బాణాన్ని అవినాశిత్వమనే లక్ష్యంలో ప్రవేశపెట్టడానికి ఓంకారం కారణం. ఎలాగైతే ధనుస్సునుండి విడిచిపెట్టబడిన బాణం లక్ష్యాన్ని చేరుతుందో, అలాగే ఓంకార అభ్యాసం వల్ల సంస్కరింపబడిన ఆత్మ, ఆ ఓంకారాన్ని ఆలంబనగా చేసుకొని ప్రతిబంధకాలు లేకుండా అవినాశిత్వంలో స్థిరమైతుంది. అందుచేత ఓంకారం ధనుస్సు వంటి ధనుస్సు. **ఆత్మా హి శరః** ఆత్మయే బాణం, ఆత్మ ఉపాధిగుణాలకు అతీతమైనప్పటికీ, నీటిలోని సూర్యాదుల లాగా, ఇక్కడ దేహంలో ప్రవేశించి సకల బుద్ధివృత్తులకు సాక్షిరూపంగా ఉన్నట్టిది. ఆ ఆత్మ బాణం లాగా



తనయందే అంటే అక్షర బ్రహ్మమందే సమర్పితమౌతుంది. అందువలన, **బ్రహ్మ** బ్రహ్మ **తత్ లక్ష్యమ్ ఉచ్యతే** దాని లక్ష్యంగా చెప్పబడుతోంది. (బ్రహ్మను లక్ష్యం అని ఎందుకు అన్నారంటే) లక్ష్యం లాగా మనసును ఆత్మభావనతో సమాధిస్థితికి చేర్చడమనే లక్ష్యాన్ని కలిగియుండటం చేత. అలా ఉండగా, **అప్రమత్తేన** బాహ్యవిషయాల వల్ల కలిగే కోరిక అనే ప్రమాదం కలుగకుండా, అన్నింటిమీదా కలిగిన వైరాగ్యం చేత, ఇంద్రియాలను జయించడం వల్ల ఏకాగ్రత కలిగిన చిత్తంతో బ్రహ్మ అనే లక్ష్యాన్ని ఛేదించాలి. అప్పుడు, ఆ లక్ష్య ఛేదన తర్వాత బాణంలాగే అదియే తానయి పోతుంది. లక్ష్యంతో ఏకం కావడమే బాణం పొందే ఫలితం అయినట్లుగా, దేహాదులే ఆత్మయనే భావనలను తిరస్కరించి అవినాశిత్వంతో ఏకత్వాన్ని సాధించడమనే ఫలాన్ని పొందాలి అని అభిప్రాయం.

అవినాశిత్వాన్ని అర్థం చేసుకోవడం కఠినం కాబట్టి సులభంగా గ్రహించగలిగేందుకై దానిని గురించి మళ్ళీ మళ్ళీ చెప్తున్నారు.

**యస్మిన్ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః .**

**తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః .. 2.2.5 ..**

దేనియందు స్వర్గం, భూమి, అంతరిక్షాలు, మనసు మరియు ప్రాణం, సకల ఇంద్రియాలతో సహా కూర్చబడి యున్నాయో దానిని ఏకమైనట్టి (రెండవది లేనట్టి) ఆత్మయేనని తెలుసుకో. ఇందుకు భిన్నమైన వాక్యాలను విడిచిపెట్టు. అమృతత్త్వానికి ఇదియే సేతువు.

**శంకరుల భాష్యం**

యస్మిన్ అక్షరే పురుషే ద్యౌః పృథివీ చ అంతరిక్షం చ ఓతం సమర్పితం మనశ్చ సహ ప్రాణైః కరణైః అన్యైః సర్వైః, తమేవ సర్వాశ్రయమేకమద్వితీయం జానథ జానీత హే శిష్యాః . ఆత్మానం ప్రత్యక్స్వరూపం యుష్మాకం సర్వప్రాణినాం చ . జ్ఞాత్వా చ అన్యాః వాచః అపరవిద్యారూపాః విముంచథ విముంచత పరిత్యజత . తత్ప్రకాశ్యం చ సర్వం కర్మ ససాధనం . యతః అమృతస్య ఏష సేతుః, ఏతదాత్మజ్ఞానమమృతస్యామృతత్వస్య మోక్షస్య ప్రాప్తయే సేతురివ సేతుః, సంసారమహోదధేరుత్తరణహేతుత్వాత్ ; తథా చ శ్రుత్యంతరం — 'తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ' (శ్వే. ఉ. 3 . 8) ఇతి ..

**శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం**

**యస్మిన్** ఏ అక్షర బ్రహ్మయందు **ద్యౌః పృథివీ చ అంతరిక్షమ్** స్వర్గం, భూమి, అంతరిక్షాలు **చ** మరియు **మనః** మనస్సు



**సహ సర్వైః ప్రాణైః** సకల అవయవాలతో సహా **ఓతమ్** స్థిరమై ఉన్నాయో, **తమ్ ఏవ** అది (ఆ అక్షర బ్రహ్మ) సర్వానికి ఆశ్రయమైన **ఏకమ్** రెండవది లేనిదిగా (అట్టిది రెండవది ఏదీ లేనిదిగా) ఓ శిష్యులారా, **జానథ** ('జానీత' అని స్వీకరించాలి) తెలుసుకోండి. మరియు **ఆత్మానమ్** మీలోనూ, సకలప్రాణులలోనూ అంతరంగా యున్న ఆత్మను తెలుసుకొన్నమీదట, **అన్యా వాచః** అపరవిద్యా రూపాలైన ఇతర వాదనలను **విముఞ్చథ** ('విముఞ్చత' అని స్వీకరించాలి) విడిచిపెట్టాలి. అంటే ఆ అపరవిద్యలలో చెప్పబడిన కర్మలను మరియు వాటి సాధనాలనూ విడిచిపెట్టాలి అని భావం. ఎందుకంటే **అమృతస్య ఏష సేతుః** ఇది ఆత్మజ్ఞానామృతానికి అంటే మృతిరహితత్వ స్థితికి, అంటే మోక్షస్థితిని పొందటానికి, సంసారమనే మహాసాగరాన్ని దాటిస్తుంది కాబట్టి, ఇది సేతువు వంటి సేతువు. 'ఆ విధంగా తెలుసుకొన్నవాడు మృత్యువును దాటి పోతాడు, వేరొక మార్గమేదీ తెలియడం లేదు' ['తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ' (శ్వే.ఉ. 3-8)] అని వేరొక శ్రుతిలో కూడా ఇదే విధమైన ప్రస్తావన చేశారు.

**అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః .**
**ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్ .. 2.2.6 ..**

రథచక్రపు ఇరుసుకు బిగించిన కమ్మీలలాగా, దేనియందు నాడులు కలిసియుంటాయో, అట్టి దానిలోనే (హృదయంలోనే ఈ అక్షర బ్రహ్మ) బహురూపాలను పొంది సంచరిస్తుంది. ఆత్మను అలా ఓంకారంతో ధ్యానించండి. అంధకారపు ఆవలితీరాన్ని చేరడంలో మీకు శుభం కలుగుగాక.

## శంకరుల భాష్యం

కించ, అరా ఇవ యథా రథనాభౌ సమర్పితా అరాః, ఏవం సంహతాః సంప్రవిష్టాః యత్ర యస్మిన్హృదయే సర్వతో దేహవ్యాపిన్యః నాడ్యః, తస్మిన్హృదయే బుద్ధిప్రత్యయసాక్షిభూతః స ఏషః ప్రకృత ఆత్మా అంతః మధ్యే చరతే చరతి వర్తతే . పశ్యన్ శృణ్వన్మన్వానో విజానన్ బహుధా అనేకధా క్రోధహర్షాదిప్రత్యయైర్జాయమాన ఇవ జాయమానః అంతఃకరణోపాధ్యనువిధాయిత్వాత్ ; వదంతి హి లౌకికా హృష్టో జాతః క్రుద్ధో జాత ఇతి . తమాత్మానం ఓమిత్యేవం ఓంకారాలంబనాః సంతః యథోక్తకల్పనయా ధ్యాయథ చింతయత . ఉక్తం చ వక్తవ్యం శిష్యేభ్య ఆచార్యేణ జానతా . శిష్యాశ్చ బ్రహ్మవిద్యావివిదిషుత్వాన్నివృత్తకర్మాణో మోక్షపథే ప్రవృత్తాః . తేషాం నిర్విఘ్నతయా బ్రహ్మప్రాప్తిమాశాస్త్యాచార్యః — స్వస్తి నిర్విఘ్నమస్తు వః యుష్మాకం పారాయ పరకూలాయ ; కస్య ? అవిద్యాతమసః పరస్తాత్ ; అవిద్యారహితబ్రహ్మాత్మస్వరూపగమనాయేత్యర్థః ..



యోఽసౌ తమసః పరస్తాత్సంసారమహోదధిం తీర్త్వా గంతవ్యః పరవిద్యావిషయః, స కస్మిన్వర్తత ఇత్యాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, **రథనాభౌ అరా ఇవ** ఎలాగైతే రథ చక్రపు ఇరుసునకు కమ్మీలు బిగించి ఉంటాయో ఆవిధంగా **యత్ర** ఏ హృదయంలోనైతే **నాడ్యః** దేహమంతా వ్యాపించియుండే నాడులు **సంహతాః** కూర్చబడి ఉన్నాయో, ఆ హృదయంలోనే **అంతః** మధ్యలో **స ఏష** ప్రస్తావించ బడుతున్న ఈ ఆత్మ బుద్ధి వృత్తులకు సాక్షిరూపంగా ఉండి, **బహుధా** చూచుట-వినుట-ఆలోచించుట-తెలుసుకొనుట వంటి పనులను, అంతఃకరణ ఉపాధి యొక్క కోపం-సంతోషం మొదలైన స్థితులకు అనుగుణంగా నిర్వర్తిస్తూ **బహుధా జాయమానః** అనేక రూపాలుగా పరిణమించినదానివలె **చరతే** సంచరిస్తూ ఉంటుంది. అందుకే లోకంలో 'కోపోద్రిక్తుడైనాడు', 'సంతోషంతో నిండిపోయాడు' అని అంటూంటారు. **ఏవమ్** ఈ చెప్పిన పద్ధతిలో ఆలోచన చేసి **ఓమ్ ఇతి** ఓంకారాన్ని ఆలంబనగా చేసుకొని **ఆత్మానమ్** ఆ ఆత్మను **ధ్యాయథ** విచారణ చేయాలి. ఆచార్యులు శిష్యులకు దీనిని తెలియచెప్పారు మరియు చెప్పాలి కూడా. బ్రహ్మవిద్యను తెలుసుకోవాలనే కోరిక కలిగినవారైన శిష్యులు కర్మలను విడిచిపెట్టినవారై మోక్షమార్గంలో

ప్రవర్తిల్లుతారు. అట్టి వారికి బ్రహ్మాన్ని పొందే మార్గంలో ఎటువంటి అంతరాయాలు కలుగకుండా ఉండాలని గురువులు ఆశీర్వచనం చేస్తున్నారు. **పారాయ** అధిగమించడంలో **వః** మీకు **స్వస్తి** విఘ్నములు కలుగకుండుగాక. దేనిని (అధిగమించడంలో)? **తమసః** అజ్ఞానపు చీకట్లకు అధిగమించి ఆవలి తీరం చేరే క్రమంలో. అంటే అవిద్య యొక్క ఆనవాళ్లు లేని బ్రహ్మమే తన స్వరూపమని గ్రహించడమని అభిప్రాయం.

అజ్ఞానాంధకారమనే సంసార మహాసాగరాన్ని దాటి, పరా విద్యకు విషయమైన బ్రహ్మమును చేరినవాడు, అతడు ఎక్కడ ఉంటాడో చెప్తున్నారు.

**యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువి .**
**దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః**
**.. 2.2.7 ..**

ఏది సమస్తాన్నీ స్థూలంగా తెలిసి యున్నదో, సర్వాన్నీ సూక్ష్మంగానూ (వివరంగానూ) తెలిసి యున్నదో, ఈ భువిలో దేని మహిమ ప్రకటితమౌతోందో, ఆ పరమాత్మ దివ్యమైన బ్రహ్మపురంలోని ఆకాశంలో (దేహమందలి హదయాకాశంలో) ప్రతిష్ఠితమై ఉన్నది



## శంకరుల భాష్యం

యః సర్వజ్ఞః సర్వవిత్ వ్యాఖ్యాతః . తం పునర్విశినష్టి — యస్యైష ప్రసిద్ధో మహిమా విభూతిః . కోఽసౌ మహిమా ? యస్యేమే ద్యావాపృథివ్యౌ శాసనే విధృతే తిష్ఠతః ; సూర్యాచంద్రమసౌ యస్య శాసనేఽలాతచక్రవదజస్రం భ్రమతః ; యస్య శాసనే సరితః సాగరాశ్చ స్వగోచరం నాతిక్రామంతి ; తథా స్థావరం జంగమం చ యస్య శాసనే నియతం ; తథా ఋతవోఽయనే అబ్దాశ్చ యస్య శాసనం నాతిక్రామంతి ; తథా కర్తారః కర్మాణి ఫలం చ యచ్ఛాసనాత్స్వం స్వం కాలం నాతివర్తంతే, స ఏష మహిమా ; భువి లోకే యస్య స ఏష సర్వజ్ఞ ఏవంమహిమా దేవః . దివ్యే ద్యోతనవతి సర్వబౌద్ధప్రత్యయకృతద్యోతనే బ్రహ్మపురే . బ్రహ్మణో హ్యత్ర చైతన్యస్వరూపేణ నిత్యాభివ్యక్తత్వాత్ ; బ్రహ్మణః పురం హృదయపుండరీకం తస్మిన్యద్వ్యోమ, తస్మిన్వ్యోమని ఆకాశే హృత్పుండరీకమధ్యస్థే ప్రతిష్ఠిత ఇవోపలభ్యతే ; న హ్యాకాశవత్సర్వగతస్య గతిరాగతిః ప్రతిష్ఠా వాన్యథా సంభవతి ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యః సర్వజ్ఞః సర్వవిత్** అన్న పాఠం ఇంతకుముందే 1.1.9లో వ్యాఖానించబడింది. దాని విశిష్టతను తిరిగి చెప్తున్నారు. **యస్య ఏషః** దేనియొక్క ప్రసిద్ధమైన **మహిమ** విభూతి లేదా గొప్పదనము. ఏమిటి ఈ మహిమ? దేనియొక్క శాసనంలో ఈ దివి-భువి వాటి వాటి స్థానాలలో నిలిచియున్నాయో, దేని యొక్క శాసనంలో సూర్యచంద్రులు వెలుగుదివ్వెల వలె నిరంతరం భ్రమిస్తున్నాయో, దేని శాసనం వల్ల నదులు, సాగరాలు వాటి తీరాలను

అతిక్రమించకుండా ఉన్నాయో, అలాగే కదిలేవీ-కదలనివీ అయిన ప్రాణులు దేని నియంత్రణలో మనుగడ సాగిస్తున్నాయో, అలాగే ఋతువులు, ఆయనాలు, సంవత్సరాలు దేని శాసనాన్ని అతిక్రమించడం లేదో, అలాగే కర్తలు, కర్మలు మరియు ఫలాలు దేని శాసనం చేత వాటి వాటి కాలాలను అతిక్రమించడం లేదో, అదియే ఈ మహిమ. **భువి** లోకంలో, ఈ మహిమ ఎవనికి కలదో ఆతడే **ఏషః** ఈ సర్వజ్ఞుడే **దివ్యే** ప్రకాశమానమై, అంటే సకల బుద్ధి వృత్తులలో ప్రకాశిస్తూ **బ్రహ్మపురే** ఎక్కడ బ్రహ్మము చైతన్య స్వరూపంగా శాశ్వతంగా వ్యక్తమౌతున్నందు వలన బ్రహ్మయొక్క పురం అనబడే హృదయ పద్మంలో, **తస్మిన్ వ్యోమని** అట్టి హృదయ పద్మం మధ్యలోగల ఆకాశంలో ప్రతిష్ఠితః స్థిరమైయున్నాడు, పొందబడుతున్నట్లుగా ఉన్నాడు. బ్రహ్మము ఆకాశంలాగా సర్వత్రా వ్యాపించియున్నదైనందున దానికి రావడం పోవడం అనే స్థితులు చెప్పలేము. కేవలం అది స్థిరంగా ఉన్నదని మాత్రమే అనగలం కాని, మరోవిధంగా ఉండటం సంభవమే కాదు.

**మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ .**
**తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా ఆనందరూపమమృతం యద్విభాతి .. 2.2.8 ..**



(ఆ ఆత్మ) మనసుతో తాదాత్మ్యత పొందినది. ప్రాణాన్ని మరియు దేహాన్ని తీసుకుపోయేది. అన్నములో ఉండి బుద్ధిలో నిక్షిప్తమౌతుంది. (ఆ ఆత్మ తత్త్వాన్ని) తెలుసుకొన్న వివేకులు ఆనందమే రూపంగా ఏది ప్రకాశిస్తుందో ఆ అమృతత్త్వాన్ని సందర్శిస్తారు.

## శంకరుల భాష్యం

స హ్యాత్మా తత్రస్థో మనోవృత్తిభిరేవ విభావ్యత ఇతి మనోమయః, మనఉపాధిత్వాత్ . ప్రాణశరీరనేతా ప్రాణశ్చ తచ్ఛరీరం చ తత్ప్రాణశరీరం తస్యాయం నేతా . అస్మాత్స్థూలాచ్ఛరీరాచ్ఛరీరాంతరం సూక్ష్మం ప్రతి ప్రతిష్ఠితః అవస్థితః అన్నే భుజ్యమానాన్నవిపరిణామే ప్రతిదినముపచీయమానే అపచీయమానే చ పిండరూపేఽన్నే హృదయం బుద్ధిం పుండరీకచ్ఛిద్రే సంనిధాయ సమవస్థాప్య ; హృదయావస్థానమేవ హ్యాత్మనః స్థితిః, న హ్యాత్మనః స్థితిరన్నే ; తత్ ఆత్మతత్త్వం విజ్ఞానేన విశిష్టేన శాస్త్రాచార్యోపదేశజనితేన జ్ఞానేన శమదమధ్యానసర్వత్యాగవైరాగ్యోద్భూతేన పరిపశ్యంతి సర్వతః పూర్ణం పశ్యంతి ఉపలభంతే ధీరాః వివేకినః . ఆనందరూపం సర్వానర్థదుఃఖాయాసప్రహీణం సుఖరూపం అమృతం యద్విభాతి విశేషేణ స్వాత్మన్యేవ భాతి సర్వదా ..

అస్య పరమాత్మజ్ఞానస్య ఫలమిదమభిధీయతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఆ ఆత్మ అక్కడ ఉండి (హృదయ పద్మం మధ్యలోగల ఆకాశంలో ఉండి) మనస్సును ఉపాధిగా చేసుకొని మనోవృత్తులుగా అనేకంగా ప్రకాశిస్తుంది కాబట్టి అది **మనోమయః. ప్రాణశరీరనేతా** ప్రాణము మరియు దాని శరీరంతో కూడినది ప్రాణశరీరం, వాటిని తీసుకొని పోయేది (ఈ ఆత్మయే). దానివలననే (ఈ ఆత్మవలననే) **అన్నే** తినబడే అన్నం యొక్క పరిణామంగా ప్రతిదినమూ వృద్ధిని పొందుతూ క్షయమౌతూ పిండరూపమైన అన్నంలో, అంటే శరీరం యొక్క స్థూలత్వ-సూక్ష్మత్వ స్థితులన్నింటిలో **ప్రతిష్ఠితః** ప్రకటనమౌతుంది, **హృదయమ్** బుద్ధిని హృదయమనే పద్మాకాశంలో **సంనిధాయ** నిక్షిప్తంచేసి, హృదయంలో సుస్థిరం కావడమే ఆత్మయొక్క స్థితి కాని, ఆత్మస్థితి అన్నంలో కాదని గ్రహించాలి. **తత్** అటువంటి ఆత్మతత్త్వాన్ని **విజ్ఞానేన** వివరంగా, అంటే శాస్త్రము మరియు ఆచార్యుల ఉపదేశం వల్ల కలిగిన జ్ఞానంతో, అంతరింద్రియ-బాహ్యేంద్రియ నిగ్రహం, ధ్యానం, సర్వాన్ని త్యజించగలిగిన వైరాగ్య భావనలతో, **ధీరాః** వివేకం కలిగినవారు **పరిపశ్యంతి** అంతటా నిండియున్నదానిగా దర్శిస్తారు అంటే పొందుతారు. (పూర్ణత్వంగా దేనిని దర్శిస్తారో చెప్తున్నారు) **ఆనందరూపమ్** సకల అనర్థాల వల్ల కలిగే దుఃఖాలన్నీ క్షీణించిన సుఖ స్వరూపమైనదీ **అమృతమ్** మరణరహిత మైనట్టిదీ **యద్విభాతి** అంటే విశేషించి తన యందే ఎల్లప్పుడూ ఏది ప్రకాశిస్తోందో దానిని, అంటే ఆ ఆత్మను (దర్శిస్తారు లేదా పొందుతారు) అని అభిప్రాయం.



ఈ పరమాత్మ జ్ఞానం వల్ల కలిగే ఫలం ఇదీ అని (తర్వాత పాఠంలో) తెలియజేస్తున్నారు.

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః .**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే .. 2.2.9 ..**

కారణమూ మరియు కార్యమూ తానే అయినట్టి దానిని (ఆత్మను) దర్శించడం చేత, హృదయంలోని చిక్కుముడి విడిపోతుంది, అన్ని సంశయాలు ఛిన్నమైపోతాయి, వాని కర్మలన్నీ నశిస్తాయి.

## శంకరుల భాష్యం

హృదయగ్రంథిః అవిద్యావాసనామయో బుద్ధ్యాశ్రయః కామః, 'కామా యేఽస్య హృది శ్రితాః' (బృ. ఉ. 4 . 4 . 7), (కా. ఉ. 2 . 3 . 14) ఇతి శ్రుత్యంతరాత్ . హృదయాశ్రయోఽసౌ, నాత్మాశ్రయః . భిద్యతే భేదం వినాశముపయాతి . ఛిద్యంతే సర్వే జ్ఞేయవిషయాః సంశయాః లౌకికానాం ఆ మరణాత్ గంగాస్రోతోవత్ప్రవృత్తా విచ్ఛేదమాయాంతి . అస్య విచ్ఛిన్నసంశయస్య నివృత్తావిద్యస్య యాని విజ్ఞానోత్పత్తేః ప్రాక్కృతాని జన్మాంతరే చాప్రవృత్తఫలాని జ్ఞానోత్పత్తిసహభావీని చ క్షీయంతే కర్మాణి, న త్వేతజ్జన్మారంభకాణి, ప్రవృత్తఫలత్వాత్ . తస్మిన్ సర్వజ్ఞేఽసంసారిణి పరావరే పరం చ కారణాత్మనా అవరం చ కార్యాత్మనా తస్మిన్పరావరే సాక్షాదహమస్మీతి దృష్టే, సంసారకారణోచ్ఛేదాన్ముచ్యత ఇత్యర్థః ..

ఉక్తస్యైవార్థస్య సంక్షేపాభిధాయకా ఉత్తరే మంత్రాస్త్రయోఽపి —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**హృదయగ్రంథిః** అవిద్యారూపమై బుద్ధిని ఆశ్రయించియున్న కోరికలు, 'ఎద్దాని యొక్క కోరికలు హృదయాన్ని ఆశ్రయించియున్నవో' ['కామా యేఽస్య హృది శ్రితాః' (బృ.ఉ. 4-4-7), (క.ఉ. 2-3-14)] అని ఇతర శ్రుతులు చెప్పినవి. (కోరికలు) హృదయాన్ని ఆశ్రయించినవే కాని ఆత్మను ఆశ్రయించినవి కావు. **భిద్యతే** విడివడతాయి వినాశనాన్ని పొందుతాయి. **సర్వ సంశయాః** సకలమైన తెలియదగిన విషయాలు, గంగాప్రవాహం లాగా మరణాంతం వరకు లౌకికులకు కలిగే సందేహాలన్నీ **ఛిద్యన్తే** విచ్ఛేదాన్ని పొందుతాయి. మరియు ఆ సంశయాలు విచ్ఛిన్నమైన వాని యొక్క, అజ్ఞానం తొలగిన వాని యొక్క, జ్ఞానం కలగడానికి ముందు చేసిన మరియు గత జన్మలలో చేసిన వాటిలో ఫలితాలు ఇంకా పొందని, జ్ఞానోత్పత్తితో పాటు కలసి చేయబడిన **కర్మాణి** కర్మలు **క్షీయన్తే** క్షయమౌతాయి. అయితే, ప్రస్తుత జన్మను ఆరంభించిన కర్మలు వాటి ఫలాలనివ్వడంలో ప్రవృత్తమైనవి కాబట్టి, అవి మాత్రం క్షయం కావు. **తస్మిన్** అట్టి సర్వజ్ఞుని యందు, సంసారం లేని వానియందు **పరావరే** పరం అనగా కారణమైనదీ మరియు అవరం అనగా కార్యమైనదీ కూడా సాక్షాత్తుగా నేనే అనే **దృష్టే** దృష్టి వ్యక్తమౌతుంది. సంసారానికి



కారణమైనది నశించినందువల్ల, (సంసారం నుండి) విడివడతాడని అభిప్రాయం.

పైన చెప్పిన అభిప్రాయాన్నే క్లుప్తంగా రాబోయే మూడు మంత్రాలలో చెప్పబోతున్నారు.

**హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్ .**
**తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః**
**.. 2.2.10 ..**

**పరమ ప్రకాశమైన కోశంలో దోషరహితమై, విభాగరహితమైనది బ్రహ్మం. అది శుద్ధమైనది, ప్రకాశించే వాటిలోని వెలుగు. అది ఏదో దానిని ఆత్మవేత్తలు తెలియుదురు.**

## శంకరుల భాష్యం

హిరణ్మయే జ్యోతిర్మయే బుద్ధివిజ్ఞానప్రకాశే పరే కోశే కోశ ఇవాసేః . ఆత్మస్వరూపోపలబ్ధిస్థానత్వాత్పరం తత్సర్వాభ్యంతరత్వాత్ , తస్మిన్ విరజం అవిద్యాద్యశేషదోషరజోమలవర్జితం బ్రహ్మ సర్వమహత్త్వాత్సర్వాత్మత్వాచ్చ నిష్కలం నిర్గతాః కలా యస్మాత్తన్నిష్కలం నిరవయవమిత్యర్థః . యస్మాద్విరజం నిష్కలం చ అతః తచ్ఛుభ్రం శుద్ధం జ్యోతిషాం

సర్వప్రకాశాత్మనామగ్న్యాదీనామపి తజ్జ్యోతిః అవభాసకం . అగ్న్యాదీనామపి జ్యోతిష్ట్వమంతర్గతబ్రహ్మాత్మచైతన్యజ్యోతిర్నిమిత్తమిత్యర్థః . తద్ధి పరం జ్యోతిర్యదన్యానవభాస్యమాత్మజ్యోతిః, తత్ యత్ ఆత్మవిదః ఆత్మానం స్వం శబ్దాదివిషయబుద్ధిప్రత్యయసాక్షిణం యే వివేకినో విదుః విజానంతి, తే ఆత్మవిదః తద్విదుః, ఆత్మప్రత్యయానుసారిణః . యస్మాత్పరం జ్యోతిస్తస్మాత్త ఏవ తద్విదుః, నేతరే బాహ్యార్థప్రత్యయానుసారిణః ..

కథం తత్ 'జ్యోతిషాం జ్యోతిః' ఇతి, ఉచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**హిరణ్మయే** జ్యోతిర్మయములో అంటే బుద్ధియొక్క విజ్ఞానపు వెలుగులో (హృదయపద్మంలో – నారాయణ దీపికా) **పరే కోశే** కత్తి ఒర వంటి దానిలో, ఎందుకంటే ఆత్మ స్వరూపాన్ని పొందే స్థానం మరియు ఆత్మ రెండూ ఒక్కటే అయి ఉండడం చేత అది పరమమైనది. అది **విరజమ్** దోషములు లేనట్టి, అజ్ఞానం వల్ల కలిగే అనేక దోష సంపర్కాలు లేనట్టి, **బ్రహ్మ** అన్నింటికన్నా గొప్పది, అన్నింటిలోనూ ఉన్నతమైనదైనందున బ్రహ్మ అనబడేది, **నిష్కలమ్** అవయవాలతో సంబంధం లేనట్టిది అంటే అవయవ రహితమైనట్టిది అని అభిప్రాయం. దోష రహితమూ, అవయవ రహితమైనది కూడా కావడంచేత, అది **శుభ్రమ్** శుద్ధమైనది. **జ్యోతిషామ్ జ్యోతిః** అగ్ని మొదలుగాగల అన్ని ప్రకాశించే వాటన్నింటికి కూడా అదియే ప్రకాశాన్నిచ్చేది. అగ్ని మొదలైన వాటికి కూడా వాటిలోని బ్రహ్మతో ఐక్యత కలిగిన ఆత్మ చైతన్యం వల్లనే ప్రకాశత్వం కలుగుతుందని



అభిప్రాయం. ఇతరమైన ప్రకాశాల వల్ల ప్రకాశమానం కానిది ఏది కలదో అదియే పరమమైన జ్యోతి, పరంజ్యోతి. **తత్ యత్** అట్టి ఎద్దానిని **ఆత్మవిదః** ఆత్మను తెలుసుకొన్నవారు, ఆత్మవేత్తలు, అంటే తమ ఆత్మయే శబ్దాది విషయాలనే బుద్ధివృత్తులకు సాక్షియని ఏ వివేకులైతే తెలుసుకొంటారో వారు ఆత్మవిదులు. అట్టి ఎరుకగలిగిన వారు, ఆత్మవిషయ జ్ఞానాన్ని సాధించిన వారే **విదుః** తెలుసుకొంటారు. ఎందుకంటే, అదియే పరమమైన జ్యోతి కాబట్టి వారు మాత్రమే తెలుసుకొంటారు. బాహ్యవిషయాల సాధనలో నిమగ్నులైన ఇతరులు కాదు (తెలుసుకొనలేరు).

ఏ విధంగా బ్రహ్మం వెలుగులకే వెలుగు (జ్యోతిషామ్ జ్యోతిః) అయిందో చెప్తున్నారు.

**న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః .**
**తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి .. 2.2.11 ..**

అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడూ తారకలు కూడా (ప్రకాశించవు). ఈ మెరుపుకూడా భాసించదు. (ఇక) ఈ అగ్ని ఏమి ప్రకాశిస్తుంది. అది ప్రకాశిస్తేనే

సకలమూ ప్రకాశిస్తాయి. దాని ప్రకాశంలోనే ఈ సకలమూ ప్రకటనమౌతుంది.

## శంకరుల భాష్యం

న తత్ర తస్మిన్స్వాత్మభూతే బ్రహ్మణి సర్వావభాసకోఽపి సూర్యో భాతి, తద్బ్రహ్మ న ప్రకాశయతీత్యర్థః . స హి తస్యైవ భాసా సర్వమన్యదనాత్మజాతం ప్రకాశయతి ; న తు తస్య స్వతః ప్రకాశనసామర్థ్యం . తథా న చంద్రతారకం , న ఇమాః విద్యుతః భాంతి, కుతోఽయమగ్నిః అస్మద్గోచరః . కిం బహునా . యదిదం జగద్భాతి, తత్తమేవ పరమేశ్వరం స్వతో భారూపత్వాత్ భాంతం దీప్యమానం అనుభాతి అనుదీప్యతే . యథా జలముల్ముకాది వా అగ్నిసంయోగాదగ్నిం దహంతమనుదహతి, న స్వతః ; తద్వత్తస్యైవ భాసా దీప్త్యా సర్వమిదం సూర్యాది జగద్విభాతి . యత ఏవం తదేవ బ్రహ్మ భాతి చ విభాతి చ కార్యగతేన వివిధేన భాసా ; అతస్తస్య బ్రహ్మణో భారూపత్వం స్వతోఽవగమ్యతే . న హి స్వతోఽవిద్యమానం భాసనమన్యస్య కర్తుం శక్నోతి . ఘటాదీనామన్యావభాసకత్వాదర్శనాత్ భారూపాణాం చాదిత్యాదీనాం తద్దర్శనాత్ ..

యత్తజ్జ్యోతిషాం జ్యోతిర్బ్రహ్మ, తదేవ సత్యం ; సర్వం తద్వికారః వాచారంభణం వికారో నామధేయమాత్రమనృతమితరదిత్యేతమర్థం విస్తరేణ హేతుతః ప్రతిపాదితం నిగమనస్థానీయేన మంత్రేణ పునరుపసంహరతి —



## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తత్ర** అట్టి ఆత్మస్వరూపమైన బ్రహ్మమునందు, సకలాన్ని ప్రకాశింపచేసే **సూర్యః** సూర్యుడు కూడా **న భాతి** ప్రకాశించడు. అంటే సకలాన్ని ప్రకాశింపచేసే సూర్యుడు కూడా ఆ బ్రహ్మను ప్రకాశింపచేయలేడని అభిప్రాయం. అతడు (సూర్యుడు) ఆ బ్రహ్మ యొక్క ప్రకాశంతోనే సకలమైన అనాత్మ వస్తువులను ప్రకాశింపచేస్తున్నాడే కాని, అది అతని యొక్క (సూర్యుని యొక్క) స్వంతమైన ప్రకాశన సామర్థ్యం కాదు. అలాగే **న చన్ద్రతారకమ్** చంద్రుడు మరియు నక్షత్రాలు కూడా (ఆ బ్రహ్మను ప్రకాశింపచేయలేవు). **న ఇమాః విద్యుతః భాన్తి** ఈ మెరుపులు కూడా ప్రకాశించవు. **కుతః అయమ్ అగ్నిః** మనకు కనిపించే అగ్ని ఏం చేస్తుంది? ఇన్ని ఎందుకు? దేనిచే ఈ జగత్తు ప్రకాశిస్తుందో, అది **తమ్ ఏవ** ఆ పరమేశ్వరుని స్వయం ప్రకాశ స్వరూపమే కాబట్టి, **భాన్తమ్** ప్రకాశింపబడి **అనుభాతి** ప్రకటనమౌతుంది. ఎలాగైతే జలము కాని కట్టెల మంట కాని అగ్ని సంయోగం వల్ల, అగ్ని వాటిని దహిస్తే అవి వేడెక్కుతాయే కాని, వాటంతట అవి (అగ్ని సంపర్కం లేకుండా) ఉష్ణత్వాన్ని లేదా దహనశీలత్వాన్ని పొందవో, అదే విధంగా **తస్య భాసా** దాని (ఆ బ్రహ్మము) యొక్క దీప్తిలో **సర్వమ్ ఇదమ్** ఈ సమస్తమైన సూర్యుడు మొదలుగాగల జగత్తుగా **విభాతి** వివిధ రూపాలుగా ప్రకాశిస్తుంది. ఎందుకంటే, ఈ విధంగా ఆ బ్రహ్మయే తానే స్వయంగా ప్రకాశించడం తోపాటుగా తన వివిధ కార్యరూపాలుగా జగత్తులో ప్రకాశిస్తూ ఉన్నది

కాబట్టి, బ్రహ్మ యొక్క ప్రకాశ రూపం స్వస్వరూపమని గ్రహించాలి. నిజానికి, ప్రకాశత్వం తన స్వస్వరూపం కానట్లైతే ఇతరమైన వాటిని ప్రకాశవంతాలుగా చేయడం సాధ్యం కాదు. ఎందుకంటే, వెలిగే రూపాలైన సూర్యాదులలో కనిపించే ఇతర వస్తువులను ప్రకాశింపచేయడం అనే సామర్థ్యం కుండవంటి వాటిలో కనిపించదు. ఏదైతే ప్రకాశాలలోని ప్రకాశమైనట్టి బ్రహ్మయో అదియే సత్యం, యదార్థం. సర్వస్వమూ దాని యొక్క పరిణామమే. కేవలం వాక్కుతో మొదలై పేరు మాత్రమే కలిగినట్టి ఈ వికారం అంటే పరిణామైన మిగిలినదంతా అసత్యమే అని అభిప్రాయం. ఈ విధంగా విస్తృతంగా హేతుబద్ధంగా ప్రతిపాదించబడిన దానిని శ్రుతి తర్వాత మంత్రంలో మరోమారు ప్రస్తావించి ఈ విషయాన్ని ముగిస్తోంది.

**బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ .**

**అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్**
**.. 2.2.12 ..**

ఈ అవినాశిత్వం బ్రహ్మమే. ముందు-వెనుక, కుడివైపు-ఎడమవైపు, క్రిందా మరియు పైనా



(సర్వత్రా) బ్రహ్మమే. ఈ విశ్వాన్ని అతిశయించి యున్నది బ్రహ్మమే

## శంకరుల భాష్యం

బ్రహ్మైవ ఉక్తలక్షణం , ఇదం యత్ పురస్తాత్ అగ్రేఽబ్రహ్మేవావిద్యాదృష్టీనాం ప్రత్యవభాసమానం తథా పశ్చాద్బ్రహ్మ తథా దక్షిణతశ్చ తథా ఉత్తరేణ తథైవాధస్తాత్ ఊర్ధ్వం చ సర్వతోఽన్యదివ కార్యాకారేణ ప్రసృతం ప్రగతం నామరూపవదవభాసమానం . కిం బహునా, బ్రహ్మైవేదం విశ్వం సమస్తమిదం జగత్ వరిష్ఠం వరతమం . అబ్రహ్మప్రత్యయః సర్వోఽవిద్యామాత్రో రజ్జ్వామివ సర్పప్రత్యయః . బ్రహ్మైవైకం పరమార్థసత్యమితి వేదానుశాసనం ..

.. ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య
శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
ముండకోపనిషద్భాష్యే ద్వితీయం ముండకం సమాప్తం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**పురస్తాత్** ఎదురుగా అజ్ఞాన దృష్టికి బ్రహ్మము కానిదిగా అనుభవానికి వచ్చేదీ, అలాగే **పశ్చాత్** వెనుక నున్నదీ, అలాగే **దక్షిణతః** కుడివైపున అలాగే **ఉత్తరేణ** ఎడమవైపున, అలాగే **అధశ్చ** క్రింద **ఊర్ధ్వం చ** మరియు పైన సర్వత్రా వేరైనదిగా, కార్యరూపంగా **ప్రసృతమ్** నామరూపాలుగా ప్రకటనమౌతున్నదీ **బ్రహ్మ ఏవ ఇదమ్** (ముందు

మంత్రాలలో) చెప్పబడిన లక్షణాలు కల బ్రహ్మమే **అమృతమ్** శాశ్వతమైనది. ఇంతెందుకు, **ఇదమ్ విశ్వమ్** ఈ విశ్వమంతటికీ **వరిష్ఠమ్** గొప్పది **బ్రహ్మైవ** బ్రహ్మమే. బ్రహ్మము కానిదిగా అనిపించే సకలమూ, తాడుయందు పాము అని భ్రమించినట్లుగా, అవిద్య వల్ల కలిగే భ్రాంతి మాత్రమే. బ్రహ్మ మొక్కటే పరమార్థ సత్యం అని శ్రుతి ఆజ్ఞాపిస్తోంది.

{బ్రహ్మముతో జగత్తుకు ఏకత్వాన్ని ప్రదర్శించడమంటే, జగత్తును నిరాకరించడమే. 'ఆ దెయ్యం స్తంభమే' అంటే అక్కడ ఉన్నది స్తంభమే. దెయ్యం అసత్యమనియే అర్థం. అదేవిధంగా **బ్రహ్మ ఏవ ఇదమ్ విశ్వమ్** అన్నప్పుడు బ్రహ్మమాత్రమే ఉన్నది. మిగిలినది ఏదీ లేదని అభిప్రాయం. – స్వామి గంభీరానంద.}

.. శ్రీమత్ పరమహంస ప్రరివ్రాజకాచార్యులైన శ్రీగోవిందభగవత్పూజ్యపాదుల శిష్యులైన శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన ముండకోపనిషత్తు భాష్యంలోని ద్వితీయ ముండకం సమాప్తం ..



# తృతీయ ముండకము

# ప్రథమ ఖండము

## శంకరుల ఉపోద్ఘాత భాష్యం

పరా విద్యోక్తా యయా తదక్షరం పురుషాఖ్యం సత్యమధిగమ్యతే . యదధిగమే హృదయగ్రంథ్యాదిసంసారకారణస్యాత్యంతికో వినాశః స్యాత్ , తద్దర్శనోపాయశ్చ యోగో ధనురాద్యుపాదానకల్పనయోక్తః . అథేదానీం తత్సహకారీణి సత్యాదిసాధనాని వక్తవ్యానీతి తదర్థ ఉత్తరగ్రంథారంభః . ప్రాధాన్యేన తత్త్వనిర్ధారణం చ ప్రకారాంతరేణ క్రియతే . అత్యంతదురవగాహత్వాత్కృతమపి తత్ర సూత్రభూతో మంత్రః పరమార్థవస్త్వవధారణార్థముపన్యస్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఏ విద్యచేత పురుషుడు అనబడే అవినాశిత్వం యొక్క యదార్థతత్వం సాధించబడుతుందో ఆ పరా విద్య (ముందు ప్రకరణంలో) చెప్పబడింది. దేనిని సాధించడం వల్లనైతే సంసార కారణమైన హృదయంలోని చిక్కుముడి మొదలుగా గలవి పూర్తిగా నిర్మూలించబడుతున్నాయో, దానిని పొందటానికి ఉపాయంగా యోగాన్ని, ధనుస్సు మొదలైన ఉదాహరణల ద్వారా చెప్పారు. ఇక దీనికి (చెప్పబడిన ఈ యోగానికి సహాయం చేసే) సత్యము వంటి సహకార సాధనాలు చెప్పడానికి, తర్వాతి పారభాగం ప్రారంభమౌతోంది.

ప్రధానమైన తత్వాన్ని ముందు ప్రకరణాలలో నిర్ధారణ చేసి చెప్పియున్నప్పటికీ, అవగాహన చేసుకోవడం అత్యంత దుర్లభం కావడం చేత, (మరొక విధంగా) పరమార్థ వస్తువును గ్రహించడానికి సూత్రం వంటి (విషయాన్ని క్లుప్తీకరించి) మంత్రాన్ని చెప్తున్నారు.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే .**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభిచాకశీతి**
**.. 3.1.1 ..**

సదా కలిసి ఉండే రెండు పక్షులు, ఒకే పేరు కలవి, ఒకే వృక్షాన్ని అంటిపెట్టుకొని ఉన్నాయి. వాటిలో ఒకటి రుచికరమైన రావి పండును తింటున్నది. రెండవది తినకుండా చూస్తూ ఉంది.

## శంకరుల భాష్యం

ద్వా ద్వౌ, సుపర్ణా సుపర్ణౌ శోభనపతనౌ సుపర్ణౌ, పక్షిసామాన్యాద్వా సుపర్ణౌ, సయుజా సయుజౌ సహైవ సర్వదా యుక్తౌ, సఖాయా సఖాయౌ సమానాఖ్యానౌ సమానాభివ్యక్తికారణౌ, ఏవంభూతౌ సంతౌ సమానం అవిశేషముపలబ్ధ్యధిష్ఠానతయా, ఏకం వృక్షం వృక్షమివోచ్ఛేదసామాన్యాచ్ఛరీరం వృక్షం పరిషస్వజాతే పరిష్వక్తవంతౌ . సుపర్ణావివైకం వృక్షం ఫలోపభోగార్థం .



అయం హి వృక్ష ఊర్ధ్వమూలోఽవాక్శాఖోఽశ్వత్థోఽవ్యక్తమూలప్రభవః క్షేత్రసంజ్ఞకః సర్వప్రాణికర్మఫలాశ్రయః, తం పరిష్వక్తవంతౌ సుపర్ణావివ అవిద్యాకామకర్మవాసనాశ్రయలింగోపాధ్యాత్మేశ్వరౌ . తయోః పరిష్వక్తయోః అన్యః ఏకః క్షేత్రజ్ఞో లింగోపాధివృక్షమాశ్రితః పిప్పలం కర్మనిష్పన్నం సుఖదుఃఖలక్షణం ఫలం స్వాదు అనేకవిచిత్రవేదనాస్వాదరూపం స్వాదు అత్తి భక్షయత్యుపభుంక్తే అవివేకతః . అనశ్నన్ అన్యః ఇతరః ఈశ్వరో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః సర్వజ్ఞః సత్త్వోపాధిరీశ్వరో నాశ్నాతి . ప్రేరయితా హ్యసావుభయోర్భోజ్యభోక్త్రోర్నిత్యసాక్షిత్వసత్తామాత్రేణ . స తు అనశ్నన్ అన్యః అభిచాకశీతి పశ్యత్యేవ కేవలం . దర్శనమాత్రం హి తస్య ప్రేరయితృత్వం రాజవత్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ద్వా** ('ద్వౌ' అని తీసుకోవాలి) రెండు **సుపర్ణా** ('సుపర్ణౌ' అని తీసుకోవాలి) చక్కటి సంబంధాన్ని కలవి {పరిమిత జ్ఞానం కలిగిన జీవుడు సర్వజ్ఞుడైన ఈశ్వరుని ఆధీనంలో ఉన్నాడు. ఇదే వారిద్దరిని కలిపి ఉంచేది} లేదా అందమైన రెక్కలు గల రెండు సాధారణ పక్షులు, **సయుజా** ('సయుజౌ' అని తీసుకోవాలి) ఎల్లప్పుడూ కలిసే ఉండేవి, **సఖాయా** ('సఖాయౌ' అని తీసుకోవాలి) అంటే ఒకే విధంగా అభివ్యక్తమైనందు చేత ఒకే పేరు గలవి, విశేషణ రహితమైన ఒకే అధిష్ఠానం నుండి రూపొందడంచేత ఆవిధమైన లక్షణాలు కలిగినవి, **సమానమ్ వృక్షమ్** చెట్టువంటి విచ్ఛినత్వమనే సాధారణ ధర్మం కలిగిన ఒకే సంసార వృక్షాన్ని **పరిషస్వజాతే** అంటిపెట్టుకొని లేదా ఆశ్రయించి

ఉన్నాయి. ఫలాలను భోగించేందుకు పక్షులలాగా ఒకే చెట్టును (ఆశ్రయించి ఉన్నాయి). వేర్లు పైన, కొమ్మలు క్రింద ఉన్నట్టి ఈ అశ్వత్థ వృక్షం, అవ్యక్తం కారణంగా పుట్టి, క్షేత్రమనే సంజ్ఞ కలది, సకల ప్రాణుల కర్మఫలాలకు ఆశ్రమైనట్టిది. జీవాత్మ-పరమాత్మలు అవిద్యవల్ల కలిగిన కోరికల చేత చేయబడిన కర్మయొక్క వాసనాభూతమైన లింగశరీరాన్ని (సంసారమనబడే వృక్షాన్ని) పక్షులలాగా అంటిపెట్టుకొనియున్నాయి. వాటిలో, ఆ సంసారవృక్షాన్ని అంటిపెట్టుకొనిన వాటిలో **అన్యః** ఒకటి లింగశరీర ఉపాధిని ఆశ్రయించిన క్షేత్రజ్ఞుడు **పిప్పలమ్** కర్మవల్ల జనించిన సుఖదుఃఖ లక్షణాలు కలిగిన ఫలాన్ని **స్వాదు** అనేక విచిత్రమైన రుచులనే మానసిక అనుభవాల రూపమైనదాన్ని అత్తి వివేకం లేకపోవడం చేత తింటోంది, అనుభవిస్తోంది. అనశ్నన్ అన్యః రెండవది అంటే నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావం కలిగినవాడు, సర్వజ్ఞుడు, మాయను తన ఉపాధిగా చేసుకొన్నట్టి ఈశ్వరుడు రుచి చూడడం లేదు. ఎందుకంటే, ఈశ్వరుడు శాశ్వతంగా సాక్షిమాత్రంగా ఉనికి కలవాడు, భోజ్యము-భోక్త రెండూ తానే అయినవాడు కాబట్టి. ఆతడైతే, అంటే ఆ రెండవాడైతే, ఫలాన్ని అనుభవించకుండా **అభిచాకశీతి** కేవలం చూస్తూ ఉంటాడు. రాజువలే కేవలం చూడటం చేతనే నియంత్రిస్తాడని అభిప్రాయం.



**సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః .**
**జుష్టం యదా పశ్యత్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః**
**.. 3.1.2 ..**

ఒకే వృక్షం మీద, జీవుడు (సంసారంలో) నిమగ్నుడై సమర్థత లేనివానిలా భ్రమకు లోనై శోచిస్తూ, ఎప్పుడైతే పక్కనున్న ఈశ్వరుడిని చూసి ఇది (ఈ సంసారం) ఆతని మహిమే అని గుర్తిస్తాడో అప్పుడు శోకం తొలగినవాడౌతాడు.

## శంకరుల భాష్యం

తత్రైవం సతి సమానే వృక్షే యథోక్తే శరీరే పురుషః భోక్తా జీవోఽవిద్యాకామకర్మఫలరాగాదిగురుభారాక్రాంతోఽలాబురివ సాముద్రే జలే నిమగ్నః నిశ్చయేన దేహాత్మభావమాపన్నోఽయమేవాహమముష్య పుత్రోఽస్య నప్తా కృశః స్థూలో గుణవాన్నిర్గుణః సుఖీ దుఃఖీత్యేవంప్రత్యయో నాస్త్యన్యోఽస్మాదితి జాయతే మ్రియతే సంయుజ్యతే వియుజ్యతే చ సంబంధిబాంధవైః, అతః అనీశయా, న కస్యచిత్సమర్థోఽహం పుత్రో మమ వినష్టో మృతా మే భార్యా కిం మే జీవితేనేత్యేవం దీనభావోఽనీశా, తయా శోచతి సంతప్యతే ముహ్యమానః అనేకైరనర్థప్రకారైరవివేకితయా

అంతశ్చింతామాపద్యమానః స ఏవం ప్రేతతిర్యఙ్మనుష్యాదియోనిష్వాజవంజవీభావమాపన్నః కదాచిదనేకజన్మసు శుద్ధధర్మసంచితనిమిత్తతః కేనచిత్పరమకారుణికేన దర్శితయోగమార్గః అహింసాసత్యబ్రహ్మచర్య సర్వత్యాగశమదమాదిసంపన్నః సమాహితాత్మా సన్ జుష్టం సేవితమనేకైర్యోగమార్గైః కర్మిభిశ్చ యదా యస్మిన్కాలే పశ్యతి ధ్యాయమానః అన్యం వృక్షోపాధిలక్షణాద్విలక్షణం ఈశం అసంసారిణమశనాయాపిపాసాశోకమోహ జరామృత్యత్వతీతమీశం సర్వస్య జగతోఽయమహమస్మ్యాత్మా సర్వస్య సమః సర్వభూతస్థో నేతరోఽవిద్యాజనితోపాధిపరిచ్ఛిన్నో మాయాత్మేతి మహిమానం విభూతిం చ జగద్రూపమస్యైవ మమ పరమేశ్వరస్య ఇతి యదైవం ద్రష్టా, తదా వీతశోకః భవతి సర్వస్మాచ్ఛోకసాగరాద్విప్రముచ్యతే, కృతకృత్యో భవతీత్యర్థః ..

అన్యోఽపి మంత్ర ఇమమేవార్థమాహ సవిస్తరం —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఇది ఈ విధంగా ఉండగా, **సమానే వృక్షే** ఒకే వృక్షంమీద, అంటే ముందు చెప్పబడినట్లుగా శరీరంలో **పురుషః** భోక్త అయిన జీవుడు అజ్ఞానం-కోరిక-కర్మ-ఫలం-రాగం మొదలైన వాటి భారంతో సముద్ర జలాలలో మునిగిన తాబేటికాయలాగా మునిగియున్నవాడై, నేను ఫలాని వాని పుత్రుడిని, ఫలాని వాని మనుమడిని, సన్నగా లావుగా ఉన్నవాడిని, నాకు ఈ గుణాలున్నాయి, ఈ గుణాలు లేవు, సుఖిస్తున్నాను, దుఃఖిస్తున్నాను అని పలువిధాలుగా దేహమే ఆత్మయనే భావాన్ని పొందుతూ, తన ఈ



స్వభావం తప్ప మరొకటి లేదనుకొంటూ, జన్మిస్తూ-మరణిస్తూ, తనతో సంబంధం కలిగిన బంధువులతో కలుస్తూ-విడిపోతూ ఉంటూ, అప్పుడు **అనీశయా** నేనెందుకూ సమర్థుడను కాను అనే నిరాశకు లోనవుతూ, నా పుత్రుడిని కోల్పోయాను, నా భార్య మరణించింది, ఇక నా జీవితం ఎందుకు, అనే విధమైన దీనభావనతో ఉండుటే ‘అనీశా’ అంటే అర్థం. ఆవిధంగా **మోహమానః** అవివేకంతో అనేకవిధాలైన అనర్థాలగురించి లోలోపల విచారిస్తూ **శోచతి** సంతాపాన్ని పొందుతున్నాడు. అతడు (ఆ జీవుడు) ఆవిధంగా లెక్కలేనన్ని జన్మలలో ప్రేత, జంతు, మానవుడు మొదలైన యోనులలో జన్మించుట అనే హీనత్వాన్ని పొందుతూ ఉండగా, ప్రోగుపడిన పుణ్యకర్మల కారణంగా, ఒకప్పుడు ఒక పరమ దయామయుని వల్ల యోగమార్గాన్ని దర్శించినవాడు, అహింస-సత్యం-బ్రహ్మచర్యం-సర్వత్యాగం-శమ-దమ మొదలైన లక్షణాలు నిండినవాడు, ఆత్మయందు ఏకాగ్రమైన చిత్తం కలిగినవాడై **జుష్టమ్** అనేకమైన యోగమార్గాలను అనుసరించే వారు మరియు కర్మిష్ఠులు కూడా సేవించే **అన్యమ్** వృక్షమనే సంసార లక్షణానికి భిన్నమైన లక్షణం కలిగిన **ఈశమ్** సంసారికాని ఆకలి-దాహం శోకం-మోహం జన్మ-మృత్యువు అనేవాటికి అతీతుడైన సకల జగత్తుకు శాసకుడై, ‘ఈ సకలానికి ఆత్మరూపుడను, సర్వభూతాలన్నింటిలో ఒకేలా సమంగా ఉన్నవాడిని, అజ్ఞానం కారణంగా కలిగే ఉపాధి భేదత్వంతో కూడిన మాయను కాను’, అనే భావన కలిగిన ఈశ్వరుడిని, **అస్య** అతని యొక్క **మహిమానమ్** ఈ రూపజగత్తు అంతా పరమేశ్వరునిదే, ఆతని

మహిమ లేదా విభూతి లేదా గొప్పదనమేనని, **యదా** ఎప్పుడైతే **పశ్యతి** దర్శిస్తాడో ఇలా ఎప్పుడైతే దర్శిస్తాడో అప్పుడు **వీతశోకః** శోకం తొలగినవాడౌతాడు. సమస్తమైన శోకసముద్రం నుండి విడివడినవాడౌతాడు. కృతకృత్యుడౌతాడు అని అభిప్రాయం.

మరొక మంత్రం కూడా ఇదే విషయాన్ని మరింత వివరంగా చెప్తోంది.

**యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ .**
**తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి .. 3.1.3 ..**

ఎప్పుడైతే ద్రష్ట బంగారువర్ణం కలిగిన సృష్టికర్తను, ఈశ్వరుడిని, పురుషుడిని, అపర బ్రహ్మకు కారణమైన వానిని దర్శిస్తాడో, అప్పుడు ఆ విద్వాంసుడు పుణ్య పాపలను దులిపేసుకుని, ఎటువంటి వాసనలు లేనివాడై సర్వోత్కృష్టమైన సమత్వాన్ని పొందుతాడు.



## శంకరుల భాష్యం

యదా యస్మిన్కాలే పశ్యః పశ్యతీతి విద్వాన్ సాధక ఇత్యర్థః . పశ్యతే పశ్యతి పూర్వవత్ , రుక్మవర్ణం స్వయంజ్యోతిఃస్వభావం రుక్మస్యేవ వా జ్యోతిరస్యావినాశి ; కర్తారం సర్వస్య జగతః ఈశం పురుషం బ్రహ్మయోనిం బ్రహ్మ చ తద్యోనిశ్చాసౌ బ్రహ్మయోనిస్తం బ్రహ్మయోనిం బ్రహ్మణో వా అపరస్య యోనిం స యదా చైవం పశ్యతి, తదా స విద్వాన్పశ్యః పుణ్యపాపే బంధనభూతే కర్మణీ సమూలే విధూయ నిరస్య దగ్ధ్వా నిరంజనః నిర్లేపో విగతక్లేశః పరమం ప్రకృష్టం నిరతిశయం సామ్యం సమతామద్వయలక్షణాం ; ద్వైతవిషయాణి సామ్యాన్యతః అర్వాంచ్యేవ, అతోఽద్వయలక్షణమేతత్ పరమం సామ్యముపైతి ప్రతిపద్యతే ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యదా** ఎప్పుడైతే **పశ్యః** దర్శనాన్ని పొందేవాడు, అంటే విద్వాంసుడు లేదా సాధకుడు అని అర్థం. **పశ్యతే** ఇంతకు ముందు వివరించినట్లుగా (పూర్వ మంత్రంలో చెప్పినట్లుగా) దర్శిస్తాడో, **రుక్మవర్ణమ్** రుక్మమనగా స్వయం ప్రకాశక స్వభావాన్ని లేదా నశించని స్వభావం కల ప్రకాశాన్ని, **కర్తారమ్** సకల జగత్తును సృష్టించిన వానిని, **ఈశమ్** శాసకుడైన వానిని **పురుషమ్** పురుషుడిని **బ్రహ్మయోనిమ్** బ్రహ్మ మరియు దానికి మూలమైనది 'బ్రహ్మయోని' లేదా అపర బ్రహ్మకు మూలమైనదానిని, సాధకుడు ఎప్పుడైతే ఆ విధంగా (ముందటి మంత్రంలో చెప్పినట్లుగా) చూస్తాడో, **తదా** అప్పుడు **విద్వాన్** ఆ విద్వాంసుడు **పుణ్యపాపే** బంధనరూపాలైన కర్మలను సమూలంగా

**విధూయ** విదిలించుకొని, దహింపచేసి **నిరఞ్జన** క్లేశముల ఆనవాళ్లు లేనివాడై **పరమమ్** సర్వోత్కృష్టమైన, అన్నింటినీ మించినట్టి **సామ్యమ్** అద్వయ లక్షణంకల సమానత్వాన్ని, **ఉపైతి** పొందుతాడు. ద్వైత విషయంగా చెప్పబడే సమానత్వం దీనికన్నా తక్కువ స్థాయిది కాబట్టి, అద్వయ లక్షణం కలిగన సమానత్వమే ఉత్తమమైనది. అటువంటి ఉన్నతమైన, ఉత్తమమైన సమానత్వాన్ని పొందుతాడు.

**ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి విజానన్విద్వాన్భవతే నాతివాదీ .**

**ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః**

**.. 3.1.4 ..**

సమస్తమైన ప్రాణులలో ఏ ప్రాణమైతే వివిధ రకాలుగా ప్రకాశిస్తోందో అది ఇదియే. తెలిసికొన్న విద్వాంసుడు ఎక్కువగా (అవసరాన్ని మించి) మాట్లాడడు. ఆత్మయందే క్రీడిస్తూ, ఆత్మయందే రమిస్తూ క్రియాశీలుడై ఉండే ఇతడే బ్రహ్మవేత్తలందరిలోకి ఉత్తముడు.



## శంకరుల భాష్యం

కించ, యోఽయం ప్రాణస్య ప్రాణః పర ఈశ్వరః హి ఏషః ప్రకృతః సర్వభూతైః సర్వైర్భూతైః బ్రహ్మాదిస్తంబపర్యంతైః ; ఇత్థంభూతలక్షణా తృతీయా . సర్వభూతస్థః సర్వాత్మా సన్నిత్యర్థః . విభాతి వివిధం దీప్యతే . ఏవం సర్వభూతస్థం యః సాక్షాదాత్మభావేనాయమహమస్మీతి విజానన్ విద్వాన్ వాక్యార్థజ్ఞానమాత్రేణ న భవతే న భవతీత్యేతత్ . కిం ? అతివాదీ అతీత్య సర్వానన్యాన్వదితుం శీలమస్యేత్యతివాదీ . యస్త్వేవం సాక్షాదాత్మానం ప్రాణస్య ప్రాణం విద్వాన్ , సోఽతివాదీ న భవతీత్యర్థః . సర్వం యదా ఆత్మైవ నాన్యదస్తీతి దృష్టం , తదా కిం హ్యసావతీత్య వదేత్ . యస్య త్వపరమన్యద్దృష్టమస్తి, స తదతీత్య వదతి . అయం తు విద్వాన్నాత్మనోఽన్యత్పశ్యతి ; నాన్యచ్ఛృణోతి ; నాన్యద్విజానాతి . అతో నాతివదతి . కించ, ఆత్మక్రీడః ఆత్మన్యేవ క్రీడా క్రీడనం యస్య నాన్యత్ర పుత్రదారాదిషు, స ఆత్మక్రీడః . తథా ఆత్మరతిః ఆత్మన్యేవ రతీ రమణం ప్రీతిర్యస్య, స ఆత్మరతిః . క్రీడా బాహ్యసాధనసాపేక్షా ; రతిస్తు సాధననిరపేక్షా బాహ్యవిషయప్రీతిమాత్రమితి విశేషః . తథా క్రియావాన్ జ్ఞానధ్యానవైరాగ్యాదిక్రియా యస్య సోఽయం క్రియావాన్ . సమాసపాఠే ఆత్మరతిరేవ క్రియాస్య విద్యత ఇతి బహువ్రీహిమతుబర్థయోరన్యతరోఽతిరిచ్యతే . కేచిత్త్వగ్నిహోత్రాదికర్మబ్రహ్మవిద్యయోః సముచ్చయార్థమిచ్ఛంతి . తచ్చైష బ్రహ్మవిదాం వరిష్ఠ ఇత్యనేన ముఖ్యార్థవచనేన విరుధ్యతే . న హి బాహ్యక్రియావానాత్మక్రీడ ఆత్మరతిశ్చ భవితుం శక్తః . క్వచిద్బాహ్యక్రియావినివృత్తో హ్యాత్మక్రీడో భవతి బాహ్యక్రియాత్మక్రీడయోర్విరోధాత్ . న హి తమఃప్రకాశయోర్యుగపదేకత్ర స్థితిః సంభవతి . తస్మాదసత్ప్రలపితమేవైతదనేన జ్ఞానకర్మసముచ్చయప్రతిపాదనం

. ‘అన్యా వాచో విముంచథ’ (ము. ఉ. 2 . 2 . 5) ‘సంన్యాసయోగాత్’ (ము. ఉ. 3 . 2 . 6) ఇత్యాదిశ్రుతిభ్యశ్చ . తస్మాదయమేవేహ క్రియావాన్యో జ్ఞానధ్యానాదిక్రియావానసంభిన్నార్యమర్యాదః సంన్యాసీ . య ఏవంలక్షణో నాతివాద్యాత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్బ్రహ్మనిష్ఠః, స బ్రహ్మవిదాం సర్వేషాం వరిష్ఠః ప్రధానః ..

అధునా సత్యాదీని భిక్షోః సమ్యగ్జ్ఞానసహకారీణి సాధనాని విధీయంతే నివృత్తిప్రధానాని —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, **ప్రాణః** ప్రాణానికే ప్రాణమైన **హి ఏషః** ప్రస్తావించ బడుతున్న పరమేశ్వరుడు **యః** ఎవరైతే యున్నాడో ఆతడు **సర్వభూతైః** సమస్తమైన ప్రాణులలో, బ్రహ్మము నుండి గడ్డిపరక వరకూ కల ప్రాణులలో, అంటే సకల ప్రాణులలో ఆత్మగా ఉండేవాడు అనే అభిప్రాయంతో ప్రాణుల స్థితిని సూచిస్తూ ఇక్కడ తృతీయా విభక్తిని వాడుతున్నారు. **విభాతి** వేర్వేరుగా ప్రకాశిస్తున్నాడు. ఈ విధంగా సకల ప్రాణులలో ఉండి సాక్షాత్తుగా వాటి ఆత్మ తానే అని **విజానన్** తెలుసుకొన్న **విద్వాన్** విద్వాంసుడు. **న భవతే** (‘న భవతి’ అని తీసుకోవాలి) కాడు. ఏమి కాడు? **అతివాదీ** అతిగా మాట్లాడేవాడు కాడు. కేవలం వాక్యానికి అర్థాన్ని మాత్రమే గ్రహించిన వాడు (అనుభవ జ్ఞానం లేని వాడు) అతివాది అవుతాడు. అతివాది అంటే మాటలలో ఇతరులందరినీ మించిన వాడని అర్థం. కాని, ఈవిధంగా ప్రాణానికి ప్రాణమైనది సాక్షాత్తుగా ఆత్మయేనని అనుభవాన్ని పొందిన



విద్వాంసుడయితే అతివాది కానేరడు అని అర్థం. ఎప్పుడైతే సర్వమూ ఆత్మయేననీ, వేరొటకి ఏదీ లేదని దర్శిస్తాడో, అప్పుడు అంతకు మించి ఎక్కువగా ఏమి మాట్లాడతాడు? ఎవనికైతే ఆ పరమం కానిది వేరొకటి కనిపిస్తుందో, అతడు దానిని మించి మాట్లాడతాడు. విద్వాంసుడైతే ఆత్మకు అన్యంగా మరొక దానిని దర్శించడు, వేరొక దానిని వినడు, వేరొకదానిని ఆలోచించడు. అందుచేత ఆత్మను మించి మాట్లాడడు. మరింకా, **ఆత్మక్రీడః** ఎవడైతే భార్యాపుత్రులు మరియు ఇతరులతో కాకుండా తన ఆత్మయందు మాత్రమే క్రీడిస్తాడో, ఆటలాడుతాడో అతడు ఆత్మక్రీడుడు. అలాగే, **ఆత్మరతిః** ఆత్మయందు మాత్రమే రమిస్తాడు ప్రీతిని పొందుతాడో అతడు ‘ఆత్మరతిః’. క్రీడకు బాహ్యాసాధనాల అవసరం ఉంటుంది. రమించడం అయితే బాహ్య సాధనాల అవసరం ఉండదు. కేవలం బాహ్యావిషయాల పట్ల ప్రియత్వం మాత్రమే ఉంటుంది. అలాగే, **క్రియావాన్** జ్ఞానం-ధ్యానం-వైరాగ్యం మొదలైన క్రియలు ఎవనికి ఉంటాయో అతడు క్రియావంతుడు. ఆత్మరతిక్రియః అని రెండు పదాలను బహువ్రీహి సమాసంగా చేస్తే ఆత్మయందు రమించడమనే క్రియకలవాడని అర్థం వస్తుంది. అపుడు మతుప్-ప్రత్యయం (క్రియావాన్ అన్నదాంట్లో ‘వాన్’ గా వచ్చి చేరేది) అదనంగా (ప్రయోగించినట్లు) అవుతుంది. (అందుచేత, క్రియావాన్ అంటే జ్ఞాన-ధ్యాన-వైరాగ్యాది క్రియలు కలవాడనే అర్థాన్ని తీసుకోవడమే సమంజసమౌతుంది). కొంతమంది అగ్నిహోత్రాది కర్మలకు మరియు బ్రహ్మవిద్యకు సముచ్చాయాన్ని (రెండింటినీ కలిపి అభ్యసించడమనే)

అర్థాన్ని ప్రకటిస్తారు. కాని ఇది 'ఏషః బ్రహ్మవిదాం వరిష్ఠః' వంటి ముఖ్యార్థాన్ని ప్రకటించే వాక్యాలకు విరుద్ధం. బాహ్యక్రియలున్నవానికి ఆత్మక్రీడ మరియు ఆత్మరతి ఉండటం సాధ్యపడదు. బాహ్యక్రియలకు, ఆత్మక్రీడకు విరోధం ఉండటం చేత, బాహ్యక్రియలనుండి విరమించిన వానికి మాత్రమే ఆత్మక్రీడ సంభవిస్తుంది. చీకటి-వెలుగులు ఒకేసారి ఒకేచోట ఉండటం సంభవం కాదు. అందువలన, జ్ఞానానికి కర్మలతో సంబంధాన్ని ప్రతిపాదించడం అనేది అసత్య ప్రేలాపన మాత్రమే. 'ఇతర వాదనలు విడిచిపెట్టు' ['అన్యా వాచో విముంచథ' (ము.ఉ. 2-2-5)]; 'సంన్యాస ఆశ్రమం నుండియే' ['సంన్యాసయోగాత్' (ము.ఉ. 3-2-6)] అని శ్రుతి కూడా చెప్తోంది. అందుచేత, జ్ఞాన-ధ్యానాదులనే క్రియలు కలిగి నియమ ప్రమాణతలను ఉల్లఘించని సంన్యాసియనియే ఇక్కడ క్రియావాన్ అంటే అర్థం. **ఏషః** ఇతడే అంటే, అతివాదీ, ఆత్మక్రీడ, ఆత్మరతి, క్రియావాన్ వంటి లక్షణాలు కలిగి బ్రహ్మమందే నిష్ఠ కలిగినవాడే, **బ్రహ్మవిదామ్** బ్రహ్మవేత్తలందరిలోకి **వరిష్ఠః** ప్రధానమైనవాడు లేదా ముఖ్యుడు.

ఇప్పుడు, సత్యము మొదలైన సమ్యక్-జ్ఞానం పొందటంలో సంన్యాసికి సహకరించి ప్రధానమైన సాధనాలను విధిస్తున్నారు.

**సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ .**



**అన్తఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః .. 3.1.5 ..**

దేనిని దోషాలు నశించిన యతులు దేహం లోపల వెలుగుతోనిండిన దానిగా స్వచ్ఛమైనదిగా చూస్తారో, అట్టి ఈ ఆత్మ నిత్యమూ (ఆచరించబడే) సత్యంతోనూ, తపస్సుతోనూ, సంపూర్ణమైన జ్ఞానంతోనూ, బ్రహ్మచర్యంతోనూ నిశ్చయంగా లభిస్తుంది.

## శంకరుల భాష్యం

సత్యేన అనృతత్యాగేన మృషావదనత్యాగేన లభ్యః ప్రాప్తవ్యః . కించ, తపసా హీంద్రియమనఏకాగ్రతయా . 'మనసశ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః' (మో. ధ. 250 . 4) ఇతి స్మరణాత్ . తద్ధ్యనుకూలమాత్మదర్శనాభిముఖీభావాత్పరమం సాధనం తపో నేతరచ్చాంద్రాయణాది . ఏష ఆత్మా లభ్య ఇత్యనుషంగః సర్వత్ర . సమ్యగ్జ్ఞానేన యథాభూతాత్మదర్శనేన బ్రహ్మచర్యేణ మైథునాసమాచారేణ . నిత్యం సర్వదా ; నిత్యం సత్యేన నిత్యం తపసా నిత్యం సమ్యగ్జ్ఞానేనేతి సర్వత్ర నిత్యశబ్దోఽన్తర్దీపికాన్యాయేనానుషక్తవ్యః . వక్ష్యతి చ 'న యేషు జిహ్మమనృతం న మాయా చ' (ప్ర. ఉ. 1 . 16) ఇతి . క్వాసావాత్మా య ఏతైః సాధనైర్లభ్య ఇత్యుచ్యతే — అంతఃశరీరేఽన్తర్మధ్యే శరీరస్య పుండరీకాకాశే జ్యోతిర్మయో హి

రుక్మవర్ణః శుభ్రః శుద్ధో యమాత్మానం పశ్యంతి ఉపలభంతే యతయః యతనశీలాః సంన్యాసినః క్షీణదోషాః క్షీణక్రోధాదిచిత్తమలాః, స ఆత్మా నిత్యం సత్యాదిసాధనైః సంన్యాసిభిర్లభ్యత ఇత్యర్థః . న కాదాచిత్కైః సత్యాదిభిర్లభ్యతే . సత్యాదిసాధనస్తుత్యర్థోఽయమర్థవాదః ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**సత్యేన** అసత్యాన్ని విడిచిపెట్టడం చేత, అంటే భ్రమను తొలగించుకోవడం చేత **లభ్యః** ప్రాప్తమయ్యేది. మరింకా, **తపసా హి** ఇంద్రియాలను మనసును ఏకాగ్రం చేయడం ద్వారా. 'మనసు మరియు ఇంద్రియాలను ఏకాగ్రం చేయడమే ఉన్నతమైన తపస్సు' ['మనసశ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః' (మో.ధ. 250-4)] అన్న స్మృతి వాక్యం ఇందుకు ప్రమాణం. ఆత్మదర్శనాభిముఖత్వానికి అనుకూలమైన సాధనాలలో తపస్సు ఉత్తమమైనది కాని చాంద్రాయణాది కర్మలు కావు. 'ఏష ఆత్మా లభ్య' అన్నదానిని అన్నింటికీ (చెప్పబోయే అన్ని సాధనాలకు చేర్చి) చెప్పినట్లే భావించాలి. **సమ్యగ్-జ్ఞానేన** పరిపూర్ణమైన జ్ఞానంచేత, అంటే ఆత్మ యొక్క యదార్థతత్వాన్ని గ్రహించడం చేత, **బ్రహ్మచర్యేణ** బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించడం ద్వారా. **నిత్యమ్** అన్నివేళలా. సర్వదా సత్యంచేత, సర్వదా తపస్సుచేత, సర్వదా పరిపూర్ణ జ్ఞానంచేత అని అన్నిచోట్లా నిత్య శబ్దాన్ని, మధ్యలోనున్న దీపం కాంతిని నలుదెసలా ప్రసరించిన రీతిలో, అంతర్భాగంగా గ్రహించాలి. 'ఎవరిలో వంచన,



అసత్యం మరియు మోసం ఉండవో' ['న యేషు జిహ్మమనృతం న మాయా చ' (ప్ర.ఉ. 1-16)] అని ప్రశ్నోపనిషత్తు చెప్తోంది కూడా. ఈ సాధనాల వల్ల లభించే ఆత్మ ఏది అన్నది చెప్తున్నారు. **అంతఃశరీరే** దేహానికి మధ్యలోని పద్మాకాశంలో **జ్యోతిర్మయో హి** వెలుగుతో నిండి బంగారువర్ణంలో **శుభ్రః** స్వచ్ఛమైనట్టి **యమ్** ఏ ఆత్మను **క్షీణదోషాః** క్రోధం వంటి మనోదోషాలు నశించిన **యతయః** యతులు అంటే సాధకులు **పశ్యన్తి** దర్శిస్తారు లేదా పొందుతారు. ఆ ఆత్మ నిరంతరంగా అభ్యసించే సత్యం మొదలైన సాధనలచేత సంన్యాసులకు లభిస్తుంది కాని ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే అభ్యసించే సత్యాది సాధనల వల్ల లభించదని అభిప్రాయం. సత్యాది సాధనాల ఘనతను శ్లాఘించే నిమిత్తం (ఈ క్రింది మంత్రంలో) వాటి అర్థాన్ని మరింత వివరిస్తున్నారు.

**సత్యమేవ జయతే నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః .**
**యేనాఽఽక్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ .. 3.1.6 ..**

సత్యమే జయిస్తుంది. అసత్యం కాదు (జయించదు). కోరికలు తీరిన ఋషులు ఏ దారిన పయనించి ఎక్కడ ఆ సత్యం యొక్క పరమ పదాన్ని చేరుతారో ఆ దివ్య మార్గం సత్యం చేతనే నిర్మితమౌతుంది.

## శంకరుల భాష్యం

సత్యమేవ సత్యవానేవ జయతే జయతి, నానృతం నానృతవాదీత్యర్థః . న హి సత్యానృతయోః కేవలయోః పురుషానాశ్రితయోః జయః పరాజయో వా సంభవతి . ప్రసిద్ధం లోకే సత్యవాదినానృతవాద్యభిభూయతే న విపర్యయః ; అతః సిద్ధం సత్యస్య బలవత్సాధనత్వం . కించ, శాస్త్రతోఽప్యవగమ్యతే సత్యస్య సాధనాతిశయత్వం . కథం ? సత్యేన యథాభూతవాదవ్యవస్థయా పంథాః దేవయానాఖ్యః వితతో విస్తీర్ణః సాతత్యేన ప్రవృత్తః . యేన పథా హి అక్రమంతి ఆక్రమంతే ఋషయః దర్శనవంతః కుహకమాయాశాఠ్యాహంకార దంభానృతవర్జితా హ్యాప్తకామాః విగతతృష్ణాః సర్వతో యత్ర యస్మిన్ , తత్పరమార్థతత్త్వం సత్యస్య ఉత్తమసాధనస్య సంబంధి సాధ్యం పరమం ప్రకృష్టం నిధానం పురుషార్థరూపేణ నిధీయత ఇతి నిధానం వర్తతే . తత్ర చ యేన పథా ఆక్రమంతి, స సత్యేన వితత ఇతి పూర్వేణ సంబంధః ..

కిం తత్కింధర్మకం చ తదిత్యుచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**సత్యమేవ** సత్యవంతుడు మాత్రమే **జయతే** విజయాన్ని సాధిస్తాడు. **న అనృతమ్** అసత్యవాది సాధించడని అభిప్రాయం. ఎందుకంటే, పురుషుడిని ఆశ్రయించకుండా, కేవలం సత్యం-అసత్యం వాటంతటవే, జయ-అపజయాలను పొందవు. సత్యవాది అసత్యవాదిని జయించడమనేది లోక ప్రసిద్ధమైన విషయం కాని, అందుకు వ్యతిరేకమైనది (అంటే అసత్యవాది సత్యవాదిని జయించడమనేది) ప్రసిద్ధమైన విషయం కాదు. అందుచేత,



సత్యమనేది బలమైన సాధనమని నిరూపణ అవుతోంది. మరింకా, శాస్త్రం ద్వారా కూడా సత్యం యొక్క గొప్పదనాన్ని అర్థం చేసుకోవచ్చు. ఎలా? **సత్యేన** ఎలా ఉన్నదాన్ని అలా చెప్పడం ద్వారా **దేవయానః** దేవతామార్గం అని పిలువబడే **విततః** విస్తరించిన, శాశ్వతంగా ఏర్పడిన **పన్థాః** మార్గాన్ని. **యేన** ఏ మార్గాన్ని **అక్రమన్తి** అధిరోహించి **ఋషయః** దర్శనశీలురు, అంటే వంచన- మోహం-లోభం-అహంకారం-దంభం-అసత్యం వంటివి తొలగిన **హి ఆప్తకామాః** సమస్తమైన కోరికలనుండి విడివడిన వారు, **యత్ర** ఎక్కడ, **తత్** ఆ పరమార్థమైన **సత్యస్య** ఉత్తమమైన సత్యమనే సాధనం చేత సాధించబడే **పరమమ్** పరమోన్నతమైన **నిధానమ్** పురుషార్థం రూపంగా ప్రోగుపడియున్నది కాబట్టి నిధానం, స్థానంలో ప్రతిష్ఠితులై ఉంటారో, అంటే ఏ మార్గమైతే సత్యం చేత నిర్మితమై విస్తరించి యున్నదో ఆ మార్గం ద్వారానే అని ముందు చెప్పినదానితో సంబంధం చెప్పుకోవాలి. (అంటే సత్యాన్ని పాటించడమనేదే అత్యుత్తమమైన సాధన. ఆ సాధన ద్వారానే సాధకునికి పరమపదాన్ని చేరుకొనే విస్తారమైన దేవమార్గం గోచరిస్తుంది. ఈ మార్గం ద్వారానే ఎంతోమంది ఋషులు అత్యున్నతమైన ఆ పరమపదాన్ని చేరుకొన్నారు. కాబట్టి సత్యమనే ఈ సాధనే అంతిమ విజయాన్ని సాధించి పెడుతుంది).

ఆ నిధానం ఏమిటి? ఎలాంటి ధర్మాలు కలిగియున్నది? అనేది చెప్తున్నారు.

**బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి .**
**దూరాత్సుదూరే తదిహాన్తికే చ పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ .. 3.1.7 ..**

అది సర్వోన్నతమైనది మరియు దివ్యమైన, ఆలోచింపరాని రూపం. సూక్ష్మమైనదానికన్నా సూక్ష్మతమం. అనేక విధాలుగా భాసిస్తుంది. దూరమైన వాటికన్నా దూరమైనదీ మరియు అది ఈ దేహంలోనే అంతరంగా ఉన్నట్టిది కూడా. చైతన్యరూపాలలోని హృదయాకాశంలో స్థిరంగా ఉన్నట్టిది.

## శంకరుల భాష్యం

బృహత్ మహచ్చ తత్ ప్రకృతం బ్రహ్మ సత్యాదిసాధనేన సర్వతో వ్యాప్తత్వాత్ . దివ్యం స్వయంప్రభమనింద్రియగోచరం అత ఏవ న చింతయితుం శక్యతేఽస్య రూపమితి అచింత్యరూపం . సూక్ష్మాదాకాశాదేరపి తత్సూక్ష్మతరం , నిరతిశయం హి సౌక్ష్మ్యమస్య సర్వకారణత్వాత్ ; విభాతి వివిధమాదిత్యచంద్రాద్యాకారేణ భాతి దీప్యతే . కించ, దూరాత్



విప్రకృష్టాద్దేశాత్సుదూరే విప్రకృష్టతరే దేశే వర్తతేఽవిదుషామత్యంతాగమ్యత్వాత్తద్బ్రహ్మ . ఇహ దేహే అంతికే సమీపే చ, విదుషామాత్మత్వాత్ . సర్వాంతరత్వాచ్చాకాశస్యాప్యంతరశ్రుతేః . ఇహ పశ్యత్సు చేతనావత్స్విత్యేతత్ , నిహితం స్థితం దర్శనాదిక్రియావత్త్వేన యోగిభిర్లక్ష్యమాణం . క్వ ? గుహాయాం బుద్ధిలక్షణాయాం . తత్ర హి నిగూఢం లక్ష్యతే విద్వద్భిః . తథాప్యవిద్యయా సంవృతం సన్న లక్ష్యతే తత్రస్థమేవావిద్వద్భిః ..

పునరప్యసాధారణం తదుపలబ్ధిసాధనముచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తత్** ప్రస్తావించబడుతున్న బ్రహ్మ సత్యం మొదలుగాగల సాధనాలతో సర్వత్రా వ్యాపించియున్నది కాబట్టి **బృహత్** చాలా గొప్పది **చ** మరియు **దివ్యమ్** స్వయం ప్రకాశకత్వం కలిగి ఇంద్రియాలకు గోచరం కానిదైనందున **అచింత్యరూపమ్** ఆలోచించ శక్యం కాని రూపం. **సూక్ష్మాత్** సూక్ష్మమైన ఆకాశాదులకన్నా **తత్ సూక్ష్మతరమ్** అది సూక్ష్మతరమైనది. సర్వానికీ అదే కారణం కావడం చేత, ఆ సూక్ష్మత్వానికన్నా సూక్ష్మమైనది మరొకటి లేదు. **విభాతి** సూర్యుడు చంద్రుడు మొదలుగా గల రూపాలలో వేర్వేరుగా ప్రకాశిస్తుంది. మరింకా, **దూరాత్** అత్యంత దూరంగానున్న ప్రదేశాలకన్నా **సుదూరే** మరింత దూరంలో ఉన్నట్టిది. ఎందుకంటే, **తత్** ఆ బ్రహ్మ అజ్ఞానులు ఎంతమాత్రమూ అందుకోలేనిది కాబట్టి. జ్ఞానులకు అది ఆత్మయే అయి ఉన్నందుచేత, **ఇహ అంతికే చ** దేహంలోనే

సమీపంగా ఉన్నది కూడా. సర్వానికి అంతరంగా ఉన్నందువల్ల, 'ఆకాశానికి లోపల బ్రహ్మమే ఉన్నది' ['య ఆకాశే తిష్ఠన్నాకాశాదన్తరః' (బృ.ఉ. 3-7-12)] అని శ్రుతి చెప్పింది. **ఇహ పశ్యత్సు** చేతనం కలవానియందు **నిహితమ్** స్థితికలిగినదానిగా యోగులచే దర్శనాది క్రియలద్వారా లక్షించబడుతుంది. ఎక్కడ? **గుహాయామ్** బుద్ధి అనబడే లక్షణం కలిగిన దానిలో, జ్ఞానులు అక్కడ గుప్తంగా ఉన్నదని గుర్తించి దర్శిస్తారు. అలా (బుద్ధి గుహలోనే బ్రహ్మము గుప్తంగా సిద్ధంగా) ఉన్నప్పటికీ అవిద్యచేత ఆవరించబడియున్నందున అజ్ఞానులు దానిని దర్శించలేరు.

అయితే ఈ అసాధారణ ధర్మాలు కలదైనప్పటికీ, ఆ బ్రహ్మమును పొందేందుకు సాధనాలను గురించి చెప్తున్నారు.

**న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా .**
**జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః .. 3.1.8 ..**

కన్నులచే గ్రహించబడనిది, వాక్కుచేత గాని ఇతర ఇంద్రియాలచేత గాని తపస్సు లేదా కర్మల చేత గాని గ్రహించబడనిది అయినప్పటికీ, జ్ఞానం చేత ప్రసన్నత



పొందిన శుద్ధమైన మనసునందు ధ్యానించబడిన ఆ అఖండ తత్వం దర్శనీయమవుతుంది.

## శంకరుల భాష్యం

యస్మాత్ న చక్షుషా గృహ్యతే కేనచిదప్యరూపత్వాత్ నాపి గృహ్యతే వాచా అనభిధేయత్వాత్ న చాన్యైర్దేవైః ఇతరేంద్రియైః . తపసః సర్వప్రాప్తిసాధనత్వేఽపి న తపసా గృహ్యతే . తథా వైదికేనాగ్నిహోత్రాదికర్మణా ప్రసిద్ధమహత్త్వేనాపి న గృహ్యతే . కిం పునస్తస్య గ్రహణే సాధనమిత్యాహ — జ్ఞానప్రసాదేన ఆత్మావబోధనసమర్థమపి స్వభావేన సర్వప్రాణినాం జ్ఞానం బాహ్యవిషయరాగాదిదోషకలుషితమప్రసన్నమశుద్ధం సన్నావబోధయతి నిత్యసంనిహితమప్యాత్మతత్త్వం మలావనద్ధమివాదర్శం , విలులితమివ సలిలం . తద్యదేంద్రియవిషయసంసర్గజనితరాగాదిమలకాలుష్యాపనయనాదాదర్శసలిలాదివత్ప్రసాదితం స్వచ్ఛం శాంతమవతిష్ఠతే, తదా జ్ఞానస్య ప్రసాదః స్యాత్ . తేన జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః విశుద్ధాంతఃకరణః యోగ్యో బ్రహ్మ ద్రష్టుం యస్మాత్ , తతః తస్మాత్తు తమాత్మానం పశ్యతే పశ్యతి ఉపలభతే నిష్కలం సర్వావయవభేదవర్జితం ధ్యాయమానః సత్యాదిసాధనవానుపసంహృతకరణ ఏకాగ్రేణ మనసా ధ్యాయమానః చింతయన్ ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఎందువల్లనంటే, **న చక్షుషా గృహ్యతే** రూపములేనిదైనందున ఎవనిచేతనైననూ గ్రహించబడలేనిది. **నాపి**

**వాచా** వాక్కుచేతకూడా ఇదమిద్ధంగా ఇది అని తేల్చి చెప్పబడేది కూడా కానిది, మరియు **న అన్యైః దేవైః** ఇతర ఇంద్రియాలచే కూడా తెలియబడేది కానిది. **తపసా** సర్వస్వాన్ని సాధించేదైన తపస్సు చేత గూడా గ్రహించను వీలుకానిది. **వా** లేక అదేవిధంగా **కర్మణా** వైదికమైన అగ్నిహోత్రాది ప్రసిద్ధమైనవి మహిమాన్వితమైనవి అయినట్టి కర్మల వల్ల కూడా పొందను వీలుకానిది. మరైతే ఇక దానిని గ్రహించే సాధనం ఏమిటో చెప్తున్నారు. **జ్ఞానప్రసాదేన** సకలప్రాణులలో స్వభావసిద్ధంగా ఉన్న జ్ఞానం ఆత్మను తెలుసుకొనే సామర్ధ్యం కలిగి ఉన్నదే. {ఇక్కడ 'జ్ఞానం' అనగా జ్ఞానసాధనం అంటే బుద్ధి లేదా 'దేనివలన జ్ఞానం కలుగుతుందో అది' అన్న అర్థాన్ని గ్రహించాలి – ఆనందగిరి టీక}. అయితే, (ఆ జ్ఞానం) బాహ్య విషయాలైన రాగ ద్వేషాదులతో కలుషితమైన కారణంగా ప్రసన్నతను కోల్పోయి స్వచ్ఛత లోపించి ఉన్నది. అందుచేత, (ఆ జ్ఞానం) ఎప్పుడూ ఆత్మతత్త్వానికి సన్నిహితంగానే ఉన్నప్పటికీ, మకిలి పట్టిన అద్దంలాగా, అలలు నిండిన నీరులాగా, ఆ ఆత్మతత్త్వాన్ని గ్రహించలేకపోతోంది. ఎప్పుడైతే ఇంద్రియాలు తెచ్చిపెట్టే బాహ్యవిషయాల నుండి జనించే రాగ-ద్వేషాది కాలుష్యాలు, శుభ్రం చేయబడిన అద్దం, అలజడి లేని జలాశయం లాగా, నిర్మూలించబడుతాయో, అప్పుడది (ఆ జ్ఞానం) స్వచ్ఛమై శాంతత్వాన్ని సంతరించుకొంటుంది. అదే జ్ఞానం యొక్క ప్రసాదము. అటువంటి **జ్ఞానప్రసాదేన** జ్ఞానప్రసాదం చేత ఎప్పుడైతే **విశుద్ధసత్త్వః** విశుద్ధమైన అంతఃకరణ బ్రహ్మ దర్శనానికి యోగ్యతను సంతరించుకొంటుందో **తతః**



అప్పుడు **ధ్యాయమానః** సత్యము మొదలుగాగల సాధనలన్నింటినీ విడిచిపెట్టిన ఏకాగ్రమైన మనస్సుతో ధ్యానించిన వాడై **నిష్కలమ్** సకలమైన అవయవ విభాగ భేదములు లేనట్టి అంటే అఖండమైనట్టి **తమ్** దానిని ఆత్మను **పశ్యతే** దర్శిస్తాడు పొందుతాడు. {ధ్యానం ద్వారా ఆత్మదర్శనానికి దారితీయగల సమర్థత బుద్ధికి కలుగుతుంది. సంశయాదులకు అతీతమైన, ఈ ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన, జ్ఞానాన్ని అందుకోగల సమర్థత బుద్ధికి చేకూరి, తద్వారా పరమ సత్యం అవగతమౌతుంది. అంతేకాని, కేవలం ధ్యానమాత్రం చేత అది సాధ్యపడదు. – ఆనందగిరి టీక}.

**ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ప్రాణః పఞ్చధా సంవివేశ .**

**ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం యస్మిన్విశుద్ధే విభవత్యేష ఆత్మా .. 3.1.9 ..**

దేనియందైతే ప్రాణము పంచవిధాలుగా ప్రవేశించి ఉన్నదో అట్టి ఈ సూక్ష్మమైన ఆత్మ శుద్ధమైన జ్ఞానం చేత తెలియబడుతుంది. జీవులయందలి ఏ విశుద్ధమైన జ్ఞానంలో ఆత్మ ప్రకాశిస్తుందో అదియే

మనసు మరియు ఇతర ఇంద్రియాలన్నింటా పడుగు-పేకలవలె వ్యాపించి ఉంది.

## శంకరుల భాష్యం

యమాత్మానమేవం పశ్యతి, ఏషః అణుః సూక్ష్మః ఆత్మా చేతసా విశుద్ధజ్ఞానేన కేవలేన వేదితవ్యః . క్వాసౌ ? యస్మిన్ శరీరే ప్రాణః వాయుః పంచధా ప్రాణాపానాదిభేదేన సంవివేశ సమ్యక్ ప్రవిష్టః, తస్మిన్నేవ శరీరే హృదయే చేతసా జ్ఞేయ ఇత్యర్థః . కీదృశేన చేతసా వేదితవ్య ఇత్యాహ — ప్రాణైః సహేంద్రియైః చిత్తం సర్వమంతఃకరణం ప్రజానాం ఓతం వ్యాప్తం యేన క్షీరమివ స్నేహేన, కాష్ఠమివ చాగ్నినా . సర్వం హి ప్రజానామంతఃకరణం చేతనావత్ప్రసిద్ధం లోకే . యస్మింశ్చ చిత్తే క్లేశాదిమలవియుక్తే శుద్ధే విభవతి, ఏషః ఉక్త ఆత్మా విశేషేణ స్వేనాత్మనా విభవతి ఆత్మానం ప్రకాశయతీత్యర్థః ..

య ఏవముక్తలక్షణం సర్వాత్మానమాత్మత్వేన ప్రతిపన్నస్తస్య సర్వాత్మత్వాదేవ సర్వావాప్తిలక్షణం ఫలమాహ —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఆ విధంగా ఏ ఆత్మనైతే దర్శిస్తారో, **ఏషః** ఆ ఇది **అణుః** సూక్ష్మమైన **ఆత్మా చేతసా** కేవలం విశుద్ధమైన జ్ఞానంచేత (బుద్ధిచేత) మాత్రమే **వేదితవ్యః** తెలియబడుతుంది. ఎక్కడ తెలియబడుతుంది? **యస్మిన్** ఏ శరీరంలోనైతే **ప్రాణః** వాయువు **పఞ్చధా** ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానాలనే అయిదు బేధాలతో **సంనివేశ** చక్కగా



ప్రవేశించి ఉన్నదో అక్కడ, ఆ శరీరంలోగల హృదయమందు బుద్ధిచే తెలియబడుతుందని అభిప్రాయం. ఎటువంటి బుద్ధిచేత తెలియబడుతుందో చెప్తున్నారు. ఏ బుద్ధి చేతనైతే **ప్రజానామ్** ప్రాణులయొక్క **సర్వమ్ చిత్తమ్** అంతఃకరణమంతా **ప్రాణైః** ఇంద్రియాలతో సహ్, వెన్నచే వ్యాప్తమైయున్న పాలలాగా, కట్టెలో వ్యాప్తమైయున్న నిప్పులాగా, **ఓతమ్** వ్యాప్తమై ఉంటుందో. ఎందుకంటే, జగత్తులోని ప్రతి ప్రాణి చేతనత్వాన్ని కలిగి ఉంటుంది అన్నది లోకప్రసిద్ధమైన విషయమే కాబట్టి. మరింకా, **యస్మిన్ విశుద్ధే** ఏ బుద్ధిలోనయితే క్లేశాది దోషాలు నిర్మూలనమై స్వచ్ఛత్వం సిద్ధిస్తుందో అటువంటి బుద్ధిలో, ఈ పైన చెప్పబడిన ఆత్మ **విభవతి** విశిష్ఠత కలిగినదిగా తనయందేతాను ప్రకాశిస్తుంది అని అభిప్రాయం.

పైన చెప్పబడిన లక్షణాలు కలిగి, సకలానికి ఆత్మ స్వరూపమైనదానిని తన ఆత్మగా దర్శించిన వానికి సర్వాన్ని వ్యాపించటమనే లక్షణం కలిగిన సర్వాత్మభావం ప్రతిఫలంగా అందుతుందనే విషయాన్ని (తర్వాతి మంత్రంలో) చెప్పబోతున్నారు.

**యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్ .**
**తం తం లోకం జయతే తాంశ్చ కామాంస్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః .. 3.1.10 ..**

విశుద్ధ చేతనుడు, ఏ ఏ లోకాలను మనసులో భావన చేస్తాడో ఆయా లోకాలను మరియు ఏ కోరికలను కోరుకొంటాడో ఆయా కోరికలను జయిస్తాడు. అందువలన, అభివృద్ధిని కాంక్షించేవాడు ఆత్మజ్ఞానిని ఆరాధించాలి.

## శంకరుల భాష్యం

యం యం లోకం పిత్రాదిలక్షణం మనసా సంవిభాతి సంకల్పయతి మహ్యమన్యస్మై వా భవేదితి, విశుద్ధసత్త్వః క్షీణక్లేశః ఆత్మవిన్నిర్మలాంతఃకరణః కామయతే యాంశ్చ కామాన్ ప్రార్థయతే భోగాన్ , తం తం లోకం జయతే ప్రాప్నోతి తాంశ్చ కామాన్సంకల్పితాన్భోగాన్ . తస్మాద్విదుషః సత్యసంకల్పత్వాదాత్మజ్ఞమాత్మజ్ఞానేన విశుద్ధాంతఃకరణం హ్యర్చయేత్పూజయేత్పాదప్రక్షాలనశుశ్రూషానమస్కారాదిభిః భూతికామః విభూతిమిచ్ఛుః . తతః పూజార్హ ఏవాసౌ ..

.. ఇతి తృతీయముండకే ప్రథమఖండభాష్యం ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**విశుద్ధసత్త్వః** క్లేశాలు (అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అనేవి పంచక్లేశాలు – ప.యో. 2-3) నశించి, నిర్మలమైన అంతఃకరణతో ఆత్మను తెలుసుకొన్న వాడు **యమ్ యమ్ లోకమ్** ఏ ఏ



లోకాలను అంటే పితృలోకం వంటి వాటిని తనకోసంగాని ఇతరుల కోసంగాని **మనసా సంవిభాతి** మనసులో సంకల్పిస్తాడో, **కామయతే యామ్ చ కామాన్** మరియు భోగాలను కోరుతాడో, **తమ్ తమ్ లోకమ్ జయతే** ఆ యా లోకాలను పొందుతాడు, **తామ్ చ కామాన్** మరియు ఆయా సంకల్పించిన కోరికలను (పొందుతాడు). **తస్మాత్** అందుచేత, **భూతికామః** సంపదలను కోరుకొనేవారు, జ్ఞానుల సంకల్పం సత్యమే అవుతుంది కాబట్టి **అత్మజ్ఞమ్** స్వచ్ఛమైన అంతఃకరణం కల ఆత్మజ్ఞానులను **హి అర్చయేత్** పాద ప్రక్షాలన-శుశ్రూష-నమస్కారాదులతో పూజించి తీరాలి. కాబట్టి, ఆ విధంగా అట్టివారు నిశ్చయంగా ఆరాధనీయులు.

.. తృతీయ ముండకంలోని ప్రథమఖండ భాష్యానువాదం సమాప్తం ..

# తృతీయ ముండకము

# ద్వితీయ ఖండము

**స వేదైతత్పరమం బ్రహ్మ ధామ యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్ .**
**ఉపాసతే పురుషం యే హ్యకామాస్తే శుక్రమేతదతివర్తన్తి ధీరాః .. 3.2.1 ..**

అతడు (ఆ జ్ఞాని), ఎక్కడైతే జగత్తు నిలిచి స్వచ్ఛంగా ప్రకాశిస్తుందో, ఆ పరమ బ్రహ్మయొక్క అధిష్టానాన్ని తెలుసుకొన్నవాడు. ఆ జ్ఞాన పురుషుడిని, కామనలు లేని వివేకులు, ఆరాధించి (జనన మరణ కారకమైన) మానవబీజాన్ని అధిగమిస్తారు.

## శంకరుల భాష్యం

యస్మాత్ స వేద జానాతి ఏతత్ యథోక్తలక్షణం బ్రహ్మ పరమం ప్రకృష్టం ధామ సర్వకామానామాశ్రయమాస్పదం , యత్ర యస్మిన్బ్రహ్మణి ధామ్ని విశ్వం



సమస్తం జగత్ నిహితం అర్పితం , యచ్చ స్వేన జ్యోతిషా భాతి శుభ్రం శుద్ధం , తమప్యేవంవిధమాత్మజ్ఞం పురుషం యే హి అకామాః విభూతితృష్ణావర్జితా ముముక్షవః సంతః ఉపాసతే పరమివ దేవం , తే శుక్రం నృబీజం యదేతత్ప్రసిద్ధం శరీరోపాదానకారణం అతివర్తంతి అతిగచ్ఛంతి ధీరాః బుద్ధిమంతః, న పునర్యోనిం ప్రసర్పంతి . 'న పునః క్వ రతిం కరోతి' ( ? ) ఇతి శ్రుతేః . అతస్తం పూజయేదిత్యభిప్రాయః .

ముముక్షోః కామత్యాగ ఏవ ప్రధానం సాధనమిత్యేతద్దర్శయతి —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

ఎందువల్లనంటే (గతించిన ఖండంలో చెప్పబడిన జ్ఞాని ఎందువల్ల ఆరాధనీయుడో చెప్తున్నారు). **సః** అతడు **ఏతత్** ఈ చెప్పబడిన లక్షణాలు కలిగిన **బ్రహ్మ** బ్రహ్మమును **పరమమ్** సర్వాతిశయమైన **ధామ** సకలమైన కోరికలకు ఆశ్రయమైనట్టి స్థానాన్ని **యత్ర** ఏ బ్రహ్మయందు అధిష్టానమందు **విశ్వమ్** సమస్తమైన జగత్తు **నిహితమ్** ప్రతిష్ఠితమై **భాతి శుభ్రమ్** స్వయం ప్రకాశంతో స్వచ్ఛంగా వెలుగుతుందో, దానిని **వేద** తెలుసుకొన్నవాడు. అటువంటి ఆత్మజ్ఞానియైన **పురుషమ్** మానవుడిని **యే హి అకామాః** సంపదల పట్ల కోరికలను త్యజించినట్టి ఏ ముముక్షువులైనట్టి సాధకులు **ఉపాసతే** పరమదైవంగా ఆరాధిస్తారో, **తే ధీరాః** అట్టి వివేకవంతులు **శుక్రమ్** శరీరమనే ఉపాధికి కారణమైన, లోక ప్రసిద్ధమైన మానవ బీజాన్ని **అతివర్తన్తి** అధిగమిస్తారు. తిరిగి తల్లిగర్భాన్ని చేరరు. 'తిరిగి

దేనియందునూ ప్రీతిని చేయడు' ['న పునః క్వ రతిం కరోతి'] అని శ్రుతి వాక్యం కూడా చెప్తోంది. అందుచేత, వారిని (జ్ఞానులను) ఆరాధించాలి అని అభిప్రాయం.

మోక్షాన్ని కోరే సాధకులకు కోరికల త్యాగమే ప్రధాన సాధనమని ఈ క్రింది మంత్రంలో చెప్తున్నారు.

**కామాన్యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః**
**.. 3.2.2 ..**

ఎవడైతే కోరికలను కోరుతూ వాటి పట్ల ఆసక్తి కలిగి ఉంటాడో అతడు కోరికలతోపాటుగా అవి లభ్యమయ్యే పరిసరాల్లోనే జన్మిస్తాడు. పూర్తిగా కోరికలు తీరిన ఆత్మజ్ఞానికైతే సమస్తమైన కోరికలు ఇక్కడే విలీనమై పోతాయి.

## శంకరుల భాష్యం

కామాన్ యః దృష్టాదృష్టేష్టవిషయాన్ కామయతే మన్యమానః తద్గుణాంశ్చింతయానః ప్రార్థయతే, సః తైః కామభిః



కామైర్ధర్మాధర్మప్రవృత్తిహేతుభిర్విషయేచ్ఛారూపైః సహ జాయతే ; తత్ర తత్ర, యత్ర యత్ర విషయప్రాప్తినిమిత్తం కామాః కర్మసు పురుషం నియోజయంతి, తత్ర తత్ర తేషు తేషు విషయేషు తైరేవ కామైర్వేష్టితో జాయతే . యస్తు పరమార్థతత్త్వవిజ్ఞానాత్పర్యాప్తకామః ఆత్మకామత్వేన పరి సమంతతః ఆప్తాః కామా యస్య, తస్య పర్యాప్తకామస్య కృతాత్మనః అవిద్యాలక్షణాదపరరూపాదపనీయ స్వేన పరేణ రూపేణ కృత ఆత్మా విద్యయా యస్య, తస్య కృతాత్మనస్తు ఇహైవ తిష్ఠత్యేవ శరీరే సర్వే ధర్మాధర్మప్రవృత్తిహేతవః ప్రవిలీయంతి ప్రవిలీయంతే విలయముపయాంతి, నశ్యంతీత్యర్థః . కామాః తజ్జన్మహేతువినాశాన్న జాయంత ఇత్యభిప్రాయః ..

యద్యేవం సర్వలాభాత్పరమ ఆత్మలాభః, తల్లాభాయ ప్రవచనాదయ ఉపాయా బాహుల్యేన కర్తవ్యా ఇతి ప్రాప్తే, ఇదముచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యః** ఎవడు **కామాన్** కనిపించేవి, కనపడని ఇష్టమైన విషయాలను **కామయతే మన్యమానః** వాటి గుణాల గురించి ఆలోచిస్తూ కోరుకొంటాడో, **సః** అతడు ఆయా **కామభిః** కోరికలతో, అంటే పుణ్య పాప ప్రవృత్తులకు కారణమయ్యే విషయాలపట్ల ఆసక్తితో కలిసి **జాయతే** జన్మిస్తాడు. **తత్ర తత్ర** కోరిన విషయాలను సాధించడం కోసం కోరికలు మానవుడిని ఎక్కడెక్కడ కర్మలయందు నియోగిస్తాయో, అక్కడక్కడ ఆయా విషయాలయందు పరిసరాలందు మాత్రమే కోరికలతో చుట్టుముట్టబడిన వాడై జన్మిస్తాడు. ఎవడైతే పరమార్థ తత్త్వాన్ని తెలిసికోవడం చేత ఇతరమైన కోరికలన్నీ పూర్తిగా తీరినవాడై, కేవలం

ఆత్మగురించిన కోరిక మాత్రంచేత సకలమైన కోరదగిన వాటన్నింటినీ పొందినవాడో అతడు పర్యాప్తకాముడు. **పర్యాప్తకామస్య** అటువంటి పర్యాప్తకాముని యొక్క **కృతాత్మనః** ఎవడైతే అజ్ఞానలక్షణమైన జీవరూపాన్ని తొలగించుకొని జ్ఞానం చేత తన పరమమైన రూపాన్ని చేరుకొంటాడో (అంటే తెలుసుకొంటాడో) అతనికైతే, **ఇహైవ** ఈ దేహమందు ఉండగానే **కామాః** అన్నిరకాల పుణ్య పాప కర్మలకు కారణమైన సమస్తమైన కోరికలు **ప్రవిలీయన్తి** విలయాన్ని పొందుతాయి అంటే నశిస్తాయని అభిప్రాయం. జన్మకు కారణమైన కోరికలు సమూలంగా నశించడం చేత తిరిగి జన్మించడని అభిప్రాయం.

పొందవలసిన వాటన్నింటిలోకెల్లా పొందతగినది ఆత్మ అయినట్లైతే, దానిని పొందటానికి శాస్త్రాధ్యయనాన్ని ఎక్కువగా చేయటమే ఉపాయం అని అనిపిస్తోంది కాబట్టి, ఇలా అంటున్నారు.

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన .**
**యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం (తనుం) స్వామ్ .. 3.2.3 ..**

ఈ ఆత్మ అధ్యయనం చేతగాని, మేధస్సు చేతగాని, బాగా శ్రవణం చేసినంత మాత్రానగాని లభించదు.



ఎవడైతే దీనిని (తీవ్రమైన కోరికతో) వరిస్తాడో అతనికే లభ్యం. అతనికే ఈ ఆత్మ తనంతతానుగా తన స్వస్వరూపాన్ని తెలియపరచుకొంటుంది.

## శంకరుల భాష్యం

యః అయమాత్మా వ్యాఖ్యాతః, యస్య లాభః పరః పురుషార్థః, నాసౌ వేదశాస్త్రాధ్యయనబాహుల్యేన ప్రవచనేన లభ్యః . తథా న మేధయా గ్రంథార్థధారణశక్త్యా, న బహునా శ్రుతేన నాపి భూయసా శ్రవణేనేత్యర్థః . కేన తర్హి లభ్య ఇతి, ఉచ్యతే — యమేవ పరమాత్మానమేవ ఏషః విద్వాన్ వృణుతే ప్రాప్తుమిచ్ఛతి, తేన వరణేన ఏష పర ఆత్మా లభ్యః, నాన్యేన సాధనాంతరేణ, నిత్యలబ్ధస్వభావత్వాత్ . కీదృశోఽసౌ విదుష ఆత్మలాభ ఇతి, ఉచ్యతే — తస్య ఏష ఆత్మా అవిద్యాసంఛన్నాం స్వాం పరాం తనూం స్వాత్మతత్త్వం స్వరూపం వివృణుతే ప్రకాశయతి, ప్రకాశ ఇవ ఘటాదిర్విద్యాయాం సత్యామావిర్భవతీత్యర్థః . తస్మాదన్యత్యాగేనాత్మప్రార్థనైవ ఆత్మలాభసాధనమిత్యర్థః ..

ఆత్మప్రార్థనాసహాయభూతాన్యేతాని చ సాధనాని బలాప్రమాదతపాంసి లింగయుక్తాని సంన్యాససహితాని . యస్మాత్ -

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యః** ఎవడైతే **అయమాత్మా** దేనిని పొందితే పరమ పురుషార్థాన్ని సాధించినట్లో అట్టి ఈ వ్యాఖ్యానించబడే ఆత్మ **ప్రవచనేన**

విస్తృతంగా వేదాన్ని శాస్త్రాన్ని అధ్యయనం చేయడం వల్ల **న లభ్యః** లభించదు. అలాగే **న మేధయా** మేధస్సు చేత అంటే గ్రంథాల యొక్క అర్థాన్ని గ్రహించే శక్తి వల్ల కూడా లభించదు. **న బహునా శ్రుతేన** ఎక్కువగా శ్రవణం చేయడం వల్లనూ లభించదు అని అభిప్రాయం. మరైతే, ఏ విధంగా లభిస్తుందో చెప్తున్నారు. **యమ్ ఏవ** ఏ పరమాత్మనైతే **ఏషః** ఈ విద్వాంసుడు **వృణుతే** పొందాలని కోరుతాడో, **తేన** ఆ కోరికచేతనే {నేనే బ్రహ్మముననే నిరంతర చింతనతో మాత్రమే – స్వామి గంభీరానంద} **ఏష** ఈ పరమ ఆత్మ **లభ్యః** లభ్యమౌతుంది. శాశ్వతంగా లభించియే ఉన్నదైనందుచేత, ఇతర సాధనాలచేత (నూతనంగా) లభించేది కాదు. ఏవిధంగా ముముక్షువునకు ఆత్మసిద్ధి కలుగుతుందో చెప్తున్నారు. **తస్య** అతని యొక్క **ఏష ఆత్మా** అజ్ఞానావృతమై ఉన్నట్టి ఈ ఆత్మ **స్వామ్ తనూమ్** పరమాతిశయమైన స్వరూపాన్ని ఆత్మయొక్క యదార్థతత్త్వాన్ని **వివృణుతే** ప్రకాశింపచేస్తుంది. వెలుగులో కుండ మొదలైనవి తెలియబడినట్లుగా, సత్యం ఆవిర్భవిస్తుంది అని అభిప్రాయం. అందుచేత, ఇతరములన్నింటిని విడిచిపెట్టి కేవలం ఆత్మకొరకై ప్రార్థించడమే ఆత్మసిద్ధికి సాధనమని అభిప్రాయపడుతున్నారు.

బలం, అప్రమత్తత, జ్ఞానం మరియు వాటిని సూచించే సాధనలు సంన్యాస ఆశ్రమంతో సహకరించి అభ్యసించతగినవి. అవి ఆత్మలబ్ధి కొరకై చేసే ప్రార్థనకు దోహదం చేస్తాయి. ఎందువల్లనంటే ---



**నాయమాత్మా బలహీనేన లభ్యో న చ ప్రమాదాత్తపసో వాఽప్యలిఙ్గాత్ .**
**ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాంస్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మ ధామ .. 3.2.4 ..**

ఈ ఆత్మ బలహీనులకు లభించదు. అప్రమత్తతలేని వారికి, జ్ఞానం లేనివారికి, సంన్యసించని వారికి కూడా లభించదు. ఏ వివేకి అయితే ప్రయత్నించి ఈ ఉపాయాలను (బలం-అప్రమత్తత-జ్ఞానం-సంన్యాసాలను) అభ్యసిస్తాడో అతని యొక్క ఈ ఆత్మ బ్రహ్మ స్థితిని ప్రవేశిస్తుంది.

## <u>శంకరుల భాష్యం</u>

న అయమాత్మా బలహీనేన బలప్రహీణేనాత్మనిష్ఠాజనితవీర్యహీనేన లభ్యః ; నాపి లౌకికపుత్రపశ్వాదివిషయాసంగనిమిత్తాత్ప్రమాదాత్ ; తథా తపసో వాపి అలింగాత్ లింగరహితాత్ . తపోఽత్ర జ్ఞానం ; లింగం సంన్యాసః ; సంన్యాసరహితాజ్జ్ఞానాన్న లభ్యత ఇత్యర్థః . ఏతైః ఉపాయైః బలాప్రమాదసంన్యాసజ్ఞానైః యతతే తత్పరః సన్ప్రయతతే యస్తు విద్వాన్వివేకీ ఆత్మవిత్ , తస్య విదుషః ఏష ఆత్మా విశతే సంప్రవిశతి బ్రహ్మ ధామ ..

కథం బ్రహ్మ విశత ఇతి, ఉచ్యతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**అయమాత్మా** ఈ ఆత్మ **బలహీనేన** బలహీనులకు ఆత్మనిష్ఠవల్ల కలిగే వీర్యత్వం లేనందువల్ల **న లభ్యః** లభించదు. **న చ ప్రమాదాత్** లౌకికంగా పుత్రులు, పశువులు మొదలైన విషయాలతో సాంగత్యం నిమిత్తంగా కలిగే ప్రమాదం వల్ల కూడా లభించదు. అలాగే **తపసో వాపి అలింగాత్** ఇక్కడ తపం అంటే జ్ఞానం అనీ లిఙ్గమ్ అంటే సంన్యాసం అనీ గ్రహించాలి. సంన్యసించనందువల్ల మరియు అజ్ఞానం వల్ల లభించదని అభిప్రాయం. {ఈ ఉపనిషత్తు ఉపోద్ఘాతంలోనూ మరియూ ఐతరేయ ఉపనిషత్తు ఉపోద్ఘాతంలోనూ శంకరులు (కాషాయధారణ-భిక్షాటన వంటి గుర్తులుగలిగిన) సంన్యాసాన్ని స్వీకరించవలసిందేనని అభిప్రాయపడుతున్నారు. కాని ఆనందగిరి ఇందులో విభేదిస్తున్నారు. 'ఇలా ఎందుకు అయి ఉండాలి? ఇంద్రుడు-జనకుడు-గార్గి వంటి వారు ఆత్మజ్ఞానం పొందినట్లు వేదం చెప్పింది కదా!' అని వారంటారు. ఈ అభ్యంతరం సరియైనదే. సంన్యాసమంటే సమస్తాన్ని త్యజించడమే. అక్కడ పొందటం అనేదే సంభవం కాదు కాబట్టి అంతరంగిక త్యాగమనేది స్పష్టమైన విషయమే. కేవలం బాహ్యమైన కాషాయధారణాది గుర్తుల చేత మూలాన్ని (అంతరంగిక త్యాగాన్ని) నిర్ణయించలేమన్న స్మృతి వాక్యం ప్రకారం కేవలం బాహ్యంలోని కాషాయధారణ-భిక్షాటనాది సూచికలే ప్రధానం కాదని



అభిప్రాయం – స్వామి గంభీరానంద}. **యస్తు విద్వాన్** ఏ వివేకవంతుడైతే **ఏతైః ఉపాయైః** బలం, అప్రమత్తత, సంన్యాసం, జ్ఞానం వంటి ఉపాయాలు కలిగి ఉంటాడో అతడు **ధామ** బ్రాహ్మీస్థితి యందు **విశతే** ప్రవేశిస్తాడు.

బ్రహ్మలో ఎలా ప్రవేశిస్తాడో చెప్తున్నారు.

**సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః .**
**తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మానః సర్వమేవావిశన్తి**
**.. 3.2.5 ..**

దీనిని పొందిన ఋషులు జ్ఞానతృప్తులు, ఆత్మనిష్ఠను సాధించినవారు, రాగాది దోష రహితులు, పరమశాంతి పొందినవారు (అవుతారు). ఆ వివేకులు లేదా జ్ఞానులు సర్వవ్యాపకమైన దాన్ని అంతటా పొంది, ఆత్మయందే నిమగ్నులై, అంతటా ప్రవేశిస్తారు.

## శంకరుల భాష్యం

సంప్రాప్య సమవగమ్య ఏనం ఆత్మానం ఋషయః దర్శనవంతః తేనైవ జ్ఞానేన తృప్తాః, న బాహ్యేన తృప్తిసాధనేన శరీరోపచయకారణేన . కృతాత్మానః పరమాత్మస్వరూపేణైవ నిష్పన్నాత్మానః సంతః . వీతరాగాః విగతరాగాదిదోషాః . ప్రశాంతాః ఉపరతేంద్రియాః . తే ఏవంభూతాః సర్వగం సర్వవ్యాపినం ఆకాశవత్ సర్వతః సర్వత్ర ప్రాప్య, నోపాధిపరిచ్ఛిన్నేనైకదేశేన ; కిం తర్హి, తద్బ్రహ్మైవాద్వయమాత్మత్వేన ప్రతిపద్య ధీరాః అత్యంతవివేకినః యుక్తాత్మానో నిత్యసమాహితస్వభావాః సర్వమేవ సమస్తం శరీరపాతకాలేఽపి ఆవిశంతి భిన్నఘటాకాశవదవిద్యాకృతోపాధిపరిచ్ఛేదం జహాతి . ఏవం బ్రహ్మవిదో బ్రహ్మ ధామ ప్రవిశంతి ..

కించ,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**ఋషయః** దర్శించడం తెలిసిన వారు **ఏనమ్** ఈ ఆత్మను **సంప్రాప్య** అనుభవానికి తెచ్చుకొని **జ్ఞానతృప్తాః** జ్ఞానముచే తృప్తినొందినవారౌతారు. అంతేగాని, బాహ్యంలోని తృప్తిని కలిగించే సాధనాల వల్ల శరీరానికి కలిగే సౌకర్యంచేత పొందే తృప్తి కాదు. **కృతాత్మానః** పరమాత్మ స్వరూపమే ఆత్మయనే భావన కలిగినవారౌతారు. **వీతరాగాః** రాగ-ద్వేషాది దోషములు త్యజించిన వారౌతారు. **ప్రశాన్తాః** ఇంద్రియవ్యాపారాలన్నీ ఉపశమించినవారౌతారు. **తే** అలా అయిన వారు, **సర్వగమ్** ఆకాశంలాగా సర్వవ్యాపకమైనదాన్ని



(బ్రహ్మమును), **సర్వతః** అంతటా పొంది. ఉపాధి భేదాలచేత కలిగే పరిమితులు లేనటువంటిది. (అలా సర్వవ్యాపకమైన బ్రహ్మాన్ని అంతటా పొందినందువల్ల) ఏమౌతుంది? అది తన ఆత్మకు వేరుగా రెండవదంటూ లేని ఆ బ్రహ్మయేననే స్థిరమైన అనుభవం కలిగిన **ధీరాః** అత్యంత వివేకం కలిగిన వారు **యుక్తాత్మానః** ఆత్మనిష్ఠయందే నిమగ్నమైనవారు **సర్వమేవ** సమస్తంలోనే, అజ్ఞానం వల్ల కలిగే ఘటాకాశం వంటి ఉపాధి భేదాలను విడనాడి, శరీర పతన కాలమందు కూడా **ఆవిశన్తి** ప్రవేశిస్తారు. ఈ విధంగా బ్రహ్మవేత్తలు బ్రహ్మ స్థితిని ప్రవేశిస్తారు.

అంతే కాక,

**వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః .**
**తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే**
**.. 3.2.6 ..**

వేదముల చివరలో చెప్పిన (ఉపనిషత్తులలో ప్రతిపాదితమైన) విజ్ఞానం యొక్క నిశ్చయమైన అర్థాన్ని చక్కగా గ్రహించగలిగిన వారు, సర్వకర్మ

పరిత్యాగమనబడే యోగాన్ని అభ్యసించి స్వచ్ఛమైన అంతఃకరణ కలిగిన యతులు, వారంతా (దేహాన్ని విడిచిపెట్టే) అంత్యకాలంలో, సమస్తం నుండి పూర్తిగా విడివడి బ్రహ్మలోకంలో బ్రహ్మీభూతులౌతారు.

## శంకరుల భాష్యం

వేదాంతజనితం విజ్ఞానం వేదాంతవిజ్ఞానం తస్యార్థః పర ఆత్మా విజ్ఞేయః, సోఽర్థః సునిశ్చితో యేషాం తే వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః . తే చ సంన్యాసయోగాత్ సర్వకర్మపరిత్యాగలక్షణయోగాత్కేవలబ్రహ్మనిష్ఠా స్వరూపాద్యోగాత్ యతయః యతనశీలాః శుద్ధసత్త్వాః శుద్ధం సత్త్వం యేషాం సంన్యాసయోగాత్ , తే శుద్ధసత్త్వాః . తే బ్రహ్మలోకేషు ; సంసారిణాం యే మరణకాలాస్తే అపరాంతకాలాః ; తానపేక్ష్య ముముక్షూణాం సంసారావసానే దేహపరిత్యాగకాలః పరాంతకాలః తస్మిన్ పరాంతకాలే సాధకానాం బహుత్వాద్బ్రహ్మైవ లోకో బ్రహ్మలోకః ఏకోఽప్యనేకవద్దృశ్యతే ప్రాప్యతే చ . అతో బహువచనం బ్రహ్మలోకేష్వితి, బ్రహ్మణీత్యర్థః . పరామృతాః పరం అమృతం అమరణధర్మకం బ్రహ్మ ఆత్మభూతం యేషాం తే పరామృతా జీవంత ఏవ బ్రహ్మభూతాః, పరామృతాః సంతః పరిముచ్యంతి పరి సమంతాత్ప్రదీపనిర్వాణవద్భిన్నఘటాకాశవచ్చ నివృత్తిముపయాంతి పరిముచ్యంతి పరి సమంతాన్ముచ్యంతే సర్వే, న దేశాంతరం గంతవ్యమపేక్షంతే . 'శకునీనామివాకాశే జలే వారిచరస్య వా . పదం యథా న దృశ్యేత తథా జ్ఞానవతాం గతిః' (మో. ధ. 181 . 9) 'అనధ్వగా అధ్వసు పారయిష్ణవః' ( ? )



ఇతి శ్రుతిస్మృతిభ్యాం ; దేశపరిచ్ఛిన్నా హి గతిః సంసారవిషయైవ, పరిచ్ఛిన్నసాధనసాధ్యత్వాత్ . బ్రహ్మ తు సమస్తత్వాన్న దేశపరిచ్ఛేదేన గంతవ్యం . యది హి దేశపరిచ్ఛిన్నం బ్రహ్మ స్యాత్ , మూర్తద్రవ్యవదాద్యంతవదన్యాశ్రితం సావయవమనిత్యం కృతకం చ స్యాత్ . న త్వేవంవిధం బ్రహ్మ భవితుమర్హతి . అతస్తత్ప్రాప్తిశ్చ నైవ దేశపరిచ్ఛిన్నా భవితుం యుక్తా ..

అపి చ, అవిద్యాదిసంసారబంధాపనయనమేవ మోక్షమిచ్ఛంతి బ్రహ్మవిదః, న తు కార్యభూతం . కించ,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

వేదాంతం (ఉపనిషత్తుల ద్వారా) ద్వారా జనించిన జ్ఞానం వేదాంత విజ్ఞానం. దాని యొక్క అర్థం పరమాత్మను తెలియుటయే. అటువంటి అర్థాన్ని చక్కగా నిశ్చయించి అనుభవంలోకి తెచ్చుకొన్నవారు **వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః**. మరియు వారు **సంన్యాసయోగాత్** సకల కర్మలను త్యజించడమనే లక్షణం కలిగిన యోగం అనగా కేవలం బ్రహ్మయందే నిష్ఠను కలిగి యుండుట ద్వారా **శుద్ధసత్త్వాః** సంన్యాసయోగం ద్వారా శుద్ధమైన అంతఃకరణ కలిగిన వారు **యతయః** ప్రయత్నించడమనే స్వభావం కలవారు యతులు, వారు **పరాంతకాలే** సంసారులకు కలిగే మరణకాలాన్ని అపరాంతకాలం అంటారు. దానితో పోలిస్తే, ముముక్షువులకు సంసారం ముగిసి దేహము తాను కాదనే భావన కలిగేకాలాన్ని పరాంతకాలం అంటారు.

అటువంటి **పరాంతకాలే** పరాంతకాలంలో, బ్రహ్మలోకం అనేది ఒక్కటే అయినప్పటికీ సాధకులు అనేకంగా ఉండటం చేత అనేకంగా ప్రాప్తిస్తున్నందుచేత **బ్రహ్మలోకేషు** అని బహువచనాన్ని వాడారు కాని, నిజానికి బ్రహ్మమునందే అని గ్రహించాలి. **పరామృతాః** పరం అమృతం మరణరహిత స్థితియైన బ్రహ్మయే తాననేభావంలో, జీవించియుండగనే బ్రహ్మీభూతులై ఉన్నవారై, **పరిముచ్యంతి** దీపం ఆరిపోయినట్లుగా, విచ్ఛిన్నమైన ఘటాకాశం లాగా, అన్ని విధాలైన లౌకిక బంధనాలనుండి పూర్తిగా విడిపడి పోతారు. ఎక్కడికైననూ వెళ్ళాలి అని అనుకోరు. (వైకుంఠానికి లేదా కైలాసానికి చేరాలి అనే భావనే ఉండదు). 'ఏ విధంగానైతే ఆకాశంలో పక్షి పయనించే జాడలు, నీటిలో చేప కదిలే జాడలు తెలియవో, ఆ విధంగా జ్ఞానుల గతి తెలియజాలదు' ['శకునీనామివాకాశే జలే వారిచరస్య వా. పదం యథా న దృశ్యేత తథా జ్ఞానవతాం గతిః' (మో.ధ. 181-9)]; 'లోకాతీత పయనాల పదచ్ఛాయలు తెలియబడవు' ['అనధ్వగా అధ్వసు పారయిష్ణవః' (ఇతిహాసోపనిషత్తు 18)] అని స్మృతులు కూడా చెప్తున్నాయి. మార్గాలు లేదా జాడలు సంసారిక విషయాలైనందున పరిమిత సాధనాలచే సాధించబడేవి అయినందున దేశమునందు (ఒక ప్రదేశానికి) పరిమితమై ఉంటాయి. కాని బ్రహ్మమైతే సమస్తం కాబట్టి దేశపరిమితిలో చేరుకొనేది కాదు. బ్రహ్మమే కనుక దేశపరిమితులు కలిగినదైతే, రూపంకలిగిన ద్రవ్యం లాగా, ఆది అంత్యాలు కలిగినదానిలాగా, వేరొక దానిని ఆశ్రయించినదానిగా, అవయవ



విభాగాలు కలిగి, అశాశ్వతమైనది, ఉత్పత్తి చేయబడినది అయి ఉండాలి. ఆ విధంగా బ్రహ్మ ఉండటానికి వీలేలేదు. అందుచేత, దేశపరిమితులకు లోబడి బ్రహ్మ ఉన్నదని భావించడం సరియైనది కాదు.

మరింకా బ్రహ్మవేత్తలు సంసార బంధనాలకు కారణమైన అవిద్య మొదలైనవాటిని పూర్తిగా నిర్మూలించే మోక్షాన్ని మాత్రమే అంగీకరిస్తారు కాని, (వేరేదానినుండి కొత్తగా పరిణమించే దాన్ని) ఉత్పన్నం కాబడే దాన్ని (మోక్షంగా) అంగీకరించరు.

ఇంతే కాక, మోక్ష సమయంలో --

**గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు**
**కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి**
**.. 3.2.7 ..**

పదునైదు కళలు వాటి కారణాంశలలో విలీనమౌతాయి. సకల దేవతలు వారి వారి అధిష్ఠానాలను పొందుతాయి. సకల కర్మలు మరియు బుద్ధిప్రధానమైన ఆత్మ అవ్యయమైన పరబ్రహ్మంలో ఏకమౌతాయి.

## శంకరుల భాష్యం

మోక్షకాలే యా దేహారంభికాః కలాః ప్రాణాద్యాః, తాః స్వాః ప్రతిష్ఠాః గతాః స్వం స్వం కారణం గతా భవంతీత్యర్థః . ప్రతిష్ఠా ఇతి ద్వితీయాబహువచనం . పంచదశ పంచదశసంఖ్యాకా యా అంత్యప్రశ్నపరిపఠితాః ప్రసిద్ధాః, దేవాశ్చ దేహాశ్రయాశ్చక్షురాదికరణస్థాః సర్వే ప్రతిదేవతాస్వాదిత్యాదిషు గతా భవంతీత్యర్థః . యాని చ ముముక్షుణా కృతాని కర్మాణ్యప్రవృత్తఫలాని, ప్రవృత్తఫలానాముపభోగేనైవ క్షీణత్వాత్ . విజ్ఞానమయశ్చాత్మా అవిద్యాకృతబుద్ధ్యాద్యుపాధిమాత్మత్వేన గత్వా జలాదిషు సూర్యాదిప్రతిబింబవదిహ ప్రవిష్టో దేహభేదేషు కర్మణాం తత్ఫలార్థత్వాత్సహ తేనైవ విజ్ఞానమయేనాత్మనా ; అతో విజ్ఞానమయో విజ్ఞానప్రాయః . త ఏతే కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా ఉపాధ్యపనయే సతి పరే అవ్యయే అనంతేఽక్షయే బ్రహ్మణి ఆకాశకల్పేఽజేఽజరేఽమృతేఽభయేఽపూర్వేఽనపరేఽనంతరేఽబాహ్యేఽద్వయే శివే శాంతే సర్వే ఏకీభవంతి అవిశేషతాం గచ్ఛంతి ఏకత్వమాపద్యంతే జలాద్యాధారాపనయ ఇవ సూర్యాదిప్రతిబింబాః సూర్యే, ఘటాద్యపనయ ఇవాకాశే ఘటాద్యాకాశాః ..

కించ,

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

మోక్ష సమయంలో, **పఞ్చదశ** పదునైదు సంఖ్యలుగలవి ప్రశ్నోపనిషత్తులోని ఆఖరి ప్రశ్నలో అధ్యయనం చేయబడి ఏవైతే ప్రసిద్ధమై యున్నాయో అవి **కలాః** ఆ అంశలు, అంటే



ప్రాణం మొదలుగాగల 15 అంశలు, వేటిచేతనైతే దేహం అనేది ప్రారంభించ బడినదవో అవి, **ప్రతిష్ఠాః గతాః** వాటి వాటి కారణాలలో చేరిపోతాయనే అభిప్రాయంతో 'ప్రతిష్ఠా' ద్వితీయా విభక్తి బహువచన రూపాన్ని ప్రయోగించారు. **చ** మరియు **సర్వే దేవాః** దేహాన్ని ఆశ్రయించి కన్నులు మొదలైన ఇంద్రియాలలో వసించి యున్న సకల దేవతలు వాటి **ప్రతిదేవతాసు** అధిష్ఠాన దేవతలైన సూర్యాదులయందు చేరిపోతారు అని అభిప్రాయం. **కర్మాణి** అంటే ముముక్షువులచే చేయబడి, ఇంకనూ ఫలాన్నివ్వడం ప్రారంభించని కర్మలు. ఎందుకంటే ఫలాన్నివ్వడం ప్రారంభించిన కర్మలు అనుభవించవల్లమాత్రమే క్షీణిస్తాయి కాబట్టి (ఇక్కడ ఫలప్రవృత్తం కాని కర్మలనే స్వీకరించాలి). **చ** మరియు **విజ్ఞానమయః ఆత్మా** నీటిలోని సూర్య ప్రతిబింబం లాగా, ఇక్కడ వివిధ దేహాలలో ప్రవేశించి అవిద్యచే కలిగిన పరిమితమైన ఉపాధులతో తాదాత్మ్యాన్ని పొంది బుద్ధిలా అనిపించే ఆత్మ. కర్మలనేవి (ఉపాధులతో తాదాత్మ్యాన్ని పొందిన ఆత్మకు) ఆ యా ఫలాలనిచ్చేందుకే కాబట్టి, ఈ కర్మలు మరియు బుద్ధిలా అనిపించే ఆత్మతో సహా, ఉపాధి తొలగిపోగా **పరే అవ్యయే** అనంతమైన, అవినాశిత్వమైనట్టి బ్రహ్మయందు, అంటే ఆకాశంవంటిది-పుట్టుకలేని-వృద్ధిలేని-మరణరహితమైన-భయరహితమైన-కారణకార్యరహితమైన-అంతరమూ కాని-బాహ్యమూకాని-రెండవదే లేని మంగళకరమైన, శాంతము నందు, **సర్వే ఏకీభవన్తి** విశిష్టతలు ఏవీ లేకుండా సమస్తమూ ఏకత్వాన్ని పొందుతాయి. ఇదెలాగంటే, నీరు మొదలైన గల ఆధారాలు

తొలగిపోగా సూర్యుని ప్రతిబింబాలు సూర్యుని యందు చేరినట్లుగా, ఘటం వంటివి తొలిగిపోగా ఘటాకాశం మహాకాశంలో చేరినట్లుగా, ఏకమైపోతాయి అని అభిప్రాయం.

ఇంకేమంటే,

**యథా నద్యః స్యన్దమానాః సముద్రేఽస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ .**
**తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ .. 3.2.8 ..**

ఎలాగైతే ప్రవహించే నదులు సముద్రంలో నామరూపాలను వదిలేసి కలిసిపోతాయో, అలాగే విద్వాంసుడు నామరూపాలనుండి స్వేచ్ఛనుపొంది (విడివడి) దివ్యమైన పరాత్పరుడైన పురుషుడిని చేరుతాడు.

## శంకరుల భాష్యం

యథా నద్యః గంగాద్యాః స్యందమానాః గచ్ఛంత్యః సముద్రే సముద్రం ప్రాప్య అస్తం అదర్శనమవిశేషాత్మభావం గచ్ఛంతి ప్రాప్నువంతి నామ చ రూపం చ నామరూపే విహాయ హిత్వా, తథా అవిద్యాకృతనామరూపాత్ విముక్తః సన్



విద్వాన్ పరాత్ అక్షరాత్పూర్వోక్తాత్ పరం దివ్యం పురుషం యథోక్తలక్షణం ఉపైతి ఉపగచ్ఛతి ..

నను శ్రేయస్యనేకే విఘ్నాః ప్రసిద్ధాః ; అతః క్లేశానామన్యతమేనాన్యేన వా దేవాదినా చ విఘ్నితో బ్రహ్మవిదప్యన్యాం గతిం మృతో గచ్ఛతి న బ్రహ్మైవ ; న, విద్యయైవ సర్వప్రతిబంధస్యాపనీతత్వాత్ . అవిద్యాప్రతిబంధమాత్రో హి మోక్షో నాన్యప్రతిబంధః, నిత్యత్వాదాత్మభూతత్వాచ్చ . తస్మాత్

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**యథా** ఏవిధంగానైతై **నద్యః** గంగాది నదులు **స్యన్దమానాః** ప్రవహించేవి **సముద్రే** సముద్రం నందు **అస్తమ్** కనపడకుండా వాటి ప్రత్యేకలేవీ లేకుండా **నామరూపే** నామాలను రూపాలను **విహాయ** విడిచిపెట్టి **గచ్ఛన్తి** చేరుతాయో, **తథా** అదేవిధంగా **నామరూపాత్** అవిద్యవల్ల కలిగిన నామరూపాలనుండి **విముక్తః** స్వేచ్ఛనుపొందినవాడై (విడివడిన వాడై) **విద్వాన్** జ్ఞాని **పరాత్** మొదట చెప్పిన అక్షరం అంటే అవినాశిత్వానికన్నా (మాయకన్నా) **పరమ్** అతీతమైన **దివ్యమ్ పురుషమ్** ముందు చెప్పబడిన లక్షణాలు కలిగిన దివ్యపురుషుడిని అంటే పరబ్రహ్మాన్ని **ఉపైతి** పొందుతాడు.

**సందేహం:** శ్రేయస్సును పొందే సందర్భంలో అనేక విఘ్నాలు కలుగుతాయన్నది ప్రసిద్ధమైన విషయమే కదా? అందుచేత, బ్రహ్మవేత్తకు కూడా, దేహం వీడిన తర్వాత బ్రాహ్మీస్థితి కాని దాన్ని,

ఇతరమైన మనోక్లేశాలవల్ల లేదా దేవతలు కలిగించే విఘ్నాలవల్ల లేదా మరేవిధంగానైనా గాని, పొందే అవకాశం ఉంది కదా?

**సమాధానం:** కాదు. ఎందుకంటే, జ్ఞానం సకల ప్రతిబంధకాలను నిర్మూలిస్తుంది కాబట్టి. మోక్షానికి కేవలం అవిద్యయే ప్రతిబంధకం. మిగిలిన ప్రతిబంధకాలేవీ లేవు. ఎందుకంటే మోక్షం శాశ్వతమైనది మరియు ఆత్మతో ఐక్యత్వం కలిగినట్టిది.

అందువలన,

**స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి .**
**తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి .. 3.2.9 ..**

ఎవడైతే ఆ పరబ్రహ్మమును తెలుసుకొంటాడో అతడు నిశ్చయంగా బ్రహ్మయే అవుతాడు. అతని వంశంలో బ్రహ్మమును తెలియనివాడెవడూ జన్మించడు. శోకాన్ని అధిగమిస్తాడు. ధర్మాధర్మాలను అధిగమిస్తాడు. హృదయగ్రంథుల నుండి విముక్తుడై అమృతుడౌతాడు.



## శంకరుల భాష్యం

సః యః కశ్చిత్ హ వై లోకే తత్ పరమం బ్రహ్మ వేద సాక్షాదహమేవాస్మీతి జానాతి, స నాన్యాం గతిం గచ్ఛతి . దేవైరపి తస్య బ్రహ్మప్రాప్తిం ప్రతి విఘ్నో న శక్యతే కర్తుం ; ఆత్మా హ్యేషాం స భవతి . తస్మాద్బ్రహ్మ విద్వాన్ బ్రహ్మైవ భవతి . కించ, న అస్య విదుషః అబ్రహ్మవిత్ కులే భవతి ; కించ, తరతి శోకం అనేకేష్టవైకల్యనిమిత్తం మానసం సంతాపం జీవన్నేవాతిక్రాంతో భవతి . తరతి పాప్మానం ధర్మాధర్మాఖ్యం గుహాగ్రంథిభ్యః హృదయావిద్యాగ్రంథిభ్యః విముక్తః సన్ అమృతః భవతీత్యుక్తమేవ 'భిద్యతే హృదయగ్రంథిః' (ము. ఉ. 2 . 2 . 9) ఇత్యాది ..

అథేదానీం బ్రహ్మవిద్యాసంప్రదానవిధ్యుపప్రదర్శనేనోపసంహారః క్రియతే —

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**సః యః** ఎవడైతే **హ వై** లోకంలో **తత్ పరమమ్ బ్రహ్మ వేద** ఆ పరబ్రహ్మాన్ని సాక్షాత్తుగా ఆ పరబ్రహ్మము తానే అని తెలుసుకొని అతడు దానికి వేరయిన స్థితిని పొందడు. దేవతలైనా ఆతనియొక్క బ్రహ్మప్రాప్తికి విఘ్నాలను కలిగించ లేరు. ఎందుకంటే, వారియొక్క (ఆ దేవతల యొక్క) ఆత్మగా అతడే అయినాడు కాబట్టి. అందువల్ల, బ్రహ్మవేత్త బ్రహ్మయే అవుతాడు. ఇంకేమంటే, **అస్య కులే** ఆ బ్రహ్మవేత్త వంశంలో **అబ్రహ్మవిత్** బ్రహ్మవేత్త కాని వాడు **భవతి** ఉండడు. ఇంకేమంటే, **తరతి శోకమ్** జీవించి యుండగనే ప్రీతి కలిగించని వాటి వల్ల మనసు పొందే సంతాపాన్ని అధిగమిస్తాడు. **తరతి పాప్మానమ్** ధర్మ-

అధర్మాలనే వాటిని అధిగమిస్తాడు. **గుహాగ్రంథిభ్యః** హృదయమందలి అవిద్యాగ్రంథుల నుండి **విముక్తః** విముక్తుడై (స్వేచ్ఛను పొందినవాడై) **అమృత భవతి** మరణ రహితుడౌతాడు. ఈ విషయాన్నే 'భిద్యతే హృదయగ్రంథిః' (ముం.ఉ. 2-2-9) అని ముందు పాఠంలో చెప్పారు.

ఇక ఈ బ్రహ్మవిద్యను అందజేసే నియమాలను వివరించడంద్వారా ఈ విషయాన్ని ముగిస్తున్నారు.

**తదేతదృచాఽభ్యుక్తమ్ —**

**క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయన్తః .**

**తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్ .. 3.2.10 ..**

ఈ విషయాన్ని ఋక్-మంత్రంలో ఇలా దర్శించబడింది.

ఎవరైతే వేదవిహిత కర్మలయందు క్రియాశీలురు, శ్రోత్రియులు మరియు బ్రహ్మనిష్ఠులో, స్వయంగా ఏకర్షి అనే హోమాన్ని శ్రద్ధగా నిర్వహిస్తారో వారికి మాత్రమే



ఈ బ్రహ్మవిద్యను శిరోవ్రతాన్ని విధిప్రకారంగా ఆచరించినట్టివారు బోధించాలి.

## శంకరుల భాష్యం

తదేతత్ విద్యాసంప్రదానవిధానం ఋచా మంత్రేణ అభ్యుక్తం అభిప్రకాశితం . క్రియావంతః యథోక్తకర్మానుష్ఠానయుక్తాః . శ్రోత్రియాః బ్రహ్మనిష్ఠాః అపరస్మిన్బ్రహ్మణ్యభియుక్తాః పరం బ్రహ్మ బుభుత్సవః స్వయం ఏకర్షిం ఏకర్షినామానమగ్నిం జుహ్వతే జుహ్వతి శ్రద్ధయంతః శ్రద్దధానాః సంతః యే, తేషామేవ సంస్కృతాత్మనాం పాత్రభూతానాం ఏతాం బ్రహ్మవిద్యాం వదేత బ్రూయాత్ శిరోవ్రతం శిరస్యగ్నిధారణలక్షణం . యథా ఆథర్వణానాం వేదవ్రతం ప్రసిద్ధం . యైస్తు యైశ్చ తత్ చీర్ణం విధివత్ యథావిధానం తేషామేవ వదేత ..

## శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తదేతత్** ఈ బ్రహ్మవిద్యను అందించే విధానం **ఋచా** ఋక్ మంత్రము ద్వారా **అభ్యుక్తమ్** ప్రకటించబడుతోంది. **క్రియావన్తః** వేదంలో చెప్పిన విధానంగా కర్మానుష్ఠానాన్ని కలిగినవారై, **శ్రోత్రియాః బ్రహ్మనిష్ఠాః** అపరబ్రహ్మయందు నిష్ఠ కలిగి, పరబ్రహ్మను తెలియగోరువారికి, **స్వయమ్ ఏకర్షిమ్** ఏకర్షి అనే పేరుగల **జుహ్వతే** అగ్నిహోమాన్ని చేయడంలో **శ్రద్ధయన్తః** శ్రద్ధ కలిగిన వారికి, అట్టి సంస్కారాలు కలిగివారికి, ఆ విధమైన అర్హతలు కలిగిన వారికి, **ఏతామ్ బ్రహ్మవిద్యామ్** ఈ బ్రహ్మవిద్యను బోధించాలి. (బోధించేవారి అర్హత ఎలా

ఉండాలి అన్నదానికి సమాధానం చెప్తున్నారు). **యః తుః** ఎవరైతే **శిరోవ్రతమ్** శిరస్సునందు అగ్నిధారణం అనే లక్షణం కలిగిన అథర్వణ వేదంలోని ప్రసిద్ధమైన వ్రతాన్ని **విధివత్** యథావిధిగా ఆచరించడంలో **తత్ చీర్ణమ్** సఫలీకృతులైనారో వారు మాత్రమే **వదేత** బోధించాలి.

**తదేతత్సత్యమృషిరఙ్గిరాః పురోవాచ నైతదచీర్ణవ్రతోఽధీతే .**

**నమః పరమఋషిభ్యో నమః పరమఋషిభ్యః .. 3.2.11 ..**

ఆ ఈ సత్యాన్నే పూర్వం అఙ్గీరసుడనే ఋషి (శౌనకునకు) బోధించాడు. దీనిని ప్రమాణాలను పాటించని వాడు అధ్యయనం చేయరాదు. మహా ఋషులకు నమఃస్కారం. మహర్షులకు నమఃస్కారం.

### శంకరుల భాష్యం

తదేతత్ అక్షరం పురుషం సత్యం ఋషిః అంగిరా నామ పురా పూర్వం శౌనకాయ విధివదుపసన్నాయ పృష్టవతే ఉవాచ . తద్వదన్యోఽపి తథైవ శ్రేయోర్థినే ముముక్షవే మోక్షార్థం విధివదుపసన్నాయ బ్రూయాదిత్యర్థః . న ఏతత్ గ్రంథరూపం అచీర్ణవ్రతః అచరితవ్రతోఽపి అధీతే న పఠతి ; చీర్ణవ్రతస్య హి విద్యా ఫలాయ సంస్కృతా భవతీతి . సమాప్తా బ్రహ్మవిద్యా ; సా యేభ్యో బ్రహ్మాదిభ్యః పారంపర్యక్రమేణ సంప్రాప్తా, తేభ్యో నమః పరమఋషిభ్యః . పరమం



బ్రహ్మ సాక్షాద్దృష్టవంతో యే బ్రహ్మాదయోఽవగతవంతశ్చ, తే పరమర్షయః తేభ్యో భూయోఽపి నమః . ద్విర్వచనమత్యాదరార్థం ముండకసమాప్త్యర్థం చ ..

.. ఇతి తృతీయముండకే ద్వితీయఖండభాష్యం ..

### శంకరుల భాష్యానికి తెలుగు అనువాదం

**తదేతత్** అవినాశియైన పురుషుని గురించిన **సత్యమ్** యదార్థతత్త్వాన్ని **ఋషిః అఙ్గిరాః** అంగిరసుడనే పేరుగల ఋషి **పురా** పూర్వం యదావిధిగా తనను సమీపించి ప్రశ్నించిన శౌనకునకు బోధించాడు. అదేవిధంగా శ్రేయస్సును కోరుకొనేవారు, వేద నియమాల ప్రకారం మోక్షాన్ని కోరుకొనే ముముక్షువులు ఎవరైనా కూడా తమను సమీపించినపుడు, అలాగే బోధనచేయాలి అని అభిప్రాయం. **అచీర్ణవ్రతః** చెప్పబడిన ప్రమాణాలను పాటించని వాడు **ఏతత్** ఈ గ్రంథరూపమైన పాఠాన్ని **న అధీతే** అధ్యయనం చేయరాదు. చీర్ణవ్రతునికే అనగా ప్రమాణాలు పాటించిన వానికే విద్యయొక్క ఫలం చక్కగా అందుతుంది. బ్రహ్మవిద్య ఇంతటితో పూర్తి అయింది. బ్రహ్మతో మొదలిడి పరంపరా క్రమంగా ఎవరినుండి అయితే ఈ బ్రహ్మవిద్య సంప్రాప్తించిందో వారికి, అంటే పరమ ఋషులకు నమఃస్కారం. పరబ్రహ్మన్ని సాక్షాత్తుగా దర్శించి అనుభవించిన ఏ బ్రహ్మాది పరమ ఋషులున్నారో వారికి మరలా కూడా నమఃస్కారం. రెండవ మారు చెప్పడం (పరమ ఋషి పరంపర యొక్క) గొప్పదనాన్ని శ్లాఘించడాన్ని మరియు ముండక ఉపనిషత్తు సమాప్తిని కూడా సూచనచేస్తోంది.

.. శ్రీమత్ పరమహంస ప్రరివ్రాజకాచార్యులైన శ్రీగోవిందభగవత్పూజ్యపాదుల శిష్యులైన శ్రీమత్ శంకర భగవత్పాదులు రచించిన ముండకోపనిషత్తు భాష్యం సమాప్తం ..

**- ప్రార్ధన -**

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం**
**పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరైరఙ్గైస్తుష్టువాగ్ం సస్తనూభిర్వ్యశేమ దేవహితం**
**యదాయుః ..**
**స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్తి నస్తార్ క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో**
**బృహస్పతిర్దధాతు ..**
**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

**.. ఓం తత్ సత్ ..**